# చతుర




SF 37968

జనవరి 2008

రూ.10/-

హోతా పద్మినీదేవి

సకుటుంబ నవల

**సరిత**



# విపుల ఆహ్వానము

# అనువాద కథలకు

సుతిమెత్తని సంవేదనలు

అనురాగభరిత ఆత్మ నివేదనలు

ఉత్కంఠభరిత కథన వేగాలు

ఉత్తేజపూరిత చైతన్య ప్రవాహాలు

## ప్రపంచ సాహిత్యంలో కోకొల్లలు

సమకాలీనమై మీ మనసును మురిపించి, మైమరపించిన అన్య భాషల కథలను తెలుగు పాఠకులకు అందించండి,

**అనువాదం సరళంగా, ఆకట్టుకునేలా ఉంటే విపుల మీకు వారధిగా నిలుస్తుంది.**

---

అనువాద రచనల పూర్తి వివరాలతోపాటు, మూలభాషా రచయితల నుంచి పొందిన అనుమతి పత్రం, స్టాంపులంటించిన సొంత చిరునామా గల కవరు జతచేయండి. మూల రచయితల నుంచి అనువాదకులు తగిన అనుమతి పొందలేని సందర్భాలలో మేమే అనుమతి పొందగలం. మీ కథ మాత్రం ఎనిమిది పేజీలకు మించకుండా ఉండాలి.

---

రచనలు పంపవలసిన చిరునామా

సంపాదకుడు
విపుల, ఈనాడు కాంప్లెక్స్,
సోమాజిగూడ, హైదరాబాద్- 500 082.



# ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన కేరళ వారి ప్రత్యేక చికిత్సలు!!

❖ త్రాగుడు మానండి! మాన్పించండి!! STOP ALCOHOL!!! ❖ చుండ్రు, జుట్టు రాలుట, పేను కొరుకుడు, బట్టతల! నెరసిన జుట్టు!! ❖ ఉబ్బసం, ఎలర్జీ వ్యాధులు ❖ సంతానము లేని దంపతులకు సంతానోత్పత్తి కణాలు తక్కువగా ఉన్న మగవారికి కణాలలో కదలిక (Motility) లేనివారికి స్త్రీలకు అండాశయముల నుండి అండములు విడుదల కాకపోవుట, అండవాహికలు (FALLOPIAN TUBES) ముడుచుకొని పోవుట, ఎండోమెట్రియాసిస్, ❖ అన్ని రకముల గర్భకోశ వ్యాధులకు రసాయన, నాజీకరణ పద్ధతుల ద్వారా చికిత్స చేయబడును. ❖ స్త్రీల తెలుపు, ఎరుపు వ్యాధులు, బహిష్టు నొప్పిరుతుక్రమము సక్రమముగా లేకపోవుట, ❖ గర్భాశయ వ్యాధులకు గర్భసంచి తీసివేయకుండా (ఆపరేషన్ లేకుండా) ❖ ఆకర్షణీయమైన అందమునకు మొటిమలు, నల్లని మచ్చలు, మంగు, పొడ పొక్కులు, ముడుతలు ❖ నూతన యవ్వన శక్తికి, శీఘ్రస్కలనము, నపుంసకత్వము (IMPOTENCY) రతిమధ్యలో అంగము మెత్తబడి చిన్నగా ముడుచుకొని పోవుట, వృషణములు శుష్కించిపోవుట. ❖ సుఖవ్యాధులు, వ్రణములు, పుండ్లు, సవాయి, కొరుకుడు, గనేరియా, సిఫిలిస్, గ్లీట్ షాంక్రాయిడ్, హెర్పిస్ (HERPES) ❖ స్తనముల బిగువుకు, జారిన (వాలిన) మెత్తని, చిన్నగానున్న స్తనముల సైజును పెంచి, గట్టిగా, గుండ్రముగా స్త్రీలను అందముగా కనబడునట్లు చేయును. ❖ స్త్రీలకు పొత్తి కడుపుమీద గోకిన గీతలు, చారలు (SCRECH MARKS) పోవుటకు. ❖ మలబద్ధకము ❖ గ్యాస్ ట్రబుల్, ఎసిడిటి, అల్సర్స్, ❖ రక్త మొలలు, అర్శ మొలలు ఫిషర్స్, భగందరము (ఆపరేషన్ లేకుండా) ❖ చర్మవ్యాధులు, గజ్జి, జిల, దురద, ఎలర్జీ, దద్దుర్లు, తామర, చల్జీ, విసర్పి ❖ పులిపిర్లు, ఆనెలు ❖ సోరియాసిస్ (PSORIASIS) ❖ బొల్లి (LEUCODERMA) ❖ కుష్టు (LEPROSY) ❖ స్థూలకాయము (OBESITY) (NODIET, NOEXERCISE) సన్నగా, బలహీనముగా నుండువారు, బరువు, లావు పెరుగుటకు, (ఎత్తు పెరుగుటకు 21 వయస్సు లోపలవారు) ❖ మధు మేహము, షుగరు (DIABETES MELLITUS) అతిమూత్రము (DIABETES INSIPIDUS) ❖ షుగరు వలన మానని గాయములు, పుండ్లు, అల్సర్స్, గాంగ్రీన్ వంటివి మాన్పించుటకు ❖ రక్తపోటు (BP)అల్ప రక్తపోటు (LOW BP) ❖ పక్షవాతము (PARALYSIS) ❖ కీళ్ళు, కండరాల నొప్పులకు, కీళ్ళవాతము, నరములవాపు, మెడనొప్పి, తుంటి నొప్పి, సయాటిక, నడుము నొప్పి, వెన్ను నొప్పి ❖ మూర్ఛ, అపస్మారకము (FITS) (EPILEPSY) ❖ రాజక్షయ, క్షయ (PULMANARY TUBERCULOSIS) ❖ అండవృద్ధి - గిలక (HERNIA) (ఆపరేషన్ లేకుండా) ❖ వరి బీజము - బుడ్డ (HYDROCELE) (ఆపరేషన్ లేకుండా) ❖ పళ్ళ నొప్పులు, చిగుళ్ళ నుండి రక్తము, చీము కారుట, పుప్పి పళ్ళు, పళ్ళు కదలుట, పళ్ళు పచ్చగా నల్లగా రంగు మారుట, నోటి దుర్వాసన ❖ ముక్కు నుండి రక్తము కారుట ముక్కులో కంతులు (NOSAL POLIPS) (SINUSITIS) (ఆపరేషన్ లేకుండా) ❖ చెవిపోటు, చెవిలో చీముకారుట, చెవుడు, చెవిలో హోరు శబ్దము (ఆపరేషన్ లేకుండా) ❖ కంటి శుక్లములు (CATARACT) హ్రస్వదృష్టి, దీర్ఘ దృష్టి, దృష్టి మాంద్యము (ఆపరేషన్ లేకుండా) ❖ లివర్ వ్యాధులు, లివరు గట్టి పడుట (CIRRHOSIS) లివరులో పుండు (ABSCESS) లివర్ వాచుట, నొప్పి, వేడి, మంట మరియు పచ్చకామెర్లు (HEPATITIS, A,B,,NONA, NONB) మొ॥ ఒక వైరస్ వలన సంక్రమించిన కామెర్లు, ప్లీహము వాచుట (ENLARGE SPLEEN) ❖ మూత్రపిండముల వాపు (NEPHRITIS) మూత్రావయవములలో రాళ్ళు (RENALCOLIC & URINARY CALCULUS) ❖ మూత్రము వెళ్ళునపుడు మంట నొప్పి, రక్తము పోవుట, పిత్తాశయములో రాళ్ళు (STONES IN GALLBLADER) ❖ క్లోమ గ్రంధి యందు రాళ్ళు (STONES IN PANCREASIS) ❖ ప్రొస్టేటు గ్రంధివాపు (ENLARGEMENT OF PROSTATE) ❖ గుండె నొప్పి గుండెదడ, గుండె రక్తనాళముల నుండి రక్తము సరిగా అందకపోవుట ❖ థైరాయిడ్ సమస్యలు (THYROID) ❖ ముసలితనం లేకుండా చేసి వయస్సును నిలుపుటకు ❖ నత్తిని తగ్గించుటకు ❖ జ్ఞాపక శక్తిని పెంచుటకు ❖ చనుబాలు వృద్ధి చెందుటకు ❖ స్త్రీల శరీరం పై వచ్చు అవాంఛిత రోమములు తిరిగి మొలవకుండా చేయుటకు ❖ HIV/AIDS, CANCER/LUKEMIA, ALZHEIMERS, SCHIZOPHRENIA.

**అన్నిరకముల దీర్ఘకాల వ్యాధులకు సంప్రదించండి. మాకు మరెక్కడా బ్రాంచీలు లేవు.**

# కేరళ ఆయుర్వేద వైద్యశాల

**ఓడియన్ 70MM థియేటర్ దగ్గర, రెమాండ్స్ & Fantoosh Showroom ప్రక్కన, రూపాని టెక్స్‌టైల్స్ పైన, చిక్కడపల్లి మెయిన్‌రోడ్, హైదరాబాద్-20 ఫోన్: 65526109, 9866155109, 9392355590**

**Note:** పోస్ట్ ద్వారా కూడా చికిత్స కలదు ఉత్తరాల ద్వారా మీ సమస్యలను తెలియచేసి, మీ దగ్గర ఉన్న రిపోర్టు పంపి ఫోన్ ద్వారా సంప్రదించి చికిత్స పొందవచ్చును. మందు ఖరీదు మరియు పోస్టల్ ఛార్జీ రూ॥ 60/- కలిపి మనియార్డర్ లేదా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా మీ ఫోన్ నెంబరుతో సహా పంపించండి.

**Timings: 10 A.M to 8 P.M Sunday 10 A.M to 2 P.M**

సంపుటి -30
సంచిక - 12
జనవరి 2008
360వ సంచిక

# చతుర


◆ **టాంక్‌బండ్ కథలు-3**
విగ్రహం 6

◆ **కాలాతీతం**
ప్రపంచ ప్రసిద్ధ నవలల
పరిచయ వేదికలో
మక్సీమ్ గోర్కీ
నూరేళ్ల నవల **అమ్మ**
నిర్వహణ: **ఎం.వసంత** 119

◆ నవంబరు చతుర నవల
**ఆకృతి** పై పాఠకుల సమీక్షలు 124

◆ **చతుర ప్రవేశిక** 126

◆ **కథవెనుక కథ**
బతికిన కోడి 128

◆ **క్లాస్‌రూమ్ జోక్స్**
సేకరణ : బద్దిగం పాండురంగారెడ్డి

◆ **చతుర ప్రపంచం**
సేకరణ : ఎం.కావ్య

◆ **వారెవ్వా!**
సేకరణ : కె.రఘు


గుట్టుగా దాచుకొస్తున్న
రహస్యం తనను నిలువెల్లా
దహించేస్తుంటే ఏంచేయాలో
తోచక అల్లాడిందామె మనసు.
ఆ రహస్యం తెలుసుకుని
బ్లాక్ మెయిల్‌కు దిగాడో
అజ్ఞాత వ్యక్తి..
మరోపక్క తను ఆడిన
అబద్ధం కన్నకొడుకుపై
ఎలాంటి ప్రభావం
చూపుతుందోనన్న భయం..
అడుగడుగునా ఆసక్తికలిగించే

**హోతా పద్మినీదేవి**

## సరిత

10 వ పేజీలో

బొమ్మలు: ఆనంద్



110 సం॥ల భూత,భవిష్యద్వర్తమాన శతాబ్ది పంచాంగ రచయిత

# పండిత శ్రీ బుట్టే వీరభద్ర దైవజ్ఞ

శ్రీ శ్రీశైల దేవస్థాన ఆస్థాన సిద్ధాంతి గారి

శ్రీ సర్వధారినామ సంవత్సర 2008-2009

# గంటల పంచాంగము

త్వరలో విడుదల అన్ని బుక్ షాపులందు లభించును

## గ్రహశాంతి యంత్రములు మంత్రకవచములు

అనేక కష్టనష్టముల నుండి తొలగించి రక్షించును ఇవి శరీరమందు ధరించు తావీదు యంత్రములు

1. నవగ్రహ శాంతి యంత్రం
2. సర్వజన వశీకరణ యంత్రం
3. జయవశీకరణ యంత్రం
4. సరస్వతి యంత్రం
5. మహాలక్ష్మి యంత్రం
6. వివాహ యంత్రం
7. సంతాన యంత్రం
8. భార్యాభర్తల మైత్రికి
9. సుఖ ప్రసూతి యంత్రం
10. ఉద్యోగ ప్రాప్తియంత్రం
11. వ్యాపారాభివృద్ధి యంత్రం
12. మహాశూలిని యంత్రం
13. రోగనివారణ యంత్రం
14. శనిదోష యంత్రం
15. నరఘోష యంత్రం

పై స్పెషల్ వెండి యంత్రములు ఒక్కొక్కటి పంపుటకు రూ.200/-లు అగును. సొమ్ము ముందుగా ఈక్రింది అడ్రస్‌కు M.O.ద్వారా గాని D.D.ద్వారా గాని పంపండి.
మీ పేరు గోత్రం వివరంగా వ్రాయండి మీ పైకం అందిన 25 రోజులలో పంపగలము

## మీ యింట యంత్రస్థాపన చేయండి! సకల సిరులు పొందండి!

1. శ్రీ మహాలక్ష్మి యంత్రం
2. శ్రీచక్రరాజ యంత్రం
3. శ్రీ మత్స్య యంత్రం
4. శ్రీ నరఘోష యంత్రం
5. శ్రీ ధనాకర్షణ యంత్రం
6. శ్రీ కుభేర యంత్రం
7. శ్రీ ఆంజనేయ యంత్రం
8. శ్రీ లక్ష్మీగణపతి యంత్రం

ఈ యంత్రం ఒక్కొక్కటి 5X5 అం॥లు సైజు రాగి రేకుపైచేసిపూజించివపంపుటకు రూ.350-/లు అగును. సొమ్ముముందుగా ఈక్రింది అడ్రస్‌కు M.O.ద్వారా గాని D.D.ద్వారా గాని పంపండి.
మీ పేరు గోత్రం వివరంగా వ్రాయండి మీ పైకం అందిన 25 రోజులలో పంపగలము.

## బుట్టే వీరభద్ర దైవజ్ఞ

తిలక్ రోడ్, రాజమండ్రి - 3, ఫోన్ (0883) 2469631
E-mail : bvb_divagna@rediffmail.com




# విగ్రహం

సాయంత్రం 5 గంటలు!

ట్యాంక్‌బండ్ మీది రామదాసు విగ్రహానికి ఆనుకు నున్నాడు సుందరం. మాసిన గడ్డం, అతుకులుపడ్డ చొక్కా ప్యాంట్ అతని పేదరికాన్ని చెప్పకనే చెబుతున్నాయి.

పొట్ట చేతపుచ్చుకుని, ఉద్యోగంకోసం తను నగరంలో అడుగుపెట్టి అప్పుడే ఆర్నెల్లు. తండ్రి కొనిచ్చిన ఆరు చెప్పుల జతలు అరిగిపోయాయే తప్ప, ఉద్యోగం దొరకలేదు. ఎక్కడో మారుమూల గ్రామాన్నుంచి గంపెడు ఆశతో నగరానికి చేరుకున్న సుందరానికి తన ఆశ అడియాసేనని తేలిపోయింది.

తనేదో తవ్వి తలకెత్తుతాడని, కూలీ నాలీ చేసి నెలకు రెండొందలు, మూడొందలు పంపుతున్న తల్లిదండ్రులు గుర్తుకురావడంతో సుందరం మనసు బాధగా మూలిగింది.

మొన్న పండక్కి ఇంటికి వెళ్లినప్పుడు 'కొల్వు దొరకబట్టేనా బిడ్డా?' అని ఆప్యాయంగా, ఆశగా అడిగిన అమ్మకు ఏంచెప్పాలో అర్థంకాక తెల్లమొగమేశాడు తను.

'ఆడికి కొలువైతే రెక్కలు కట్టుకొచ్చి చెప్పడేంటే ఎర్రిమొగమా? జరంతవోపు. కొలువదే అయిద్ది. మన దరిద్రమూ వదిలిపోద్ది! నాబిడ్డ నాలా రెక్కలు ముక్కల్జేసుడు వద్దనేగదా ఇస్కూలుకు పంపింది.. గాచారం బాలేక ఉజ్జోగమింకా గాలేదు కానీ ఆడికేమే దొరబిడ్డ!' తండ్రిమాటల్లో ఆయన తనపై పెట్టుకున్న నమ్మకం అర్థమై మనసు కుంగిపోయింది.

ఈ వయసులో తల్లిదండ్రులకు పెట్టాల్సిందిపోయి వాళ్ల రెక్కలకష్టాన్ని జుర్రుకుంటున్నాడు తను. ఛీ ఏం బతుకు? అయినా ఇలా ఎన్నాళ్లని? ఎక్కే గడప దిగే గడప.. అక్కడ అమ్మనాన్నల దీనావస్థ! పోనీ ఆత్మహత్య చేసుకుంటే?

ఆ ఆలోచన రాగానే పైకిలేచాడు. అంతలో అక్కడకి సీలువేసున్న ఓ అట్టపెట్టె మోసుకుని ఇద్దరు వచ్చారు.

'ఏయ్ మిస్టర్ ఎవర్నువ్వు? ఇక్కడేం చేస్తున్నావ్?' వారిలో ఒకడి గొంతు ఖంగుమంది.

'ఇంతకీ మీరెవరు?' ధైర్యం కూడదీసు

కుని అడిగాడు సుందరం.

'పోలీస్' అన్నాడు రెండోవాడు.

ఉలిక్కిపడ్డాడతను. దాన్ని కప్పిపుచ్చు కుంటూ 'నేనో నిరుద్యోగిని సార్. సికింద్రాబాద్‌లో ఓ ఇంటర్వ్యూకు హాజరైవస్తూ కాసేపు రెస్ట్ తీసుకుంటున్నాను' అన్నాడు వీలైనంత వినయంగా.

'గుడ్.. మాకో హెల్ప్ చేస్తావా? జస్ట్ అరగంట పని. రెండువేలిస్తాం'

రెండువేలనేసరికి సుందరం కళ్లు మెరిసాయి.

'చెప్పండి సార్ ఏంచేయాలి?'

అరగంట పనికి రెండువేలు అంటున్నారు ఏంపనో? ఏం రిస్క్ చేయాలో అనే సందేహం వచ్చినా జేబులో కానీలేని అతని పరిస్థితి, కడుపులో ఆకలి ఆ సందేహాన్ని అతని దేహంలోనే సమాధిచేశాయి.

'మ్యూజియానికి వెళ్దామా? 'అన్నాడు మొదటివాడు.

'నీ బొంద. ఇవ్వాళ శుక్రవారం సెలవు. పబ్లిక్‌గార్డెన్స్ లలిత కళాతోరణంలో ఏడింటికి ఏదో సినిమాఫంక్షన్ ఉంది అక్కడకి వెళ్దాం' అంటూ రెండు ఆటోలను పిలిచాడు రెండోవాడు. సుందరాన్ని పెట్టెసహా ఒక దాంట్లో ఎక్కించి, రెండోదాంట్లో వారిద్దరూ కూర్చున్నాక ఆటోలు బయలుదేరాయి.

ఏడు నిముషాల్లో ముగ్గురూ లలితకళాతోరణం చేరుకున్నారు. అక్కడ వారికి మరొకడు జతయ్యాడు. పెట్టెలో నుంచి కొన్ని వస్తువుల్ని, పరికరాల్ని తీసుకుని పోలీసులిద్దరూ వేదికవైపు వెళ్లగా ప్రేక్షకుల గ్యాలరీలోకి మూడోవ్యక్తితో కలిసి వెళ్లాడు సుందరం. ఆ మూడోవ్యక్తి గొప్ప టెక్నీషియన్‌లా ఉన్నాడు. పెట్టెలోని సెల్‌ఫోన్లు తీసి ఫీడింగ్‌చేసి గ్యాలరీ మూలల్లో రెండు చోట్ల అమర్చాడు. అతనిచేతులు చకచకా యంత్రాల్లా కదుల్తుంటే పెట్టెలోంచి అతనికి కావాల్సిన వస్తువులు, పరికరాలు అందిస్తూ సహకరించాడు సుందరం. తర్వాత అతని సూచన మేరకు వాటిపై పూలకుండీలు, పుష్పగుచ్ఛాలూ ఉంచాడు తను.

సుందరంలో సన్నగా ఏదో అనుమానం! అయినా బయటపడలేదు.

మరోపావుగంటలో వేదికవైపు వెళ్లిన వారిద్దరూ వచ్చి కలిశారు. ఆ ముగ్గురూ



తనకు విన్పించకుండా ఓ పక్కగా నిలబడి ఏదో మాట్లాడుకున్నారు. తర్వాత గుప్పిట మూసి బొటనవ్రేలు పైకి లేపి నవ్వుతూ వెళ్ళిపోయాడు మూడోవ్యక్తి.

అతను పోగానే ఫెళఫెళలాడుతున్న వెయ్యిరూపాయల నోట్లు రెండు సుందరం చేతిలోపెట్టి ప్రేక్షకుల్లో కలిసిపోయారు పోలీసులు.

చేతిలో కరెన్సీ పడగానే రెండురోజులుగా మంచినీళ్లతో కడుపు నింపుకుంటున్న సుందరంలో ఆకలి పెద్దపులిలా గాండ్రిం చింది. గబగబ పక్కనేఉన్న హోటల్‌కు వెళ్లి బిర్యానీకి ఆర్డర్ చేశాడు.

పోలీసులంటారు.. అసలు వీళ్లు నిజం పోలీసులేనా? ఆ సెల్‌ఫోన్లేంటి? కొంప తీసి బాంబులుకాదు కదా? క్రమంగా అను మానం పెరిగిపెద్దయింది సుందరంలో.

'ఆc మనకెందుకు? ముందు ఆత్మారా ముడి సంగతి చూడాలి. ఆ తర్వాతే ఏదైనా!' అనుకుంటూ బేరర్ అప్పుడే తెచ్చిన బిర్యానీప్లేటుపై దాడి ప్రారంభించా డతను.

రెండు స్పూన్లు తిన్నాడో లేదో అతనిలో మళ్లీ ఆలోచనలు.. తను ఆడిటోరియం నుంచి వెలికి వచ్చేటప్పుడు నవ్వుతూ తుళ్లుతూ పువ్వుల్లాంటి పిల్లలు ఎదుర య్యారు. చంకన పసిబిడ్డల్ని వేసుకుని వస్తున్న తల్లులు! అభిమాన నటుల్ని చూడ బోతున్నామన్న ఆనందం వాళ్లముఖాల్లో తాండవిస్తోంది.. నిజంగా అవి బాంబులే అయితే వారంతా ... అతని ఆలోచనల్ని భగ్నంచేస్తూ-

పెద్ద విస్ఫోటం!! అంతా ఉలిక్కిపడ్డారు.

అంతే! రాకెట్‌లా స్టేడియంలోకి పరుగు తీశాడు సుందరం. వేదిక వెనుక బాంబు పేలినట్లుంది. జనంలో కలకలం! భయంతో ఉరుకులు.. పరుగులు.. ఎవరి గోలలో వారున్నారు. సుందరానికి హడావి డిగా పరుగుతీస్తున్న ఓ ఆడ పోలీస్ కన్పిం చింది..

'మేడమ్! గ్యాలరీలో కూడా బాంబులు న్నాయి. తీసేద్దాం రండి' అరిచాడతను. అతనేం మాట్లాడుతున్నాడో ఆమెకి అర్థంకా లేదు. పిచ్చిచూపులు చూస్తూ పరుగెత్తిం దామె.

ఇక లాభం లేదని గ్యాలరీ మధ్యకి తనే దూసుకుపోయాడు సుందరం. కొన్ని నిము షాల ముందు తాము సెల్‌ఫోన్లు అమ ర్చిన ప్రదేశానికి పరుగెత్తి 'వెళ్లండి.. బయ టకు వెళ్లిపోండి.. ఇక్కడ కూడా బాంబులు న్నాయి' అని అరిచాడు.

అదెంతో సేఫ్ ప్రదేశమని అక్కడే నిల బడి వేదికవైపు చూస్తున్న వారంతా కకా వికలయ్యారు. ఈలోగా సుందరం సెల్ ఫోన్లు రెండూతీసి వైర్లుపీకి, స్విచ్ ఆఫ్‌చే శాడు.

'హమ్మయ్య' అని ఊపిరిపీల్చుకుని వెను కకు తిరిగేసరికి తనకే రివాల్వర్ గురిపెట్టి నిలుచున్నాడు ఓ ఎస్సై. అతని పక్కనే తానిందాక చూసిన ఆడపోలీసు కన్పిం చింది.

★ ★ ★

రిమాండ్‌లు.. లాకప్‌లు.. కోర్టులు.. విచారణలు.. అన్నీ పూర్తయ్యేసరికి వంద లాదిమంది ప్రాణాలు కాపాడిన సుందరం ఒళ్లు పచ్చి పుండైంది. లేచి నిలబడలేని స్థితి! మరో ఆర్నెల్లకు అసలు నేరగాళ్లు పట్టుబడ్డారు. సుందరం నిర్దోషనీ, ఆ రోజు తనవల్లే ఎందరో బతికిబట్టకట్టారనీ తేలేస రికి అతను ఈ లోకాన్నే విడిచిపోయాడు.

అయితేనేం?

లలితకళాతోరణంలో ఓమూల అతని శిలావిగ్రహం వెలిసింది. ప్రతిరోజూ దానికి పూలదండలు వేస్తూ రెండు ముసలి ప్రాణాలు అక్కడే చాలాకాలం తచ్చాడి తర్వాత హరీమన్నాయి. ఆ తర్వాత ఆ విగ్రహాన్ని పట్టించుకున్న నాథులు లేరు!

—చంద్రప్రతాప్




# ఫాస్ట్‌ఫుడ్ ప్రపంచం



సమయం ఆదా చేయడానికి అమెరికాలో అన్ని రంగాల్లోనూ పని వేగవంతంగా జరగడానికి అనుకూలమైన ప్రయోగాలు చేస్తుంటారు.

అలాగే మనిషి నిత్యం భోజనానికి ఖర్చు చేసే సమయాన్ని తగ్గించడం మీద కూడా అనేక పరిశోధనలు చేసారు. వాటి ఫలితమే నేటి ఫాస్ట్‌ఫుడ్.

వంట ముందుగా చేసి ఉంచితే చల్లారిపోతుంది. ఆర్డర్ ఇచ్చాక చేస్తే టైంపడుతుంది. వీటి రెంటి మధ్య సమన్వయం చేస్తూ, 'ఫాస్ట్‌ఫుడ్'ని అమెరికా రెస్టారెంట్ వ్యాపారస్థులు కనిపెట్టారు. ఉడకడం కన్నా వేపుళ్ళు త్వరగా అవుతాయి. కాబట్టి ఫాస్ట్‌ఫుడ్స్‌లో అధిక భాగం వేపుళ్ళతో కూడినవే.

వీటిలోని ప్రధాన లోపం త్వరగా అరగకపోవడం, అధిక కొవ్వుని అందించడం. నిత్యం ఫాస్ట్‌ఫుడ్ తింటుంటే, కొన్నేళ్ళకి శరీరంలో కొలెస్టరాల్ పేరుకుని హృద్రోగానికి, పక్షవాతానికి దారితీసే ప్రమాదం ఉంది అని శాస్త్రజ్ఞులు ఘోషిస్తున్నారు. ఫాస్ట్‌ఫుడ్స్ తినడానికి వ్యతిరేకంగా అది కనిపెట్టబడ్డ అమెరికాలోనే విస్తృతంగా వివిధ మీడియాల్లో ప్రచారం జరుగుతుంది.

ముఖ్యంగా బంగాళాదుంపల వేపుడు, (ఫ్రెంచ్ ఫ్రైస్) కొవ్వు అధికంగా ఉండే మాంసంతో చేసే బర్గర్లు ఆరోగ్యాన్ని దెబ్బతీస్తాయి. వేపుడు ఎప్పుడూ రుచిగా ఉంటుంది. కాబట్టి దాని రుచికి బానిసవడం త్వరగా జరుగుతుంది.

ఆనియన్ రింగ్స్ పేరిట మన పకోడీలని వెండీస్‌లో సరఫరా చేస్తున్నారు. ఆరోగ్యకరమైన ఆహారాన్ని తీసుకోవాలని ఎంత ప్రచారం జరుగుతున్నా అమెరికా ప్రజలు ఇంకా బర్గర్స్‌ని, వేపుడు పదార్థాలని, ఇతర ఫాస్ట్‌ఫుడ్‌ని తీసుకుంటూనే ఉన్నారు. ఆరోగ్యానిచ్చే సూత్రాన్ని సమయానికి అధిక విలువని ఇస్తున్నారు. ట్రావెల్ ఛానెల్ అనే టి.వి. చేసిన సర్వే ప్రకారం అమెరికాలో సగటున గంటకి 2,90,000 ఫాస్ట్‌ఫుడ్ భోజనాలు అమ్ముడవుతున్నాయి. అమెరికా ప్రభావంతో ప్రపంచంలోని మిగతాచోట్ల ఇలాంటివి ఎన్ని అమ్ముడవుతున్నాయో.

ట్రావెల్ ఛానల్ జరిపిన సర్వేలో ఈ కింది ఫాస్ట్‌ఫుడ్ రెస్టారెంట్లలో ఫాస్ట్‌ఫుడ్ అధికంగా అమ్ముడవుతున్నాయని తేలింది.

వెండీస్, బర్గర్‌కింగ్, అర్బీస్, మక్‌డోనాల్డ్స్, కెంటకీ ఫ్రైడ్ చికెన్, సోనిక్ డ్రైవిన్, సబ్‌వే, టోకోబెల్.

డిప్రెషన్, ఆర్థరైటిస్, హృద్రోగం కడుపుకి చెందిన వ్యాధులు గల 3226 మంది రోగగ్రస్థులని పరిశీలించారు సైంటిస్టులు. వారిలో 83% మంది తరచూ ఫాస్ట్‌ఫుడ్ తిన్నవారని ఆ పరిశోధనలో తేలింది.

మన దేశంలో కూడా మెక్ డొనాల్డ్, పిజ్జా హట్, సబ్‌వేలాంటి అమెరికన్ ఫాస్ట్‌ఫుడ్ చెయిన్ ఆఫ్ రెస్టారెంట్స్ వచ్చేసాయి. ఆ రకం భోజనం మీద నేటి యువత ఆసక్తిని, అభిరుచిని ప్రదర్శిస్తోంది.

నిజానికి భారతీయుల నాలుకకి అమెరికన్ ఫాస్ట్‌ఫుడ్ పెద్దగా రుచిగా అనిపించవు. ఫ్రెంచ్ ఫ్రైస్‌కి మన గారెని మించిన రుచి ఉండదు. బర్గర్‌కి మినపరొట్టి లేదా మసాలా దోసెని మించిన రుచి ఉండదు. టొమేటో చిల్లీసాస్‌లు కలుపుకుంటేనే వాటికి ఏమైనా రుచి.

ఆరోగ్యాన్ని కాపాడుకుంటూ హాస్పిటల్ పాలవకూడదనుకునేవారు, హార్ట్ సర్జరీ వద్దనుకునేవారు ఫాస్ట్‌ఫుడ్‌ల జోలికి వెళ్ళకూడదు అని వాటిని కనిపెట్టినవారే అంటున్నారు. విజ్ఞులైనవారు ఆ సలహాని పాటిస్తారు.

విడాకులు తీసుకున్న ఆ యువతికి నాలుగేళ్ల కొడుకు. ముద్దుల కొడుకును వాడి తండ్రి అమెరికాలో ఉద్యోగం చేస్తున్నాడని నమ్మిస్తుంటుందామె. బయటకూడా తనభర్త అమెరికాలో ఉన్నాడనీ, త్వరలో తామూ అక్కడికే వెళ్తామనీచెబుతూ జీవనం కొనసాగిస్తుంటుంది. సామాజిక రక్షణకోసం తను ఆడిన అబద్ధం ఆమె జీవితాన్ని కల్లోలకడలిగా మార్చేస్తుంది.. ఎలాగైతేనేం? పట్టుదలగా ఎదురీది విజయతీరం చేరుతుందామె .

అడుగడుగునా ఉత్కంఠకు గురిచేసే **హోతా పద్మినీదేవి** నవల **సరిత** చతుర మీకందిస్తున్న నూతన సంవత్సరకానుక!!

# సరిత

## హోతా పద్మినీదేవి

"నమస్తే మేడమ్! నా పేరు సరిత. నిన్న మీ సెంట్రల్ ఆఫీసులో జరిగిన ఇంటర్వ్యూలో అకౌంట్స్ అసిస్టెంటుగా సెలక్టయ్యాను. ఇదుగోండి అపాయింట్ మెంట్ ఆర్డర్"

అపాయింట్ మెంటు ఆర్డర్ అందుకుంటున్నప్పుడు ఆమె తనని నిశితంగా గమనించడం సరితకి కొద్దిగా ఇబ్బంది అన్పించింది. ఆమె అపాయింట్ మెంట్ ఆర్డర్‌ని పరిశీలనగా చూసి "కూర్చోండి" అంది.

సరిత కూర్చుంది.

"నా పేరు మాధవి. ఇక్కడ అకౌంటెంట్‌ని. ఇదే మీ మొదటి ఉద్యోగం కాబట్టి, వర్క్ ఎక్స్‌పీరియన్స్ లేదు కాబట్టి డే బుక్ మెయిన్‌టెనెన్స్, లెడ్జర్ పోస్టింగ్ లాంటివి చెబుతాను" మాములుగా మాట్లాడుతున్నా ఆమె నిశితమైన చూపులు సరితని గుచ్చుతూ ఇబ్బంది పెడుతున్నాయి.

"ఓకే మేడమ్"

సరితకి టేబిల్ చూపించి ఆమె అక్కడ కూర్చున్నాక కొన్ని ఫైల్సు ఆమె ముందు వుంచి, వర్క్ ఎక్స్‌ప్లయిన్ చేసివెళ్లింది మాధవి.

లంచ్ టైములో మిగతా కొలీగ్స్ పరిచ

యమయ్యారు.

ఒకామె ప్రమీల, మరొకామె విరజ. వాళ్ళిద్దరూ కంప్యూటర్ ప్రోగ్రామర్స్.

"మీరు లంచ్ తెచ్చుకోలేదా? " అడిగింది ప్రమీల.

"ఇంటి దగ్గర భోజనం చేసే వచ్చాను. కేంటీన్ వుంటే కాఫీ తెప్పించుకుంటాను"

అంతలో- ఆఫీసుబాయ్ వచ్చి చెప్పాడు. "మేడమ్ పిలుస్తున్నారు"

సరిత బాస్ కేబిన్‌లోకి నడిచింది.

"మీరు లంచ్ తెచ్చుకోలేదనుకుంటాను" అడిగింది మాధవి.

"ఆఫీసుకి వచ్చేముందే తిన్నాను మేడమ్"

"కాఫీ తెప్పిస్తున్నాను, రండి"

"నేను తెప్పించుకుంటాను మేడమ్" మొహమాటంగా అంది సరిత.

"మీరు రేపు తెప్పిద్దురుగాని" అని బాయ్‌కి సైగ చేసింది మాధవి. అతను వెళ్ళాక నిలబడే వున్న సరితని చూస్తూ "కూర్చోండి, నిలబడేవున్నారు" అందామె.

సరిత కూర్చుంది.

"మీరొక్కరే వుంటున్నారా? "

హఠాత్తుగా ఆమె అలా అడిగేసరికి ఆమె ఆ ప్రశ్న ఎందుకు అడిగిందో అర్థం కాలేదు సరితకి.

"పార్డన్ మి మేడమ్!" అంది నమ్రతగా.

"మీ ఇంట్లో ఎవరెవరు వుంటారు? "

"నేను, అమ్మ, మా బాబు"

"ఐ.సీ!" ఆమె చూపులు తననే నిశితంగా నిలువెల్లా పరికిస్తుంటే ఇబ్బందిగా కదిలింది.

"మీ చీర చాలా బాగుంది సరితా! ఎక్కడ కొన్నారు" తను ఇందాకటి నుంచి గమనించింది చీరనే అన్నట్లు అడిగింది మాధవి.

"థ్యాంక్ యూ మేడమ్! అమెరికా నుంచి మా వారు తెచ్చారు"

"మీ వారు అమెరికాలో వుంటారా? మరి మీరిక్కడ? " అర్ధోక్తిలో ఆగింది.

"ఆయనకి హెచ్.వన్ వీసా రాలేదు మేడమ్. రాగానే నేనూ అమెరికా వెళ్తాను"

"ఓ! ఆయన... అదే మీ వారు... అక్కడ ఏం చేస్తారు? "

"సాఫ్ట్‌వేర్ ఇంజనీర్"

"ఎక్కడ? "

"డెట్రాయిట్‌లో"

బాయ్ తెచ్చిన కాఫీని ఆమె ముందుకి జరుపుతూ అంది.

"కాఫీ తీసుకోండి"

సరిత నోరు కాలుతున్నా లెక్క చెయ్యకుండా వేడిగా వున్న కాఫీని రెండు గుక్కల్లో తాగి "మీరు రిలాక్స్ అవ్వండి మేడమ్! నేను రెస్ట్ రూమ్‌లో కూర్చుంటాను" అని లేచింది.

"ఓకే" అంది మాధవి.

సరిత అక్కడ నుంచి బయటపడి గుండెలనిండా గాలి పీల్చుకుంది. సునిశితమైన మాధవి చూపులు ఆమెకి ఎందుకో గాని ఊపిరాడనీయడంలేదు.

"నీ జేడ్స్ హారం చాలా బాగుంది" అంది ప్రమీల.

"థాంక్యూ" చిరునవ్వుతో అంది సరిత.

"ఎక్కడ కొన్నావు? "

"మావారు అమెరికా నుంచి పంపారు"

"మీ వారికి అమెరికాలో వుద్యోగమా? " విరజ కుతూహలంగా అడిగింది.

"అవును. సాఫ్ట్‌వేర్ ఇంజనీరు. ఆయనకి ఇంకా హెచ్.వన్ వీసా రాలేదు. అందువలన ఆయనక్కడ... నేనిక్కడ..." నవ్వింది.

"చాలా కష్టం కదూ? పిల్లలుంటే మరీ కష్టం. వాళ్ళయితే తండ్రిని చాలా మిస్సవుతారు"

"పిల్లలున్నారా? " విరజ అడిగింది.

"నాలుగేళ్ళ బాబు రాహులున్నాడు"

# మానసిక చికిత్స







అమెరికన్ వ్యాపార సంస్థల్లోని సిబ్బందితో తరచూ ఎదురయ్యే సమస్యలని పరిష్కరించడానికి యజమానులు అవలంబించే పద్ధతులు చిత్రమైనవి. అవన్నీ కేవలం మానసిక శాస్త్రానికి చెందినవి కావడం విశేషం. అలాంటివి కొన్ని...

ఓ మిల్లులో పనిచేసే పనివాళ్ళు నిత్యం చేయాల్సినంత పనిచేసి వాళ్ళ కోటా ధాన్యాన్ని ఆడించడం లేదు. మిల్లు మేనేజర్ వాళ్ళని బతిమాలాడు. జీతం పెంచుతానన్నాడు. పన్లోంచి తీసేస్తానన్నాడు. ఏం చేసినా వారినించి సత్ఫలితాలని రాబట్టలేకపోయాడు. ఆ సంగతి తెలిసిన ప్రొప్రయిటర్ చార్లెస్ స్కాట్ ఓ చాక్ పీస్, నల్లటి బోర్డులని తెప్పించి మిల్లులో అందరూ చూసే చోట ఉదయపు 'ఎ' షిఫ్ట్ వర్కర్లు సగటున ఎన్ని బేరల్స్ ధాన్యాన్ని ఆడించారో అడిగి తెలుసుకుని ఆ బోర్డుమీద '6' అని రాసాడు.

సాయంత్రం 'బి' షిఫ్ట్ వర్కర్లు వచ్చి బోర్డుమీద అదేమిటని అడిగారు. అది 'ఎ' షిఫ్ట్ వర్కర్లు సగటున ఎన్ని బేరల్స్ ధాన్యాన్ని ఆడించారో తెలిపే లెక్క అని మేనేజర్ చెప్పాడు.

రాత్రి 'బి' షిఫ్ట్ వాళ్ళు పనినుంచి దిగబోయేముందు '6'ని చెరిపేసి '7' అని రాసారు. రాత్రి 'సి' షిఫ్ట్ వాళ్ళొచ్చి '7' వివరం అడిగి తెలుసుకున్నారు. మర్నాడు ఉదయం వారు పనినించి దిగబోయే ముందు '7' ని తుడిపేసి '8' అని రాసారు. చివరికా నంబరు '10'కి చేరింది.

పోటీతత్వం మనిషిలో రగులుకుంటే పని చేయడానికి దాన్ని మించిన ప్రోత్సాహకారి ఇంకోటుండదు. ఇంకొకర్ని అధిగమించాలన్న కోరిక డబ్బు కన్నా ఎక్కువ ప్రోత్సాహకారి.

చార్లెస్ స్కాట్‌కి స్టీల్‌మిల్ కూడా వుంది. ఓ రోజు మధ్యాహ్నం అతను మిల్లుకి వస్తే 'నో స్మోకింగ్' బోర్డుకింద కూర్చుని సిగరెట్లు తాగే వర్కర్లు కనిపించారు. సాధారణంగా ఎవరైనా బోర్డు చదవలేదా? కళ్ళు లేవా? లాంటి మాటలంటారు. కానీ స్కాట్ వాళ్ళందరికీ తలో సిగరెట్టు ఇచ్చి చెప్పాడు.

"మీరు బయటకి వెళ్ళి తాగితే నాకన్నా సంతోషించేవాడు ఇంకొకడుండడు"

మళ్ళీ ఎన్నడూ వర్కర్స్ మిల్లు లోపల సిగరెట్లు తాగలేదు. కారణం ఆయన వారు ఎదురు చూసినట్లుగా తిట్టలేదు. పైగా సిగరెట్ ఇచ్చి గౌరవించాడు. అలాంటి మనిషిని ప్రేమించకుండా ఎవరుండగలరు? ప్రేమ ఉన్నచోట ఆ మనిషికి నచ్చేలా చేయాలనే కోరిక కూడా వుంటుంది.

ఫిలడెల్ఫియా ఈవెనింగ్ బులెటిన్ అనే పత్రిక పోటీదారులు దాన్ని పడగొట్టడానికి రహస్యంగా ఓ ప్రమాదకర ప్రచారాన్ని మొదలు పెట్టారు. ప్రకటనదారులకి, పాఠకులకి అందులో చదివే విషయాలకన్నా ప్రకటనలే అధికం అనే వదంతిని చేరేలా చేసారు. ఎక్కువ ప్రకటనల మధ్య తమది ఎవరు గమనిస్తారని ప్రకటనదారులు, ప్రకటనలు తప్ప చదివేందుకేం ఉందని పాఠకులు దానికి దూరం అవసాగారు.

బులెటిన్ ఎడిటర్ తక్షణ చర్య తీసుకోవాల్సిన అవసరం ఏర్పడింది.

ఓరోజు బులెటిన్‌లో వచ్చిన సమాచారం మొత్తాన్ని ఎడిటర్ 'ఒకటే' పేరుతో ఓ పుస్తకంగా ముద్రించాడు. 300 పేజీలు గల ఆ పుస్తకం వెల నిజానికి 2 డాలర్లు పెట్టాలి. కాని కేవలం రెండు సెంట్ల ధరకే దాన్ని అమ్మారు. చదవడానికి ఆసక్తిగల ఎంతో మంచి సమాచారం తమకి నిత్యం అందుతోందని పాఠకులు దాన్ని చదివి తేలిగ్గా గ్రహించారు. తిరిగి సర్క్యులేషన్ పుంజుకుంది.

"అవునా... డేడీ కావాలని మారాం చెయ్యడూ? "

"ఎందుకు చెయ్యడూ? చేస్తాడు"

సరిత తినడం ముగించి చెయ్యి కడుక్కుని టిఫిన్ డబ్బా, బ్యాగ్ తీసుకుని తన సీటు దగ్గరికి నడిచింది. ఆ నడకలో పని తొందరకంటే వాళ్ళ ప్రశ్నల నుంచి తప్పించుకోవాలనే ఆదుర్దా వుంది.

తన టేబిల్ దగ్గరకి వచ్చి సరితని చూసి మాధవి నవ్వింది.

సరిత ఇబ్బందిగా తనూ నవ్వింది.

"సరితా! మీ వారు డెట్రాయిట్‌లో కదూ వున్నారన్నావ్? "

"అవును మేడమ్"

"నువ్వు నాకో చిన్న సహాయం చెయ్యాలి"

"చెప్పండి"

"మా కజిన్‌కి అక్కడ యూనివర్సిటీలో ఎమ్. ఎస్. చెయ్యడానికి సీటు వచ్చింది. ఆమెకి మీ వారి ఫోన్ నెంబరు, వీలయితే అడ్రస్ ఇవ్వగలవా? ఏంలేదు. దేశంగాని దేశం.. ఒంటరిగా వెళ్తోంది. ఏదైనా కావాలంటే మీవారు హెల్ప్ చేస్తారని"

సరిత తలదించుకుని ఒక క్షణం మాట్లాడలేదు. మరుక్షణం, తల ఎత్తి మామూలుగా చెప్పింది. "ఆయన రీసెంట్‌గా వాషింగ్‌టన్‌లోని మరో కంపెనీకి మారారు మేడమ్"

"అవునా!"

నిజంగా మాధవి కజిన్ అమెరికా వెళ్తోందో లేక తన భర్త గురించి ఆరా తియ్యడానికి పదే పదే తన దగ్గర అతని ప్రస్తావన తెస్తోందో! లోలోన ఉడికిపోతూ ఫైలులోకి తలదూర్చింది సరిత.

★ ★ ★

సరిత ఇంటికి వచ్చేప్పటికి శాంతమ్మ కజ్జికాయలు చేస్తోంది.

"ఇప్పుడెందుకు ఒక్కదానివే ఇంత పని పెట్టుకున్నావ్? ఏ ఆదివారమో అయితే నేనూ సాయం చేసేదాన్ని కదా!"

"రేపు రాహుల్ పుట్టినరోజు. మరచిపోయావా? "

"గుర్తుంది"

"పార్టీకి నలుగురినీ పిలిస్తే ఒక అయిటమ్‌గా వుంటాయని చేస్తున్నాను"

"నేనెవరినీ పార్టీకి పిలవడం లేదమ్మా! వాడి స్కూలుకి వెళ్లి కేక్ కట్ చేయిస్తే సరిపోతుంది"

"అదేమిటే కొత్తగా ఉద్యోగంలో చేరావు. నీ కొలీగ్స్‌ని పార్టీకి పిలిస్తే ఆ రకంగా వాళ్ళు స్నేహితులవుతారు కదా!"

సరిత పెదవి బిగపట్టింది. తన కొలీగ్స్‌ని పార్టీకి పిలవడానికి తనకేం అభ్యంతరం లేదు. వాళ్ళతో బాటు తన బాస్ మాధవిని కూడా పిలవాలి. రెండు రోజుల కిందటే విరజ తన పాప పుట్టినరోజని కొలీగ్స్‌తోబాటు మాధవిని కూడా పిలిచి బ్రహ్మాండమైన పార్టీ ఇచ్చింది. తనకి మాధవిని పిలవడమే ఇష్టం లేదు. ఆమె వేసే యక్షప్రశ్నలకి, తన దగ్గర జవాబు లేదు.

"అమ్మా... నేను రేపు పార్టీ అంటూ ఎవరినీ మన ఇంటికి పిలవడం లేదు. అంతే!" ఖచ్చితంగా చెప్పేసింది.

తర్వాత-

"నేను రాహుల్‌ని తీసుకుని బజారుకి వెళ్లివస్తాను" అని కొడుకు చెయ్యి పట్టుకుని బాత్‌రూమ్‌లోకి తీసుకెళ్ళింది. అయిదు నిమిషాలలో వాడిని తయారుచేసి వెళ్తున్నానని చెప్పి ముందుకి నడిచింది.

"ఆ పసివాడికి ఏ ముచ్చట తీరకుండా చేస్తోంది. ఏమిటో, దీని మొండితనం" నిట్టూర్చింది శాంతమ్మ.

ఆటోలో బజారుకి వెళ్తుంటే రాహుల్ ఏదేదో అడుగుతున్నాడు. సరిత అన్యమన

స్కంగానే సమాధానాలిస్తోంది.

"డేడీ ఎప్పుడొస్తారు? "

సరిత వాడి నుంచి ఏ ప్రశ్న రాకూడద నుకుందో అదే ప్రశ్న వేసాడు.

"వస్తారు" అంది వాడివైపు చూడకుండానే.

"ఎప్పుడు? "

"నువ్వు పెద్దవాడి వయ్యాక"

వాడి కళ్ళలో ఆ క్షణంలో కనిపించిన నిరాశ చూసి ఆమె గుండె నెవరో పిండినట్టయింది.

"నీకు బర్త్‌డేకి రెండు డ్రెస్‌లు కొంటున్నాను, తెలుసా? " తెచ్చిపెట్టుకున్న ఉత్సాహంతో వాడికి ఆశ చూపించింది.

"డేడీ అమెరికా నుంచి నా బర్త్‌డేకి డ్రెస్ పంపరా? "

"పోయిన నెలలో రెండు డ్రెస్‌లు పంపించారు. వాటిల్లో ఒకటి బర్త్‌డేకి దాచుకున్నావ్‌గా"

సరిత గుండెల్లో నుంచి దుఃఖం తన్నుకొస్తోంది.

వాడి పసి మనసులో తండ్రి అనే ఆశని కల్పించినందుకు తనని తానే నిందించుకో సాగింది.

తల్లి ముఖం మామూలుగా లేదని గ్రహించి వాడు మౌనంగా వుండిపోయాడు.

డ్రెస్ సెలక్ట్ చేస్తుంటే 'హలో' అనే పలకరింపు వినిపించింది. తల తిప్పి చూసిన సరిత నిటారుగా అయింది.

మాధవి!

ఎవరి సమక్షం ఇబ్బందికరంగా ఉందో, ఎవరి నుంచి తను తప్పించుకోవాలనుకుంటోందో ఆ వ్యక్తే అనూహ్యంగా ప్రత్యక్షమయ్యేసరికి ఆమె ముఖం పాలిపోయింది.

"గుడీవెనింగ్ మేడమ్" అంది తప్పనిసరి అన్నట్టు విష్ చేస్తూ.

"షాపింగ్‌కి వచ్చావా? " అడిగింది మాధవి.

"కాదు. పేవ్‌మెంటు మీద పల్లీలు అమ్మడానికి" అని చెబుదామనుకుంది. పైకి మాత్రం చిరునవ్వుతో "అవును మేడమ్" అంది.

"మీ బాబు కదూ? బాగున్నాడు. నీ పేరేమిటి నాన్నా? " అంది వాడి బుగ్గలు పుణుకుతూ.

"రాహుల్!" చెప్పాడు.

"నైస్ నేమ్! బాబు వాళ్ళ నాన్నగారి పోలిక అనుకుంటాను. మీ పోలిక ఒక్కటీ కనిపించడం లేదు"

"అవును మేడమ్"

"రాహుల్ నీ డ్రెస్ చాలా బాగుంది"

"థాంక్యూ ఆంటీ! మా డేడీ అమెరికా నుంచి తెచ్చారు" వాడి స్వరంలో చిరు గర్వం.

"అవునా? ఇది నీ బర్త్‌డే డ్రెస్సా? స్పెషల్‌గా ఉంది"

"కాదాంటీ! నా బర్త్‌డే రేపు"

"రియల్లీ! ఇన్ ఎడ్వాన్స్ హేపీ బర్త్ డే టూ యూ" చెప్పింది.

"థ్యాంక్ యూ ఆంటీ!"

సరితకి పరిస్థితి ఇబ్బందికరంగా ఉంది. ఎవరినుంచి బాబు పుట్టినరోజు విషయం దాచాలనుకుందో ఆ వ్యక్తికే తెలియచెప్పాల్సి రావడం.

"ఇక్కడ డ్రెస్‌లేమీ బాగా లేవు. మరో షాపులో చూద్దాం రా..." అంది రాహుల్‌తో.

తన ఉనికి ఆమెకి ఇబ్బందికరంగా ఉందని మాధవికి అర్థమయింది.

"ఓకే నేను వస్తాను. ఈ షాప్‌లో డ్రెస్‌లు చాలా బాగుంటాయి సరితా! ఆ మాటకొస్తే ఈ వూళ్ళో ఇదే పెద్ద షాపు. బై రాహుల్" అనేసి వెళ్ళిపోయింది.

ఆమె కనుమరుగయ్యాక సరిత గుండెల నిండా గాలి పీల్చుకుంది.





రెండు డ్రెస్‌లు కొని, బేకరీలో కేక్ తీసుకుని ఇంటికొస్తూ అంది.

"అలా అందరికీ నీ బర్త్‌డే అని చెప్పకూడదమ్మా!"

"ఎందుకని? "

"ఇప్పుడు ఆ ఆంటీకి రేపు నీ బర్త్‌డే అని చెప్పావు కదా! ఆవిడ నీకేదైనా గిఫ్ట్ యిస్తే తీసుకుంటావా? "

"ఏం చెయ్యను? "

"తీసుకోకూడదు"

"అలాగే" బుద్ధిగా తల వూపాడు.

"ఇలా అందరికీ నీ బర్త్‌డే అని చెప్తే వాళ్ళేమనుకుంటారో తెలుసా? నువ్వు వాళ్లిచ్చే గిఫ్ట్‌ల కోసం బర్త్ డే చేసుకున్నావనుకుంటారు"

"ఇంకెవరికీ చెప్పనులే!"

సరిత మనసు చిరాగ్గా ఉంది. మాధవికి రాహుల్ బర్త్‌డే అని తెలిసింది. ఆమె నుంచి తను ఇంకెన్ని ప్రశ్నలను ఎదుర్కోవలసి వస్తుందో అని ఆమె భయం.

"బాబు వాళ్ల నాన్న గారి పోలిక అనుకుంటాను" మాధవి మాటలు గుర్తొచ్చి ఆమె గుండెల్లోని గుబులు రెట్టింపయింది.

తెల్లవారి లేస్తూనే బాబుకి తలంటిపోసి కొత్తబట్టలు వేసి దగ్గరలోనే ఉన్న బాబా గుడికి తీసుకెళ్లింది. బాబు గోత్ర నామాలతో అర్చన చేయించి అనంతరం ఇవతలకి వచ్చి మండపంలో కూర్చోబోతూ అక్కడ కూర్చుని ఉన్న మాధవిని చూసి ఉలిక్కిపడింది.

"నమస్తే మేడమ్" ఎంత ప్రయత్నించినా చిరునవ్వు ఆమె పెదవులపైకి రాలేదు.

"హాయ్ సరితా!" మాధవి నవ్వుతూ పలకరించింది. "విష్‌యు ఎ వెరీ హేపీ బర్త్‌డే అండ్ మెనీ హేపీ రిటర్న్స్ ఆఫ్ ది డే" రాహుల్‌ను దగ్గరకి తీసుకుని వాడి బుగ్గలు పుణికి ముద్దు పెట్టుకుంటూ అంది.

"థ్యాంక్ యూ ఆంటీ..." అన్నాడు వాడు.

"నేను వస్తాను మేడమ్! ఆఫీసుకి టైం అవుతోంది" అంది బయలుదేరడానికి ఉద్యుక్తురాలవుతూ.

"ఒక్క నిముషం" అని బ్యాగ్‌లోనుంచి వంద రూపాయల నోటు, ఒక రూపాయి నోటు తీసి రాహుల్ చేతిలో పెట్టింది.

"చాక్లెట్స్ కొనుక్కో నాన్నా!"

రాహుల్ చప్పున తల్లి ముఖంలోకి చూశాడు. ఆమె ముఖంలోని అయిష్టత, కళ్లలోని వారింపు చూసి "వద్దాంటీ" అన్నాడు ఆ డబ్బుని తిరిగి ఇచ్చేస్తూ.

"నీ బర్త్‌డేకి ఎవరైనా గిఫ్ట్ ఇస్తే తిరిగి ఇచ్చేస్తావా..."

రాహుల్ తల్లివైపు చూశాడు.

సరిత పెదవి బిగపట్టి చూస్తోంది.

మాధవి ఈ గుడికి రావడం యాదృచ్ఛికమా? లేక తను రాహుల్‌తో కలిసి ఇక్కడకొస్తుందని తెలిసే వాడికి గిఫ్ట్ ఇవ్వడం కోసం వచ్చిందా?

"అనుకోకుండా గుడిలో కలిశాం. రాహుల్ బర్త్ డే అని తెలిసీ వాడికేమీ ఇవ్వకుండా ఎలా ఉండగలను? తీసుకోమని చెప్పు సరితా!"

సరిత అయిష్టంగానే "తీసుకో..." అంది.

"ఆఫీసుకి టైమవుతోంది మేడమ్ వస్తాను"

"నేనూ ఆఫీసుకి వెళ్ళాలిగా" అంది మాధవి ఆమెతో బాటు నడుస్తూ. ఇద్దరూ బాబుతో కలిసి బయటకొచ్చారు.

బయట ఒకే ఒక ఆటో ఉంది.

సరిత అడ్రస్ చెప్పి, ఎక్కబోతుంటే మాధవి అంది. "నేను కూడా నీతో వస్తాను. నేను గాంధీపురం వైపు వెళ్లాలి"

"రండి" అంది అయిష్టంగానే.

అపరిచిత వ్యక్తితో షేరింగ్ ఆటో ఎక్కినట్టే సరిత మాధవితో మాట్లాడకుండా కనీసం ఆమెవైపు చూడకుండా కూర్చుంది. మాధవి మాట్లాడించబోయి విఫలమైంది.




రెండు వీధుల అవతల ఉండే సరోజిని, ఆమె కూతురు కామాక్షి పట్టుచీరలు కట్టుకుని, ఒంటినిండా నగలు దిగేసుకుని చేతిలో వెండి కుంకుమ భరిణతో తమ ఇంటిగేటు తీసుకుని తమ ఇంటికి రాకుండా తమ ఇంట్లో అద్దెకి ఉన్న శాంతమ్మగారింటికి వెళ్ళడాన్ని ముడివడిన భృకుటితో చూస్తోంది సూర్యకాంతమ్మ. నిన్నటి దాకా బొమ్మల కొలువు పేరంటం నుంచి పెళ్ళి వరకు తమని క్రమం తప్పకుండా ఆహ్వానించే సరోజిని ఉన్నట్టుండి తమని పిలవడం ఎందుకు మానేసినట్టు? మరచి పోయిందా లేక కావాలనే మానేసిందా? అదీగాకపోతే ముందు శాంతమ్మగారింట్లో పిలిచి తర్వాత తమని పిలుస్తుందా? తనలో తానే తర్జన భర్జనలు పడుతోంది. కాని వాళ్ళిద్దరూ శాంతమ్మ గారింట్లో పిలిచి అటునుంచే వెళ్ళిపోవడంతో ఆగ్రహం కట్టలు తెంచుకుందామెకు.

"సరోజిని, ఆవిడ కూతురు మనని పేరంటానికి పిలవకుండా శాంతమ్మ గారింట్లో పిలిచి వెళ్ళిపోయారు చూసావుటే? "

"ఏం? ఎందుకని? " టీవీ వాల్యూమ్ తగ్గించి, తల్లి ముఖంలోని ఆగ్రహాన్ని విస్మయంగా చూస్తూ అడిగింది వకుళ.

"ఏమో! నేను మొగుడు చచ్చినదాన్ని. నువ్వు మొగుడు వదిలేసిన దానివి. మనం వాయనం అందుకోడానికి పనికిరామని కాబోలు"

వకుళ ముఖం చిన్నబోయింది.

అదేమీ పట్టనట్టు సూర్యకాంతమ్మ తన ధోరణిలో తను ఉంది.

"ఏం నువ్వు ముత్తయిదువుగా పనికి రాకపోతే మాత్రం పేరంటానికి పిలవకూడదా? అందరితోబాటు నీక్కూడా గుప్పెడు సెనగలు, తాంబూలం ఇవ్వచ్చుగా? పోన్లే! పేరంటానికి పిలవకపోతే పోయె. కనీసం గుమ్మంలో నిలబడ్డ నన్ను పలుకరించనైనా లేదు. పలుకరిస్తే పిలవని పేరంటానికి వచ్చేస్తామనుకుంది కాబోలు!"

సూర్యకాంతమ్మ కాస్సేపు సరోజినిని, ఆమె అహంకార పూరిత స్వభావాన్ని విమర్శించి తలుపు తీసుకుని శాంతమ్మ దగ్గరకి వెళ్ళింది. కాస్సేపు మామూలు కబుర్లయ్యాక అడిగింది.

"సరోజిని పేరంటానికి పిలవడానికి వచ్చింది ఏమిటి విశేషం? "

"వాళ్ళమ్మాయి శ్రావణ మంగళవారం నోము" చెప్పిందావిడ.

"మా ఇంట్లో పిలవలేదు చూసారా? "

"అదేమిటి? " శాంతమ్మ తెల్లబోయింది.

"ఏముంది? నేను వెధవముండని. మా అమ్మాయి మొగుడు వదిలేసింది. ఇద్దరం వాయనమందుకోడానికి పనికిరాంగా"

శాంతమ్మ ముఖం వెలవెలబోయింది. "ఇదివరకటి రోజులలో మనలాంటి వాళ్ళని గడపకి బొట్టుపెట్టి పిలిచి వెళ్ళే వాళ్ళు. మనం పేరంటానికి వెళ్ళకపోతే వాయనం ఇంటికి పంపేవారు. పిదప

కాలం, పిదప బుద్ధులూ కాకపోతే అందరూ ఎల్లకాలం ఇలాగే ఉండిపోతారా ఏమిటి? ఎప్పుడు ఎవరి రాత ఎలా తగలబడుతుందో?" సూర్యకాంతమ్మ వాగ్ప్రవాహం కొనసాగిపోతూనే ఉంది.

'నువ్వు మొగుడు వదిలేసినదానివి!' అన్న తల్లిమాటలు వకుళ గుండెల్లో పొడుస్తున్నాయి.

అవును. తనని భర్త వదిలేసాడు. తనకి విడాకులయి వివాహబంధాన్ని తెంపుకుని పుట్టింటికి చేరి అప్పుడే ఆరు నెలలు.

మగవాడిననే అహం అతనిది. మాటకి మాట అప్పచెప్పే అహంకారం తనది. ఇద్దరి మధ్య తగాదాలు ముదిరి వాగ్వివాదాలుగా పరిణమించి అతను చెయ్యిచేసుకునేవరకు వెళ్లాయి. ఇద్దరిలోనూ పట్టుదల, కోపం, ఆవేశం పెరిగి కలిసి ఉండటం కంటే విడిపోవడమే మంచిదనే ఆలోచన నిర్ణయంగా బలపడింది. తనే ముందు విడాకులు కోరుతూ నోటీసు పంపింది. పెద్దవాళ్ళు సర్దిచెప్పడానికి ప్రయత్నించినా ఎవరికి వారు తప్పంతా అవతలివాళ్ళదేననే వాదనతో తమ ప్రవర్తనని సమర్థించుకున్నారు. నాలుగేళ్ళ కొడుకు టింకూ కోసమైనా కలిసి వుండమని, రాజీపడమని మధ్యవర్తులు చెప్పినా వకుళ విడాకులనే కోరుకుంది.

విడాకులు మంజూరయి భర్తతో వైవాహిక బంధాన్ని తెంచుకున్నరోజు మనసంతా తేలిగ్గా అనిపించింది. తనపట్ల కనీస గౌరవం చూపించని భర్త నుంచి విముక్తి కలిగిందని సంతోషించింది.

**తన సంసారాన్ని తనే నాశనం చేసుకుందా! అతను కోపంతో ఏదైనా అంటే తను తిరిగి రెండు అనేది. నిజానికి తన భర్త వసంత్ క్రూరుడేమీ కాదు. కాస్త కోపిష్ఠి అయిన మాట నిజం.**

ఆరు నెలలు గడిచాయి. తన విడాకుల విషయం తెలిసి సంఘంలో కొందరు జాలి, మరికొందరు సానుభూతి చూపారు. చాలామంది హేళనగా పలకరిస్తుండడంతో అవమానమంటే ఏమిటో మొదటిసారిగా తెలిసివచ్చింది వకుళకి.

సూర్యకాంతమ్మ కొడుకులిద్దరూ వేరే ఊళ్ళలో ఉద్యోగాలలో స్థిరపడ్డారు. పెద్ద కూతురి సంసారం బాగానే వుంది. వకుళ పెళ్ళయిన ఏడాదికే తండ్రి పోయాడు. ఇంట్లోని ఒక పోర్షన్ అద్దెకిచ్చి భర్త పెన్షన్‌తో, వచ్చే అద్దె డబ్బులతో కూతురికి, మనవడికి తనే పెద్ద దిక్కుఅయి సంసారాన్ని నెట్టుకొస్తోంది సూర్యకాంతమ్మ. ఆవేశంలో విడాకులు తీసుకున్న వకుళ మనసులో అంతర్మథనం మొదలయింది.

తన సంసారాన్ని తనే నాశనం చేసుకుందా! అతను కోపంతో ఏదైనా అంటే తను తిరిగి రెండు అనేది. నిజానికి తన భర్త వసంత్ క్రూరుడేమీ కాదు. కాస్త కోపిష్ఠి అయిన మాట నిజం. అతను కోపంలో తనని ఏదైనా అంటే తను మాటకి మాట బదులివ్వకుండా వుంటే బాగుండేదేమో!

వకుళ మనసులో ఏ మూలో భర్తతో వైవాహిక సంబంధాన్ని పునరుద్ధరించుకోవాలనే ఆశ కలిగింది. ఒకసారి చట్టరీత్యా విడిపోయాక అతనితో కలిసి జీవించడానికి చట్టం అంగీకరిస్తుందో లేదోననే సందేహం ఒకవైపు, చట్టం అంగీకరించినా భర్త అంగీకరిస్తాడో లేదోననే ఆందోళన మరోవైపు ఆమెని నలిబిలి చేస్తున్నాయి.

ప్రస్తుతానికి వస్తే సరోజినిగారు తనని పేరంటానికి పిలవకపోవడానికి గల కార




ణాన్ని తల్లి చెప్పిన తీరు ఆమెకి బాధని, దుఃఖాన్ని కలగజేస్తోంది. ఈ లోకంలో భర్త చనిపోయిన స్త్రీ పట్ల వున్న సానుభూతి భర్త వదిలేసిన స్త్రీకి ఎందుకు వుండదో అనే వేదన కలిగింది. భర్తతో జీవితాన్ని తిరిగి పంచుకోవాలనే కోరిక ఆమెలో బలీయమవసాగింది.

★ ★ ★

సరిత ఆఫీస్ నుంచి ఇంటికొచ్చేప్పటికి రాహుల్ బుద్ధిగా హోమ్‌వర్కు చేసుకుంటున్నాడు. శాంతమ్మ వంటగదిలో బిజీగా వుంది. కూతురిని చూస్తూనే స్టవ్‌మీద నుంచి మూకుడు దింపి. పాలగిన్నె పెట్టింది. సరిత ముఖం కడుక్కుని వచ్చి తల్లి ఇచ్చిన కాఫీ తాగుతూ అంది.

"వంటకేం తొందర కాస్సేపాగి చెయ్యలేకపోయావా? నేనూ సాయం చేస్తానుగా"

"పగలంతా సామాను సర్దుకుని, నానా హైరానా పడిన ఆ పిల్ల పెందరాళే ఇంతన్నం తింటుందని..."

"ఏ పిల్ల? "

"అయ్యో! నా మతిమండ! నీకు చెప్పనే లేదు కదూ? మన మేడమీద పోర్షన్‌లోకి ఇవాళే ఒక అమ్మాయి అద్దె కొచ్చింది! ఏదో ఆఫీసులో ఉద్యోగం చేస్తోందిట. చాలా మంచిపిల్ల. రాగానే పిన్నిగారూ అని వరస కలిపి నాతో ఎంత ఆప్యాయంగా మాట్లాడిందనుకున్నావ్? . చాలా కలివిడైన అమ్మాయి"

"ఆ అమ్మాయికి నువ్వు వండి పెడతానన్నావా? "

"పాపం! ఇవాళే అద్దెకి వచ్చింది కదా! సామాన్లు సర్దుకోకుండానే హోటల్‌కి వెళ్లి అన్నం తిని వస్తానని బయలుదేరబోతుంటే పిలిచి ఇంతన్నం పెట్టాను. తీరుబడిగా సామాన్లు సర్దుకో. రాత్రికీ నేనే అన్నం పెడతానన్నాను"

సరితకి తల్లి ఉపకార గుణం తెలుసు. మౌనంగా పళ్ళెంలో బియ్యం పోసుకుని వచ్చి ఏరి తల్లికి ఇచ్చింది.

"ఒకసారి తనని పలకరించిరా"

"తర్వాత వెళ్తానులే" అంది సరిత.

వంట పూర్తవగానే రాహుల్‌కి అన్నం తినిపించింది. వాడి భోజనం పూర్తికావస్తుండగా శాంతమ్మ "ఆ అమ్మాయిని పిలుచుకొస్తాను. మనం కూడా తినేద్దాం" అని మేడమీదకి వెళ్ళింది.

పది నిముషాల తర్వాత తల్లి వెనుక వస్తున్న ఆమెని చూసి సరిత షాక్ అయింది.

ఆమె మాధవి.

"సరితా! నువ్విక్కడ...? అంటే, సరిత మీ అమ్మాయా పిన్నిగారూ!" సంభ్రమంతో తలమునకలయింది మాధవి.

"గు... గుడీవెనింగ్ మేడమ్" ఆ క్షణంలో నత్తి వచ్చింది సరితకి.

"మీ ఇద్దరూ ఒకరికొకరు ముందే తెలుసా? " శాంతమ్మ ఆశ్చర్యపోయింది.

"నేను, సరిత ఒకే ఆఫీసులో పనిచేస్తున్నామండీ"

సరిత కళ్ళల్లో ఇక్కడ కూడా తయారయ్యావా తల్లీ అనే భావం కదలాడుతోంది.

"బాగానే వుంది. పోన్లే! రేపటి నుంచి ఇద్దరూ ఆఫీసుకి కలిసి వెళ్ళి రావచ్చు" అంది శాంతమ్మ.

"ఆవిడ నా బాస్ అమ్మా! నేనామె సబార్డినేట్ ని. అది మరచిపోకు" సరిత స్వరంలోని అయిష్టతని పసిగట్టింది మాధవి.

"ఆఫీసులో ఉన్నంతసేపే నేను నీ బాస్‌ని. ఇక్కడ కాదు"

సరిత తనతో ముభావంగా మాట్లాడే తీరుని కొన్నాళ్ళుగా మాధవి గమనించక పోలేదు. ఆమెకి తనపట్ల ఉన్నది అయిష్టతో ఉదాశీనతో ఆమెకి అంతుపట్టడం లేదు. తనామె బాస్ అనే భయం, గౌరవం కాదు. తన ఉనికిని ఆమె భరించలేకపోతోందనేది నిజం. సాధారణంగా ఆ పరిస్థితిలో మరెవరైనా వుండి ఉంటే తన ఉనికే గిట్టని వ్యక్తికి దూరమయిపోతారు. కాని మాధవి సరితతో స్నేహంగా మెలగుతూ ఆమె ఆంతర్యమేమిటో తెలుసుకోవాలనుకుంది.

"రాహుల్ భోజనం చేసాడా? పడుకున్నాడా? "

"ఆc...!" అంది సరిత తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో.

"రామ్మా భోజనం చేద్దాం" అంది శాంతమ్మ. సరిత కంచాలు పెట్టి, నెయ్యి స్టవ్‌మీద కరిగిస్తుంటే శాంతమ్మ వడ్డనకి ఉపక్రమించింది.

భోజనాల దగ్గర మాధవి ప్రతి అయిటమ్‌ని పొగుడుతూ తింది.

"అన్నీ బాగున్నాయని మెచ్చుకోడమేనా, మరికాస్త వడ్డించుకునేదేమైనా వుందా" ఆవిడ మరికాస్త కూర వడ్డించిందామె కంచంలో.

"అమ్మో! ఇంక తినలేనండీ" మాధవి చెయ్యి అడ్డం పెడుతున్నా వినలేదావిడ.

ఆ ఇద్దరినీ అసహనంగా చూస్తున్న సరిత బలవంతాన ముద్దలు ఎక్కిస్తోంది.

"ఒక్కర్తివీ పడుకోడానికి భయమనిపిస్తే మీ ఇంటి తలుపు తాళం పెట్టి కిందకొచ్చెయ్యి. మా దగ్గరే పడుకుందుగాని" అంటున్న తల్లివైపు ఎర్రగా చూసింది.

శాంతమ్మ గతుక్కుమంది. మాధవి నవ్వేసింది. "ఒంటరిగా వుండడం నాకలవాటేనండీ" ఆవిడ మరి మాట్లాడలేదు.

"గుడ్‌నైట్ సరితా! వెళ్లొస్తానండీ. మీ ఆతిథ్యానికి చాలా థ్యాంక్స్"

"గుడ్‌నైట్ మేడమ్" ముఖాన నవ్వు పులుముకుని, ఆమెని సాగనంపడానికి గుమ్మంలో నిలబడిన సరిత ఆమె వెళ్ళగానే గుండెలనిండా గాలి పీల్చుకుంది.

వీధి తలుపులు మూసి తల్లివైపు అసహనంగా చూస్తూ అంది.

"మాధవికి ఇప్పటివరకు చేసిన మర్యాదలు చాలు. ఇకపై ఆ అమ్మాయికి కాస్త దూరంగా వుండు"

"అదేమిటే... నేనేం మర్యాదలు చేసాను? ఒంటరి ఆడపిల్ల కొత్తగా అద్దెకొచ్చింది. సామాన్లు సర్దుకుని అప్పటికప్పుడు వంట ఎలా వండుకోగలదని అన్నం పెడితే తప్పా? "

"తప్పులేదు కాని ఇంక మీదట తప్పనిసరి పరిస్థితులలో తప్ప ఆమెని ఇంటికి పిలవకు"

# ఖరీదైన కుక్కబతుకు!







**కు**క్కలు పెంచేవారు కుటుంబం అంతా కలిసి ఏదైనా ఊరెళ్ళాల్సి వస్తే, ఆ కుక్కల్ని ఎక్కడ ఉంచాలి అన్నది సమస్య. బంధుమిత్రుల ఇళ్ళలో పెంపుడు కుక్కని ఉంచి వెళ్ళాల్సివస్తుంది. ఈ సమస్యకి పరిష్కారంగా అమెరికాలో కుక్కలకూ ప్రత్యేకంగా కొన్ని హోటల్స్‌ని నడుపుతున్నారు. అక్కడ మొత్తం ఆరున్నర కోట్ల పెంపుడు కుక్కలున్నాయని అంచనా.

ధనవంతుల కుక్కల కోసం ఖరీదైన హోటల్స్ ఉన్నాయి. వారు ఇరవైనాలుగు గంటలకి కుక్కకి 250 డాలర్లు ఛార్జీ చేస్తారు. కుక్కలకి మినరల్ వాటరే ఇస్తారు. ఒక్కోదానికి ఒక్కో సూట్ ఉంటుంది. మ్యూజిక్ స్విమ్మింగ్‌పూల్స్ సౌకర్యాలున్నాయి. వీటిని సాయంత్రాలు నడిపించడానికి ప్రత్యేక సిబ్బంది ఉంటారు.

వాటికి ప్రత్యేకంగా వండిన మాంసం పెడతారు. కొన్ని హోటల్స్‌లో వాటి భోజనాన్ని వండకుండా పచ్చిగా పెడతారు. ఎద్దు మాంసం, గుడ్లు పెడతారు. ఆరోగ్యం కోసం వెల్లుల్లి, అల్లం మొదలైనవి కూడా వాటిలో కలుపుతారు. కొన్ని హోటళ్ళల్లో కోడి, నిప్పు కోడి, దున్న, ఎద్దు మాంసాలకి కూరగాయలు, ఆలివ్, ఆపిల్, బంగాళాదుంపలు మొదలైనవి కలిపి వండి పెడతారు. ఎలాంటి భోజనం పెట్టాలో కుక్కలని హోటల్‌లో చేర్పించే ముందే కోరవచ్చు. సాధారణంగా దాని యజమాని తినే భోజనం ఖరీదు కన్నా, హోటల్స్‌లో కుక్కల భోజనం ఖరీదు ఎక్కువగా ఉంటుంది.

కొన్ని హోటల్స్‌లో సీజన్‌ని బట్టి వాటికి స్వెట్టర్లని కూడా తొడుగుతారు. ప్రత్యేక టి.వి. కార్యక్రమాలని వీడియోలో చూపిస్తారు. ఇరవైనాలుగు గంటలు పశువుల డాక్టర్ అందుబాటులో ఉంటాడు. దాని యజమాని ఫోన్ చేసి దాంతో ఫోన్‌లో మాట్లాడచ్చు. యజమాని కంఠాన్ని అవి గుర్తు పడతాయి.

కుక్కల హోటల్స్ అమెరికాలో లాభసాటి వ్యాపారంగా జోరుగా సాగుతోంది.

మధ్య తరగతి వారి కుక్కల హోటల్స్‌లో రోజుకి ఓ కుక్కకి 75 డాలర్లు ఛార్జ్ చేస్తారు. అమెరికన్ పెట్ ప్రొడక్ట్స్ మాన్యుఫేక్చర్స్ అసోషియేషన్ సూచన ప్రకారం యజమానులు తమ పెంపుడు కుక్కల్ని తమ పిల్లల్లా చూసుకుంటారు. ఇంటికి తిరిగి రాగానే వారికి పిల్లల్లా తమ కుక్క కూడా కనపడాలి అనుకుంటారు.

"ఆ అమ్మాయి నీ బాస్ అన్నావు"
"అయితే?"
"అహఁ! మంచిది కాదా? నిన్ను వేధిస్తుంటుందా?"
"అలాంటిదేమీ కాదు"
"మరి..."
"అనవసరంగా నా విషయంలో జోక్యం చేసుకుంటోంది. పదే పదే నా భర్త గురించి ఆరాలు తీస్తుంది. నా అనుమానం నా మీద పత్తేదారు పని చెయ్యడానికే మేడ మీదకి కాపురం వచ్చిందా?"
"ఛ! నీ గురించి ఆరాతీస్తే ఆ అమ్మాయికేం వస్తుందే?"
"అది ఆ అమ్మాయికే తెలియాలి"
"నువ్వనవసరంగా ఆ అమ్మాయిని అనుమానిస్తున్నావు"
"నాది అనుమానం అవునో కాదో కాని నువ్వు మాత్రం ఆమెని మితిమీరి అభిమానిస్తున్నావు"
"ఏదో! ఒంటరి ఆడపిల్ల పోనిద్దూ!"
"నువ్వు మాధవికి రోజూ అన్నం పెట్టినా, ఒళ్ళో కూర్చోబెట్టుకుని గోరు ముద్దలు తినిపించినా నాకేమీ ఫర్వాలేదు కాని, ఆమె నా గురించి ఏం అడిగినా నేనేం చెబుతున్నానో అదే చెప్పాలి"
"అలాగేనమ్మా! నేను మాత్రం నిజమెందుకు చెబుతాను? ఇంటి గుట్టు చెప్పుకుంటారా ఎవరైనా?"
"సర్లే, నువ్వు పడుకో. ఈ పని నేను చేస్తాను" అంది సరిత వంటిల్లు సర్దుతూ.
శాంతమ్మ నిద్రపోతున్న రాహుల్ పక్కనే పడుకుంది.
సరిత అందమైన అబద్ధాలతో లోకాన్ని నమ్మిస్తోంది. ఆ అబద్ధానికి మరిన్ని రంగులు పులిమి రాహుల్‌ని భ్రమలో బతికేలా చేస్తోంది. వాస్తవం తెలిస్తే ఆ పసిమనసు తట్టుకోగలదా? ఆవిడ మనసులోని భయం, ఆందోళన రోజురోజుకీ పెరిగిపోతున్నాయి.

★ ★ ★

"రామ్మా సామాన్లన్నీ సర్దుకున్నావా?" తమ ఇంట్లోకి వస్తున్న మాధవిని ఆప్యాయంగా పలుకరించింది సూర్యకాంతమ్మ.
"కొన్ని సర్దుకున్నానండి. ఇంకా కొన్ని వున్నాయి. ఆదివారమయితే ఖాళీగా వుంటాను. అప్పుడు సర్దుతాను" అంది మాధవి.
"వకుళా టీవీ వాల్యూమ్ తగ్గించు" అని బిగ్గరగా చెప్పిందావిడ. తను వచ్చినా పట్టించుకోకుండా దీక్షగా తెలుగు డైలీ సీరియల్‌ని చూస్తున్న ఆ అమ్మాయిని అప్పుడు చూసింది మాధవి.
"మీ కోడలా?" అడిగింది నవ్వుతూ.
"కాదమ్మా... మా అమ్మాయి"
"ఏ ఊళ్ళో వుంటారు?"
"ఇక్కడే వుంటుంది"
"అల్లుడికి ఇక్కడ ఉద్యోగమా?"
"హుఁ... అల్లుడు దాని కాపురం సవ్యంగా వుంటే మా ఇంట్లో ఎందుకుంటుంది? విడాకులయిపోయాయి. మొగుడు నీచుడు, దుర్మార్గుడు"
"సారీ తెలియక అడిగాను ఏమీ అనుకోకండి" అంది మాధవి నొచ్చుకుంటూ.
"అనుకోడానికేముంది లేమ్మా? అనుకుని ప్రయోజనం మాత్రం ఏం వుంది? జన్మంతా అది ఒంటరిగా బతకాలి. దాన్ని చూసి చచ్చేవరకు నేను ఏడవాలి" ముక్కు చీదింది.
మాధవి సానుభూతిగా అంది.
"భర్త పోయినా, వదిలేసినా కష్టం ఒకటే! నేనర్థం చేసుకోగలను"
"మొగుడు పోయిన ఆడదంటేనే లోకానికి సానుభూతి. మొగుడు వదిలేసిన ఆడదంటే అందరికీ లోకువే! నా కూతురు వీధిలోకి వెళ్తే చాలు, నోటితో మాట్లాడుతూనే

నాసలుతో వెక్కిరిస్తారు"

సీరియల్ చూడడం అయిపోయిన ట్టుంది. టీవీ ఆఫ్‌చేసి వాళ్ళ దగ్గరకొచ్చి కూర్చుంది వకుళ. మాధవిని చూసి పలు కరింపుగా నవ్వింది.

"హాయ్! నా పేరు మాధవి. వైష్ణవీ కంప్యూటర్స్‌లో అకౌంట్స్ ఆఫీసరుగా పని చేస్తున్నాను" అంది మాధవి తనని తాను పరిచయం చేసుకుంటూ.

"సరిత పనిచేసేది మీ ఆఫీసులోనే కదూ? " అడిగింది వకుళ.

"అవును"

"అసలు ఆ అమ్మాయికి ఉద్యోగమెం దుకు? మొగుడు అమెరికా నుంచి పంపు తున్న డాలర్లు సరిపోకనా? " గొంతు తగ్గించి అడిగింది సూర్యకాంతమ్మ.

మాధవి ఏదో అనేలోగా మళ్ళీ తనే అంది. "డబ్బేనా, చీరలు, సెంట్లు, హేండ్ బ్యాగ్‌లు ఎన్ని పంపుతాడని. రోజుకో చీర సింగారించి ఉద్యోగం పేరుతో టింగురంగా మని బయలుదేరుతుంది. వయసులో వున్న ఆడపిల్ల వీధిలోకి వెళ్తే ఏ మగవాడు చూడకుండా వుంటాడు? అసలే అంద గత్తె. ఆపైన మంచిచీర సింగారించి రోడ్డుమీదకి వెళ్తే మగవాడి బుద్ధి వూరు కుంటుందా? అందుకే మా వకుళని చది వించమని ఎంతమంది చెప్పినా బలవంత పెట్టలేదు. ఇప్పుడది చదువుకుని ఉద్యోగం



చెయ్యాలా.. వూళ్ళేలాలా? "

"మీరేం చదువుకున్నారు వకుళా? " అడిగింది.

"బీఎస్సీ ఫస్టియర్ చదువుతుండగానే పెళ్ళయింది. దానితో చదువు మూలపడింది"

"ఎలాగోలా చదువు పూర్తి చెయ్యవలసింది"

"ప్చ్! నాకు ఇంట్రెస్టు లేదు. అయినా నేనున్న పరిస్థితులలో చదువెలా సాగుతుంది? ఎంత వద్దనుకున్నా పాత జ్ఞాపకాలు నన్ను వెంటాడుతూనే వుంటాయి"

"ప్రతి మనిషి జీవితంలోను మరిచిపోలేని మధురానుభూతులు వుంటాయి. మనసుని గుచ్చే బాధలూ వుంటాయి. బాధలని మరచిపోడానికి, మనసుని ఆరోగ్యంగా వుంచుకోడానికి ప్రతి మనిషికి ఒక వ్యాపకం అవసరం"

**"టీవీ చూస్తాను కాని సీరియల్స్ చూడను. ఇరవై నాలుగు గంటలూ దుఃఖించే స్త్రీలను చూపిస్తూ, వాళ్ళ గతి అంతేనని, అందులోనే వాళ్ళు ఆనందం అనుభవిస్తారని చూపించే ఆ కథలని ఎందుకు పనిగట్టుకుని చూడడం?"**

"ఏమో! టింకూని స్కూలుకి పంపడం, వాడు స్కూలు నుంచి వచ్చాక చదివించడం అదే సరిపోతుంది నాకు"

"ఖాళీ సమయంలో ఏం చేస్తావ్? " అప్రయత్నంగానే ఏకవచనంలో అడిగింది.

"టీవీ చూస్తాను. బోలెడు కాలక్షేపం, ఎంత మంచి సీరియల్స్ వస్తున్నాయో? మీరు చూడరా? "

"టీవీ చూస్తాను కాని సీరియల్స్ చూడను. ఏముంటుంది వాటిలో? ఇరవై నాలుగు గంటలూ దుఃఖించే స్త్రీలను చూపిస్తూ, వాళ్ళ గతి అంతేనని, అందులోనే వాళ్ళు ఆనందం అనుభవిస్తారని చూపించే ఆ కథలని ఎందుకు పనిగట్టుకుని చూడడం? కోడళ్ళ మీద కుట్ర పన్నే అత్తలు, తిప్పికొట్టే కోడళ్ళు, ఆడబడుచులని శత్రువులుగా చూసే వదినగారు. విషప్రయోగం చేసయినా తమకి అడ్డువచ్చిన వాళ్ళని అడ్డు తొలగించుకోవాలని చూసే ఆడ విలన్లు- ఏ సీరియల్ చూసినా ఇవే కదా కథలు? ఇవి కాకపోతే సినిమాలు! స్త్రీలని ఎడ్యుకేట్ చేసే ప్రోగ్రామ్స్‌ని టీవీ ఛానెల్స్ ఎందుకు టెలికాస్ట్ చెయ్యకూడదు? "

"టీవీ సీరియల్స్ స్త్రీలని చైతన్యవంతం ఎందుకు చెయ్యడం లేదు? తప్పతాగి వచ్చి భార్యని తన్నే మొగుడికి గుణపాఠమెలా చెప్పాలో చెప్పింది ఆవేదన సీరియల్. పెత్తనం చెలాయించే మొగుడి పాదాల దగ్గర పడివుండకు. విడాకులివ్వడం తప్పుకాదు అని విడాకులు సీరియల్ సందేశం ఇచ్చింది. ఆ సీరియల్‌ని మొదట్లో నేను చూసేదాన్ని కాదు. ఒకరోజు యాధాలాపంగా టీవీ ఆన్ చేసేటప్పటికి ఆ సీరియల్ వస్తోంది. దాంతో హీరోయిన్ కష్టాలకి నా కష్టాలకి దగ్గర పోలిక కనిపించింది. ఇంక ప్రతీ రోజు ఆ సీరియల్ చూడందే తోచేది కాదు. మీరు నమ్మండి నమ్మకపోండి. ఆ సీరియల్‌లోని ప్రతీ సంఘటన నా జీవితంలో జరిగిందే. ఎవరో నా జీవితాన్ని చదివి ఆ సీరియల్ తీశారనిపించింది"

"అవునా? " ఆశ్చర్యంగా అడిగింది మాధవి.

"నిజం. అందుకే ఆ సీరియల్ ముగింపుని ఆదర్శంగా తీసుకున్నాను. తన మాటే నెగ్గాలనే విపరీత మనస్తత్వం వున్న నా మొగుడికి విడాకులిచ్చాను"

"మీరే విడాకులిమ్మని అడిగారా? "

"అవును... నేను కాబట్టి అలాంటి మొగుడితో నాలుగేళ్లు కాపురం చేసాను. మరొకరైతే పెళ్ళయిన మూడో రోజునే తాళి తీసి వాడి ముఖాన కొట్టేవారు"

"ఆయన తాగేవారా? "

"తాగి హింసించే రకం కాదులెండి, తాగ కుండానే హింసించే రకం"

"అంటే! కొట్టేవారా? "

"నా ఆత్మాభిమానం మీద చావుదెబ్బ తీసారు. నా అభిప్రాయాలని ఏనాడూ గౌరవించలేదు. నా వ్యక్తిత్వాన్ని కించపరి చేవాడు. నేను ఎదురు తిరిగాను. పోట్లా డాను. చిన్న విషయాన్ని పెద్దది చేసి కొట్టాడు ఒకరోజు. ఒళ్ళుమండి నీతో కాపురం చెయ్యనని తెగేసి చెప్పాను. అందరూ సర్దుకుపోవాలని నాకు చెప్పే వారే! ఎంతకని సర్దుకుంటాం? అయినా తనూ సర్దుకోవాలిగా. మా లాయర్ విడా కుల నోటీసు పంపగానే దెబ్బకి కాళ్ళబేరా నికి వచ్చాడు ముసలాడు"

"ముసలాడా? "

"అదే మా మామగారు. నీ కొడుకుతో కాపురం చేసేది కల్ల అని తెగేసి చెప్పాను. ముఖం మాడ్చుకుని వెళ్ళిపోయాడు"

మాధవికి ఆ కాస్సేపటిలోనే వకుళ మనస్తత్వం బాగా అర్ధమయింది. ఆమెకి ఇంక ఆ సంభాషణ పొడిగించాలనిపించ లేదు. మాట మారుస్తూ అడిగింది.

"మీ అబ్బాయిని చూసాను. చాలా ముద్దుగా వున్నాడు. పేరేమిటి? "

"రామ్‌నారాయణ. మా మామగారి పేరు. మేం టింకూ అని పిలుస్తాం. అసలు వాడికి మా నాన్నగారి పేరు విశ్వ నాథ్ అని పెడదామనుకున్నాను. కాని అక్కడా అతనిష్టమే. వాళ్ళ నాన్న పేరు పెట్టాలని పట్టుదల. చివరికి తన పంతమే నెగ్గించుకున్నాడు"

"మొదటి బిడ్డకి సహజంగా మామగారి పేరు పెడతారుకదా"

"వాళ్ల నాన్న అతనికెంత ఎక్కువో మా నాన్న నాకు అంతకంటే ఎక్కువ కాదా? అందుకే మా అబ్బాయి పేరు మార్చి నాన్నగారి పేరు పెడతాను. వాడు నా బిడ్డ. నా బిడ్డగానే పెరుగుతాడు. నాకేం లోటు? టింకూని ఇరవయ్యేళ్ళు కష్టపడి పెంచితే నా చేతికి అందివస్తాడు. ఆయ నకే ఎవరూ వుండరు. ఆ ముసలాళ్ళిద్దరూ శాశ్వతమనుకుంటున్నాడు" నిరసనగా అంది.

"...టింకూ వాళ్ళ డేడీ మళ్ళీ పెళ్ళి చేసు కున్నారా..."

వకుళ ముఖం వెలవెల పోయింది. వసంత్ మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడా? ఇన్నాళ్ళూ ఆ విషయమే ఆలోచించలేదే. ఆమె ముఖంలో మారుతున్న రంగులు మాధవి గమనించకపోలేదు.

★ ★ ★

"అమ్మమ్మా! నాకు యూనిట్ టెస్ట్‌లో క్లాస్‌ఫస్ట్ వచ్చింది" సంబరంగా చెప్పాడు టింకూ.

"మా నాయనే! మా బంగారు కొండే!" మనవడి బుగ్గలు పుణికి ముద్దు పెట్టు కుంది సూర్యకాంతమ్మ.

"ఇలాగే ప్రతీ క్లాసు ఫస్టునా ప్యాసయి పెద్ద చదువులు చదివి పెద్ద ఉద్యోగం చెయ్యాలి నువ్వు. ఇలాంటి బంగారు కొండని దూరం చేసుకున్నందుకు మీ నాన్న కుళ్ళిపోవాలి"

"మా డేడీ బేడ్ బాయ్! వాడిపేరు నా దగ్గర చెప్పకు" టింకూ ముఖం చిట్లిం చాడు.

మూడేళ్ళ వయసులో తండ్రికి దూర మైన టింకూ పసి మనసులో వసంత్ రాక్షసుడనే భావాన్ని, అతనిపై ద్వేషాన్ని

**కొత్తగాలి...**

**ఊరికి ప్రయాణం**
**తిరిగి వచ్చేప్పుడు**
**సూట్‌కేస్ నిండా జ్ఞాపకాలు**

**-అనూరాధ రామకృష్ణ**

ఉగ్గుపాలతో రంగరించి పోసి, ఆ ప్రయత్నంలో సఫలీకృతులయ్యారు సూర్యకాంతమ్మ, వకుళ. వాడు మేజరయ్యాక స్వచ్ఛందంగా తండ్రి దగ్గరకి వెళ్ళిపోవాలని కోరుకుంటే వెళ్ళే హక్కు వాడికి వుందని లాయర్ చెప్పిన మాటలు ఆ తల్లీ కూతుళ్ళని భయపెట్టాయి. ఒక రకంగా తండ్రిపై వాడికి ద్వేషభావాన్ని కలిగించడానికి కారణం అదే. ఇప్పుడు టింకూ అలా అనగానే సూర్యకాంతమ్మ సంతోషించింది.

"టింకూ!" ఉరుము లాంటి వకుళ పిలుపుతో టింకూయే కాదు, సూర్యకాంతమ్మ కూడా ఉలిక్కిపడింది.

"డేడీని వాడు వీడు అనొచ్చా? "

"డేడీ, బేడ్‌బోయ్ అని నువ్వే చెప్పావుగా" భయపడుతూనే ఎదురు ప్రశ్నించాడు.

"నోర్మూయ్యి! వీపు పగలగొడతాను వెధవా!" వాడి చెయ్యి పట్టుకొని గదిలోకి లాక్కెళ్ళింది.

కూతురిలో హఠాత్తుగా వచ్చిన ఈ మార్పుకి సూర్యకాంతమ్మ నివ్వెరపోయింది.

వకుళ గది తలుపు మూసేసి అంది అనునయంగా.

"టింకూ డేడీ చాలా మంచివారు"

"నిన్ను తిట్టేవారని, కొట్టేవారని చెప్పావుగా? "

"నువ్వు అల్లరి చేస్తే నేను కూడా నిన్ను కొడతానుగా? నేనంటే నీకిష్టం లేదా? "

"చాలా ఇష్టం"

"డేడీని ఇంకెప్పుడూ 'వాడు' అనకేం? "

"అనను"

భర్తతో వైవాహిక జీవితాన్ని పునరుద్ధరించుకోవాలనే కోరిక వకుళలో ఎప్పుడు కలిగిందో, టింకూని అందుకు మానసికంగా సంసిద్ధుడిని చేయాలనుకుంది. కాని తన ప్రయత్నం సఫలమయ్యే అవకాశం వుందో లేదోననే సందేహం అమెని పీడిస్తోంది. అందుకే ఆమె బయటపడదలచుకోలేదు. చివరికి తల్లితో కూడా తన మనసులోని ఆలోచన చెప్పదలుచుకోలేదు.

★ ★ ★

"నాన్న ఎప్పుడొస్తారమ్మా? " అడిగేడు రాహుల్.

సరిత ఎప్పటి లాగే చెప్పింది- "నువ్వు పెద్దవాడి వయ్యాక"

"పెద్దవాడిని ఎప్పుడవుతాను? " తల్లి సమాధానంతో తృప్తిపడక తిరిగి ప్రశ్నించాడు.

"పేచీ పెట్టకుండా అన్నం తినేసి బాగా చదువుకుని పెద్ద ఉద్యోగం చేసాక"

"నేను పేచీ పెట్టకుండానే అన్నం తింటున్నాను కదమ్మా"

"మరి బాగా చదువుకో"

"మొన్న ఎగ్జామ్‌లో నాకు క్లాస్ ఫస్టు వచ్చిందిగా? నీకు తెలుసా? స్కూల్‌లో చేరిన దగ్గర నుంచి నేనే క్లాస్ ఫస్ట్"

"అవును నువ్వు గుడ్‌బోయ్‌వి" వాడి నుదుటి మీద పడుతున్న జుట్టుని సవరిస్తూ అంది.

"నా ప్రోగ్రెస్ కార్డు దాచి వుంచే? నాన్నకి చూపించాలి"

"అలాగేలే!" అంది కళ్ళలో చివ్వున ఊరబోతున్న నీటిని నిగ్రహించుకుంటూ.

వాడు పుట్టి బుద్ధెరిగాక ఎప్పుడూ, వాడి

తండ్రిని చూడకపోయినా తండ్రిపట్ల ఎంత మమకారాన్ని పెంచుకున్నాడో సరితకి తెలుసు.

వాడి తండ్రి అమెరికాలో వున్నాడని వాడితో అబద్ధం చెప్పకుండా వుండవలసిందనే గిల్టీనెస్‌తో ఆమె ఈమధ్య తరచుగా బాధపడుతోంది. తను భర్త నుంచి లీగల్‌గా విడిపోయిందనే విషయాన్ని అర్థం చేసుకునే వయసు వాడికి ఇంకా రాలేదు. సరితకి విడాకులు మంజూరయిన రోజు గుర్తుకొచ్చింది.

కోర్టు డైవోర్స్ డిక్రీ ఇచ్చాక బందిఖానాలో నుంచి బయటపడిన ఫీలింగ్ కలిగింది. తన గుండెలమీద వేలాడుతున్న మంగళసూత్రాలు భర్తని గుర్తుకు తెస్తుంటే కసిగా ఉక్రోషంగా వాటిని మెడలో నుంచి తీసెయ్యబోయింది.

"తప్పమ్మా!" తల్లి వారించింది. భర్త చనిపోయాక మాంగల్యాన్ని తీసెయ్యమన్న మన సాంప్రదాయం భర్త నుంచి విడిపోయిన స్త్రీని మాంగల్యాన్ని తీసెయ్యమని చెప్పలేదు. ఎందుకంటే పెళ్లి మన సంస్కృతిలో భాగం. విడాకులు మనుషులు చేసిన చట్టం కల్పించినవి.

సరితకే అర్థం కాలేదు. తను మాంగల్యాన్ని వుంచుకోవాలో తీసెయ్యాలో వాటిని మెడలో కట్టిన భర్త పరమ దుర్మార్గుడు క్రూరుడు. అది వేరే సంగతి. అటు పల్లె ఇటు పట్నము కాని ఆ ఊళ్లో ఆమె విడాకులు చర్చనీయాంశమయ్యాయి. కొందరి జాలి, మరికొందరి సానుభూతి, ఇంకొందరి వ్యంగ్యం- సరిత మనసు నలిబిలి అవుతోంది.

"మనం ఈ ఊళ్ళో వుండద్దమ్మా" అంది.

"ఎక్కడికెళ్తాం! ఎక్కడకి వెళ్లినా ఇలాంటి మనుషులు- ఇవే మనస్తత్వాలు" నిస్పృహగా అంది శాంతమ్మ.

"ఇక్కడ నుంచి దూరంగా మరో ఊరికి మకాం మారిస్తే అక్కడి వాళ్ళకి మన గురించి ఏమీ తెలియదు. అసలు నాకు విడాకులయిన విషయాన్ని ఎవరికీ చెప్పద్దు"

"మరి? "

సరిత తన భర్త చనిపోయాడని చెప్పి మంగళసూత్రం తీసేద్దామనుకుంది. కాని ఈ సమాజం మగతోడు లేని ఆడదాన్ని చులకనగా చూస్తుంది. అందువల్ల తన భర్త అమెరికాలో వున్నాడనే అబద్ధంతో అందరినీ, నమ్మించింది. తన అన్నయ్య అమెరికా నుంచి తన కోసం తెచ్చిన చీరలని, రాహుల్ కోసం తెచ్చిన బట్టలని, బొమ్మలని భర్త పంపుతున్నాడని చెబుతూ ఆ అబద్ధానికి మరిన్ని రంగులు పులిమింది.

కాని రాహుల్ మనసులో 'తండ్రి' పట్ల ప్రేమని తనకి తెలియకుండానే పెంచుతోందని ఆమెకి తెలియదు.

★ ★ ★

"ఆంటీ!"

"రా మాధవీ!" సాదరంగా ఆహ్వానించింది వర్ధనమ్మ. "ఇల్లు మారతానన్నావు. మారావా!" మంచినీళ్లు తెచ్చిస్తూ అడిగింది.

"మారానాంటీ! ఆఫీసుకి కొంచెం దూరమే. అయినా బండిమీద వెళ్తాను కాబట్టి ఫర్వాలేదు"

వర్ధనమ్మ నిట్టూర్చింది. "మీ వాళ్లెవరైనా వచ్చారా? "

"రాలేదు. రారు కూడా. వాళ్లకి కావలసింది నా డబ్బు తప్ప నేను కాదు. నా దగ్గర డబ్బు లేదని తెలిశాక నిర్మొహమాటంగా నాతో బాంధవ్యాన్ని తెంచుకున్నారు"

"అయిన వాళ్లందరూ వుండి కూడా

నువ్వు ఒంటరి దానివయ్యావు" వర్ధనమ్మ కన్నీళ్లు పెట్టుకుంది.

"నేను ఒంటరి దాన్నని నేనెప్పుడూ అనుకోడంలేదు. నన్ను నన్నుగా ప్రేమించే వాళ్లంతా నా వాళ్లే. అవునూ, ఆనంద్ ఫోన్ చేసాడా ఈ మధ్య? "

"ఆ! నిన్ననే మాట్లాడాడు"

"ఎలా ఉన్నాడు? "

"బాగానే వున్నాడట. వచ్చే నెలలో ఇండియాకి వస్తున్నాడు. ఇక్కడ నెలరోజులుంటాడుట. పెళ్లి చేసుకోరా సంబంధం చూస్తానంటే ఈ జన్మలో పెళ్లి ప్రస్తావన తేవద్దంటాడు. కనీసం పిల్లలున్నా వాళ్ల కోసం మళ్ళీ పెళ్లి చేసుకునేవాడేమో! భగవంతుడు చిన్న చూపు చూశాడు" ఆవిడ స్వరం గాద్గదికమయింది.

"ఇష్టం లేనప్పుడు బలవంతం చెయ్యడం మంచిది కాదులెండి. కొన్నాళ్ళు పోయాక ఆనంద్ మనసు మారుతుంది"

వర్ధనమ్మ గుండెల్ని పిండేసే బాధ నిట్టూర్పుగా వెలువడింది. ఆనంద్ కోసమే కాదు. మాధవి కోసం కూడా ఆవిడ బాధ పడుతోంది. ఇరుగుపొరుగు వాళ్ళైన మాధవి కుటుంబం తమ కుటుంబం ఒకే కుటుంబంలా కలిసి మెలసి వుండేవారు. యాభై లక్షల రూపాయల ఆస్తికి వారసురాలైన మాధవి ఉద్యోగం చేస్తూ ఒంటరి పోరాటం చేస్తోందంటే అందుకు కారకులెవరు? రాబందుల్లాంటి బంధువులే కదా! ఆనంద్ అమెరికాలో బాగానే సంపాదిస్తున్నాడు. పైగా భార్యాబిడ్డలు లేనివాడు. వాడి ఆస్తికోసం ఎన్ని రాబందులు కాచుకున్నాయో!

"వెళ్ళొస్తానాంటీ!"

మాధవి పిలుపుతో తెప్పరిల్లింది.

"అలాగేనమ్మా! నువ్వు కొత్తగా మారిన ఇంటి అడ్రస్ చెప్పు, వస్తాను"

"నేనుండేది మేడమీద. మీకు అసలే మోకాళ్ల నొప్పులు. ఎక్కలేరు. నేనే మళ్లీ వస్తానులెండి"

"సరేనమ్మా!"

మాధవి వెళ్తుంటే బంగారంలాంటి పిల్ల. చిన్న వయసులోనే ఎంత కష్టం వచ్చింది! అనుకుంది వర్ధనమ్మ.

★ ★ ★

"ఎవరిచ్చారు నీకీ చాక్లెట్? ముడివడిన భ్రుకుటితో అడుగుతున్న తల్లిని రాహుల్ భయం భయంగా చూస్తూ చెప్పాడు.

"ఆంటీ!"

"ఏ ఆంటీ? "

"మేడమీద ఆంటీ? "

"మాధవా? " సరిత ముఖం అప్రసన్నమయింది.

"ఎందుకు తీసుకున్నావు? "

"వద్దన్నాను. తీసుకో, ఫర్వాలేదు అన్నారు"

"ఎప్పుడిచ్చారు? "

"నిన్న"

"ఆవిడ ఇంటికి ఎందుకు వెళ్ళావ్? "

"నేను కావాలని వెళ్ళలేదు. వరండాలో ఆడుకుంటుంటే ఆంటీ పిలిచారు"

కూతురు ఆ పసివాడిని క్రాస్ ఎగ్జామినేషన్ చేస్తున్నట్టు అడుగుతున్న తీరుకి శాంతమ్మ విస్తుపోయింది.

"పోనీ చాక్లెట్ వద్దు అని ఆంటీకి ఇచ్చెయ్యనా? "

చేతిలో సగం తిన్న చాక్లెట్ పెదవుల చుట్టూ చాక్లెట్ పాకం అంటుకుని వాడు అలా అడుగుతుంటే మరో సారయితే వాడు ముద్దొచ్చేవాడే కాని వాడికి ఆ చాక్లెట్ ఇచ్చింది మాధవి అని తెలిశాక సరితకి చాలా కోపం వస్తోంది.

"సగం తిన్నాక ఇస్తావా? ఎంగిలి ఇవ్వవచ్చా? " తీవ్ర స్వరంతో అడుగుతుంటే

రాహుల్ బిత్తరపోయాడు. వాడి కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి. తన స్వరంలో ధ్వనిస్తున్న తీవ్రతకి తనకే ఆశ్చర్యం వేస్తోందామెకి. చప్పున వాడిని ఎత్తుకుంటూ లాలనగా అంది.

"అది కాదు నాన్నా! చాక్లెట్లు తింటే పళ్ళు పుచ్చుతాయి"

"నెలకొకటేగా తింటున్నాను. ఈ నెలలో ఇది రెండోది. పోన్లే వచ్చే నెలలో చాక్లెట్ కొనివ్వద్దులే"

"ఇంకెప్పుడూ ఆంటీ చాక్లెట్ ఇస్తే తీసుకోకు"

"సరే! యాపిల్ ఇస్తే తీసుకోనా? "

వాడలా అడిగితే నవ్వు వచ్చినా బిగపట్టింది.

"ఏమీ తీసుకోకూడదు"

సరే వాడు మిగతా చాక్లెట్ తినడంలో మునిగిపోయాడు.

సరిత వాడి పక్కనే కూర్చుని ఆలోచిస్తోంది. ఆఫీసులో తనని యక్ష ప్రశ్నలతో వేధించే మాధవి రాహుల్‌కి చాక్లెట్ లంచమిచ్చి ఏం అడిగి వుంటుంది?

**రాహుల్ బిత్తరపోయాడు. వాడి కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి. తన స్వరంలో ధ్వనిస్తున్న తీవ్రతకి తనకే ఆశ్చర్యం వేస్తోందామెకి. చప్పున వాడిని ఎత్తుకుంటూ లాలనగా అంది.**

"ఆంటీ నిన్నేం అడిగారు? "

"ఏ స్కూల్‌లో చదువుతున్నావని అడిగారు, చెప్పాను"

"ఇంకా..."

"ఇంకేమీ అడగలేదు"

"నిజంగా? "

"నిజం"

సరితకి రాహుల్ అబద్ధం చెప్పడని తెలుసు. కాని మాధవి వాడిని ఏమీ అడగకుండా వదలిపెట్టినందుకు మాత్రం సంతోషించింది.

అసహనంతో రగిలిపోతున్న కూతురిని శాంతమ్మ తర్వాత విడిగా అడిగింది.

"మాధవి రాహుల్‌కి చాక్లెట్ ఇస్తే ఎందుకంత రాద్ధాంతం చేసావ్? ఆ పిల్ల చిన్నపిల్లలని ఏమార్చి చాక్లెట్‌నిచ్చి ఎత్తుకుపోయే దొంగనుకున్నావా? "

"నీకు తెలియదులేమ్మా! ఆ అమ్మాయికి ఎదుటి వాళ్ల విషయాలలో విపరీతమైన ఆసక్తి. ఆఫీసులో నన్ను ఎన్ని రకాల ప్రశ్నలు? మీ వారేం చేస్తారు? ఎక్కడుంటారు అని? "

"ఇదెక్కడి చోద్యమే! అలా ఎవరైనా అడుగుతారు. దానికే ఇంత రాద్ధాంతమా? "

"అందరూ అడిగినట్టుండదు. ఏదో డిటెక్టివ్‌లా అడుగుతుంది. ఒళ్లు మండుతుంది. కర్మ కాకపోతే ఆవిడగారికి ఇల్లు దొరక్క దొరక్క మన నెత్తిమీదే దొరకాలా? " ఇంకా ఏదో అనబోతున్న సరితని కళ్లతోనే వారించింది శాంతమ్మ.

వెనుతిరిగి చూసిన సరిత "హాయ్" అని రాహుల్‌ని పలుకరిస్తూ వాడిని ముద్దు చేస్తున్న మాధవిని చూసి అప్రయత్నంగా లేచి నిలబడింది.

శాంతమ్మ ముఖాన నవ్వు పులుముకుని కాదు, మనస్ఫూర్తిగా నవ్వుతూ ఆమెని ఆహ్వానించింది.

"రామ్మా మాధవీ"

"ఏం చేస్తున్నారాంటీ"

"ఏం.. ఏమీలేదు. ఇవాళ ఆదివారం కదా! ఏమీ తోచక సరిత నేను ఇప్పుడే ఇలా వచ్చి కూర్చున్నాం"

"అయ్యో! మీ కబుర్లను డిస్టర్బ్ చేసానా? "

"భలేదానివే! ఆదేం లేదు. రా, కూర్చో"

కుర్చీ ఇవతలకి లాగుతూ అంది.

మాధవి కూర్చుంది.

"సరితా! నీ దగ్గర పుస్తకాలేవైనా వున్నా యేమో అడుగుదామని వచ్చాను. చాలా బోరుగా వుంది."

"ఏమీలేవు మేడమ్" ఆమె స్వరంలో తొక్కిపట్టిన అసహనం.

"వీక్లీలయినా లేవా? "

'నేను వీక్లీలు చదవను"

"మరి టీవీ చూస్తావా? "

"టీవీ చూసేంత తీరిక నాకు లేదు"

"మరెలా కాలక్షేపం? "

"ఆఫీస్ నుంచి ఇంటికొచ్చాక రాహుల్ చేత హోమ్ వర్క్ చేయిస్తాను. తరువాత ఇంట్లోపని. ఆదివారమయితే అసలు ఖాళీయే వుండదు. బట్టలు ఉతకడం, ఆరాక ఇస్త్రీ చెయ్యడం, ఇల్లు క్లీన్ చెయ్యడం, రాహుల్‌ని, అమ్మని కాస్సేపు బయటకి తీసుకెళ్లడం... కాలక్షేపం కాదు. కాలం ఎంత త్వరగా గడిచిపో తుందో నాకే తెలియదు"

"ఓ!" ఎందుకో గాని ఆ క్షణంలో తను ఒంటరిదాన్నన్నే భావనతో మాధవి ముఖం ఒక నిముషం కళ తప్పింది.

"ఏమీ తోచకపోతే మా ఇంటికొచ్చి కూర్చో అమ్మాయ్..." ఇంకా ఏదో అనబో తున్న శాంతమ్మ తీవ్రమైన కూతురి చూపు లలోని హెచ్చరికను గమనించి మౌనం వహించింది.

మాధవి ఇంకేం మాట్లాడాలో తోచనట్టు గదంతా కలియచూస్తోంది. ఎదుటి గోడకి వున్న ఫొటోలో సరిత రాహుల్‌ని ఎత్తు కుని నవ్వుతోంది.

ఈ ఫొటో మీ వారు అమెరికా వెళ్లాక తీయించుకున్నారా? "

"అవును. అలా అడుగుతున్నారేమిటి మేడమ్? "

"ఫొటోలో మీవారు లేరని..."

"ఆయనకి ఫొటో తీయంచుకోవడం ఇష్టం వుండదు"

"కనీసం మీ పెళ్లి ఫొటోలైనా లేవా? "

"వున్నాయి మేడమ్ తెస్తాను" సరిత పొంగిపొరలుతున్న ఆగ్రహానికి సంస్కార మనే ఆనకట్ట వేసి కుర్చీలోంచి లేచింది.

కూతురు వెళ్తున్న వైపే చూస్తున్న శాంతమ్మ ముఖంలోని ఆందోళన మాధ విని విభ్రమ పరిచింది; పదినిముషాల తరువాత గదిలో నుంచి సరిత పిలుపు వినిపించింది.

"అమ్మా! ఆల్బమ్స్ ఎక్కడపెట్టావు? "

"ఆఁ! వస్తున్నాను. ఒక్కక్షణం మాధవీ ఇప్పుడే వస్తాను" అని ఆవిడ గదిలోకి వెళ్లింది.

గదిలో నుంచి ఇద్దరి మాటలూ మాధ వికి స్పష్టంగా వినిపిస్తున్నాయి.

"మొన్న రాహుల్ వాళ్ల డాడీని చూస్తా నంటే, ఆల్బమ్ తీసి చూపించావుగా? అల మరలో పెట్టిన ఆల్బమ్ ఇంతలోనే ఏమ యింది? "

"ఈ మధ్య బీర్వాలవీ సర్దక ఎక్కడేము న్నాయో కనబడ్డం లేదు. అయినా ఈ రాహుల్ ఒకడు. ఒక పక్కనుంచి నేను సర్దుకుంటే మరోపక్క లాగిపడేస్తాడు" బీర్వా తెరిచిన శబ్దం. సామాన్లు సర్దు తున్న చప్పుడు.

మాధవికి సిగ్గేసింది. తను ఆల్బమ్ చూస్తానని అడగకుండా వుండవలసింది అనుకుంటూ 'ఆంటీ' అని బిగ్గరగా పిలి చింది. శాంతమ్మ బయటకివచ్చింది.

"ఏమ్మా, ఇదుగో ఆల్బమ్ కోసమే వెతు కుతోంది. కూర్చో ఫొటోలు చూసే వెళ్దువు గాని".

"నేను వచ్చి మీకు పెద్ద పని పెట్టాను. వద్దులెండి. మరెప్పుడైనా చూస్తాను"

సరిత లోపలినుంచి వచ్చింది.

"సారీ మేడమ్! ఆల్బమ్ కనబడలేదు"

# రచనావ్యాసంగం ప్రియం

మా స్వస్థలం తూర్పుగోదావరి జిల్లా పెద్దాపురం. అక్కడే మహారాణి కాలేజీలో బీఏ చదివాను. పాతికేళ్లుగా నవలలు, కథలు రాస్తున్నాను. 1981లో వెలువడిన 'ఆదర్శాలు' నా తొలి రచన. ఇప్పటికీ రచనా వ్యాసంగమే నాకత్యంత ప్రియం. 'సరిత' 'చతుర'లో నేను రాస్తున్న ఐదో నవల. పద్మాలయా పబ్లికేషన్స్, ఆంధ్రజ్యోతి వారపత్రిక 1986లో సంయుక్తంగా నిర్వహించిన పోటీల్లో నా నవల 'నీడలతో క్రీడలు' ప్రథమ బహుమతి పొందింది. ఇప్పటివరకూ 10 నవలల్ని ఎమెస్కో సంస్థ ప్రచురించింది. ఆంధ్రజ్యోతి దిన పత్రిక, ఆంధ్రజ్యోతి, ప్రియదత్త వారపత్రికలలో సీరియళ్లుగా నా నవలలు వచ్చాయి. నాలుగు నవలికలు ఆంధ్రభూమి మాసపత్రికలో ప్రచురితమయ్యాయి. అలాగే వివిధ పత్రికల్లో దాదాపు 45 వరకు కథలు అచ్చయ్యాయి. మరోసారి నా నవల్ని ప్రచురణకు స్వీకరించి, ప్రోత్సహిస్తున్న చతుర సంపాదకులకు నా కృతజ్ఞతలు.



**హోతా పద్మినీదేవి**
పోస్టుబాక్స్ నెం. 46,
రాజమండ్రి - 533101.
తూర్పుగోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్.
ఫోన్ నెం. 0833-2426071

"ఫర్వాలేదులే! నిన్ను ఇబ్బంది పెట్టాను. వస్తాను"

ఆమె వెళ్ళేదాకా నిగ్రహించుకున్న సరిత జేవురించిన ముఖంతో అంది.

"మాధవి అంటే నాకెందుకు కోపమో నీకిప్పుడు అర్థమయిందా..."

శాంతమ్మ ముఖం విషాదమయంగా వుంది. ఆవిడ జాలిగా, నిస్సహాయంగా కూతురి వైపు చూస్తోంది.

"మీ వారెక్కడ? ఆయన అమెరికాలో, మీరు ఇండియాలో వుండడమేమిటి? అని నన్ను డిటెక్టివ్‌లా ఆరాలు తీసింది చాలక ఇప్పుడాయన ఫొటో చూస్తానంటూ తయారయింది" కసిగా ఆవేశంగా వున్న సరిత స్వరంలో హఠాత్తుగా దుఃఖపు జీర ధ్వనించింది.

"ఇదే ప్రశ్న రాహుల్ అడిగితే ఏం చెబుతావ్?" తల్లి అడిగిన ప్రశ్నతో సరిత ముఖం పాలిపోయింది.

'అవును. రాహుల్ తండ్రి ఫొటో చూస్తానని అడిగితే ఏం చెప్పాలి? అయినా వాడి తండ్రి అమెరికాలో వున్నాడని వాడిని ఎన్నాళ్ళు మభ్యపెట్టగలదు?'

★ ★ ★

వకుళ లాయర్ శశిభూషణం ఎదురుగా కూర్చుంది. ఆమె ఏదో చెప్పాలనుకుని సందేహించడం గమనించి అన్నాడాయన.

"...చెప్పమ్మా!"

ఆమె మెల్లిగా అంది.

"నేను నా భర్తతో తిరిగి వైవాహిక జీవితాన్ని గడిపే వీలుందా?"

ఆయన ఆశ్చర్యంగా ఆమెవైపు చూసాడు. "అంటే? నువ్వు నీ భర్త దగ్గరకి తిరిగి వెళ్ళాలనుకుంటున్నావా?"

"అవునండి"

"అతనూ ఇష్టపడుతున్నాడా?"

"తెలియదు. కాని..."

ఆయన దీర్ఘంగా నిశ్వసించాడు. "తను కూడా ఇష్టపడితే సాధ్యమే. అయితే మీరిద్దరూ తిరిగి వివాహం చేసుకోవాలి. ఆ వివాహం చట్టబద్ధమైనదిగా గుర్తింపు

పొందాలి. అంటే రిజిస్టర్ మేరేజి చేసుకో వాలి"

వకుళ ముఖంలో సన్నని ఆశాకిరణం...

"దయవుంచి నేను మీ దగ్గరకి వచ్చి ఈ ప్రస్తావన తెచ్చిన విషయాన్ని రహస్యంగా వుంచండి అంకుల్. అమ్మకి కూడా తెలి యకూడదు"

"చెప్పనులేమ్మా!"

వకుళ సంతృప్తి నిండిన మనసుతో ఆయన దగ్గర సెలవు తీసుకుంది. తను భర్తతో కలిసి జీవించే వీలుంది. ఇంక అతని మనసులో తనపై ఎలాంటి అభి ప్రాయం వుందో తెలుసుకోవాలి. కాని ఎలా? తనంతట తను బయటపడితే అత నికి లోకువ. అలాగే వసంత్ పునర్వి వాహం చేసుకునే ప్రయత్నంలో వున్నాడా? లేక తనలాగే అతనూ తనతో కలిసి జీవించాలనే ఆలోచనలోనే వున్నాడా? ఎలా తెలుసుకోవడం? వకు ళలో ఆలోచనల సుడులు మొదల య్యాయి.



ఆనంద్ అమెరికా నుంచి తను తెచ్చిన కానుకలని అందరికీ ఇచ్చాడు. తల్లికి ఎల క్ట్రిక్ కుక్కర్, అక్క రాజ్యలక్ష్మికి చీర, పెర్ ఫ్యూమ్, బావగారికి వీడియో కెమేరా, అక్క కూతురు వసంతకి షిఫాన్ చీర, పగడాల దండ ఇచ్చాడు.

"చీర ఒక్కటీ చాలదా మామయ్యా? అనవసరంగా డబ్బు ఖర్చు పెట్టి ఇవన్నీ ఎందుకు?" అంది వసంత నొచ్చుకుంటూ.

అక్కడేవున్న రాజ్యలక్ష్మి కలగచేసు కుంది. "అదేమిటి? వాడు నీమీద అభి మానంతో తెస్తే అలా అంటావు? చీర కట్టుకుని వాడికి చూపించు"

"చీరకు ఫాల్ కుట్టి, మేచింగ్ బ్లవుజు కుట్టించుకున్నాక కట్టుకుంటాలే"

"నువ్వు చేసిన హల్వా మామయ్యకి పెట్టు"

"వసంత చేత అప్పుడే వంట చేయిస్తు న్నావా అక్కా" నవ్వుతూ అడిగాడు ఆనంద్.

"కొంచెం కొంచెంగా అలవాటు చేద్దా మని, పెళ్లయితే మొగుడికి వండిపె ట్టద్దూ?"

"నీ వాటం చూస్తుంటే వసంతని చదువు మానిపించి పెళ్లిచేసి సంసారం లోకి తోసేసాలా వున్నావు. ఇంత చిన్న పిల్లకి అప్పుడే పెళ్లేమిటి చదివించక?"

"బీఎస్సీ అయిందిగా? ఇంకేం చదువు? కావాలంటే పెళ్లయి అమెరికా వెళ్లాక చదు వుకుంటుందిలే"

"అమెరికా సంబంధమా? నిశ్చయమ యిందా?" ఆశ్చర్యంగా అడిగాడు.

"అయినట్టే. అబ్బాయి ఊఁ... అంటే ఇంక ముహూర్తాలు పెట్టించడమే తరు వాయి"

"ఎందుకనడూ? వసంతకేం లోటు? అందంగా వుంటుంది. పైగా మంచిపిల్ల"

రాజ్యలక్ష్మి తమ్ముడి నోటి వెంట కూతు రిని గురించిన ప్రశంస వినగానే పొంగిపో యింది.

వసంత కేరట్ హల్వా తెచ్చి ఆనంద్‌కి ఇచ్చింది. కొంచెం రుచిచూసి అడిగాడు.

"చాలా బాగుంది. నిజంగా నువ్వే చేసావా?"

వసంత తల్లివైపు చూసింది.

కథా నిలయం

"అదే చేసిందిరా"

అతను ఖాళీ కప్పు పక్కన పెట్టి ఫిర్యాదు చేస్తున్నట్టు అక్కతో అన్నాడు.

"వసంత చాలా మారిపోయింది. ఇదివరకు ఒక్కక్షణం నన్ను వదలకుండా కబుర్లు చెప్పేది. ఇప్పుడు మాటలు రాని మూగదానిలా వుంది"

"పెళ్లనేసరికి సిగ్గుపడుతోందిరా"

వసంత తల దించుకుని లోపలికి వెళ్లి పోయింది.

"ఇంతకీ వసంతకి నువ్వు చూస్తున్న సంబంధం వివరాలు నాకు చెప్పనేలేదు"

"అమ్మకి తెలుసు. ఆవిడని అడుగు" అంది రాజ్యలక్ష్మి.

★ ★ ★

ఆరాత్రి భోజనం దగ్గర తల్లిని అడిగాడు ఆనంద్. "వసంతకి ఏదో పెళ్లి సంబంధం నిశ్చయమయిందని చెబుతోంది అక్క. దానికి అప్పుడే పెళ్లేమిటమ్మా? "

వర్ధనమ్మ ముఖం గంభీరమయ్యింది.

"దానికి మతిపోయింది. కాదు... అమెరికా పిచ్చి పట్టింది. ఆ పిచ్చిలో అది ఏం మాట్లాడేదీ దానికి తెలియడం లేదు"

"అంటే? సంబంధం మంచిది కాదా? "

"అక్క వసంతని నీకిచ్చి పెళ్లి చెయ్యాలనుకుంటోంది"

"నాకా? " ఆనంద్ ఊపిరి పీల్చుకోవడం మరచిపోయాడు.

"అవును నీకే. దాని తాహతుకి వసంతకి అమెరికా సంబంధం తీసుకు రాలేదు. అందుబాటులో వున్న నీకిచ్చి పెళ్లి చెయ్యాలని, దాని కూతురు అమెరికాలో వుందని గొప్ప చెప్పుకోవాలని దురాశ. నీకైతే కట్నం ఇవ్వక్కర్లేదని, స్వంత తమ్ముడివి కాబట్టి వసంతని చేసుకోవడానికి అంగీకరిస్తావని నమ్మకం. అది నా దగ్గర ఈ ప్రస్తావన తెచ్చినప్పుడే చెప్పాను. నీకు వసంతకి వయసులో పదమూడేళ్లకి పైగా వ్యత్యాసం ఉందని, మీకు పెళ్లి చెయ్యడం బాగుండదని. వినదు. మీ బావకి కూతుర్ని పెద్ద చదువులు చదివించాలని ఆశ. ఇది ముందే అతని మాటని ఖాతరు చెయ్యదు. ఇంక పెళ్లి విషయంలో అసలు లెక్కచెయ్యడం లేదు"

ఆనంద్ నిర్ఘాంతపోయి వింటున్నాడు.

వసంత తనతో ఇదివరకటిలా ఎందుకు మాట్లాడటం లేదో అతనికి అర్థమయింది. అది సిగ్గో, తనని పెళ్లిచేసుకోవడానికి అయిష్టతో అర్థం కావడం లేదతనికి.

"వసంతపై నీకున్న ఇష్టాన్ని ప్రేమ అని అపోహ పడుతోంది అది. ఆ చిన్నపిల్ల మనస్సులో లేనిపోని ఆశలని కల్పిస్తోంది. నువ్వు 'ఊ' అంటే పెళ్లికి ముహూర్తం పెట్టించడానికి సిద్ధంగా వుంది."

"వసంతపై నీకున్న ఇష్టాన్ని ప్రేమ అని అపోహ పడుతోంది అది. ఆ చిన్నపిల్ల మనస్సులో లేనిపోని ఆశలని కల్పిస్తోంది. నువ్వు 'ఊ' అంటే పెళ్లికి ముహూర్తం పెట్టించడానికి సిద్ధంగా వుంది."

"వసంతని నేను... ఛ... ఆ ఊహే అసహ్యంగా వుంది నాకు. చిన్నప్పుడు దాన్ని ఎత్తుకుని ఆడించాను. వరసకి మేనకోడలైనా దాన్ని నా చెల్లెలిగానే భావించాను"

"ఆ విషయం నేను చెప్పినా ఆ మూర్ఖురాలికి అర్థమవడం లేదు. వసంతని చేసుకోమని నిన్ను అడుగుతానంది. తప్పకుండా అడుగు. వాడు ఒప్పుకుంటే అభ్యంతర పెట్టడానికి నేనెవర్ని? అన్నాను."

ఆనంద్‌కి అక్క మనస్తత్వం బాగా తెలుసు. తాను పట్టిన కుందేలుకి మూడే


కథా నిలయం
శ్రీకాకుళం

కాళ్ళు అంటుంది.

"అసలు నాకు పెళ్లి చేసుకోవాలని లేదమ్మా! శిల్పని మరచిపోవడం నాకీ జన్మలో సాధ్యపడదు. ఒకవేళ నేను మళ్ళీ పెళ్ళికి సిద్ధపడాలంటే ఆమె శిల్పని మరిపించగల, నన్ను సేదతీర్చగలిగే చల్లని తీరం అయివుండాలి. అసలు వసంతపై నాకు అలాంటి అభిప్రాయం లేదు"

"ఆ మాటే దానితో ఖచ్చితంగా చెప్పు. ఈ విషయంలో నువ్వే మాత్రం మొహమాటపడినా వసంతని చేసుకునేదాకా మీ అక్క వదలదు" అంది వర్ధనమ్మ.

అక్క వింత మనస్తత్వానికి ఆశ్చర్యం వేసింది ఆనంద్‌కి.

★ ★ ★

వకుళ వీధి చివరనున్న ఎస్.టి.డి. బూత్‌లోకి నడిచింది. తను చెయ్యబోతున్న పని మంచిదా కాదా దానివలన కలిగే పరిణామాలేమిటని ఆమె ఆలోచించ

డంలేదు. వసంత్ పునర్వివాహ ఆలోచనలో వున్నాడో లేదో తెలుసుకోవాలి.

నంబర్ డయల్ చేసి అవతలి వ్యక్తి "హలో" అనగానే మౌత్ పీస్‌కి రుమాలు అడ్డం పెట్టింది.

"హలో! వసంత్‌గారా? "

"అవును. ఎవరు మాట్లాడేది? "

"నా పేరు విశ్వనాథం. మా అమ్మాయి పెళ్లి విషయం మీతో మాట్లాడాలని ఫోన్ చేసాను"

"మీ అమ్మాయి పెళ్లి విషయం నాతో మాట్లాడమేమిటి? "

"మీరు మీ భార్య నుంచి విడాకులు తీసుకున్నారని విన్నాను. నాకు నలుగురమ్మాయిలు. నేను పెద్దగా కట్నకానుకలు ఇచ్చుకోలేను. నా రెండో కూతురు కామాక్షిని మీకిచ్చి పెళ్లి చెయ్యాలని..."

"క్షమించండి. మీకెవరో రాంగ్ ఇన్‌ఫర్మేషన్ ఇచ్చారు. నాకు మళ్ళీ పెళ్లి చేసుకునే ఉద్దేశం లేదు"

వకుళ మనసు ఆనందాతిరేకంతో మూగబోయింది. ఆమెకి ఒక క్షణం మాట్లాడుతున్నది తనేనని అతనికి చెప్పాలనిపించింది. కాని అలా చెప్పడానికి ఏదో అడ్డు వచ్చింది.

"సరేలెండి" అని ఫోన్ పెట్టేసింది.

వసంత్ ఫోన్ పెట్టేశాక అతని తల్లి శాంభవి అడిగింది,

"ఎవర్రా ఫోన్ చేసింది? "

"ఎవరో పెళ్లి సంబంధం వాళ్ళు. నాకు వాళ్ళమ్మాయిని ఇస్తారుట"

"నువ్వేమన్నావ్? " రామ్‌నారాయణ కొడుకువైపు ఆతృతగా చూస్తూ అడిగేడు.

"పెళ్లి చేసుకునే ఉద్దేశం లేదన్నాను"

"పెళ్ళి చేసుకోవా? ఒంటరిగా బతుకుతావా"?

"అవును"

"ఎన్నాళ్ళు"

"జీవితాంతం"

రామ్‌నారాయణ కొడుకువైపు బాధగా చూశాడు.

"వకుళ జీవితాంతం మరచిపోలేని మధురానుభూతులని మిగిల్చి నీకు దూరమైతే ఆమె స్థానాన్ని నువ్వు మరొకరికి ఇవ్వలేకపోవచ్చు. కాని తను నిన్ను కోర్టుకి లాగి నీకు చేదు జ్ఞాపకాలని మిగిల్చింది"

"అసలు మన వంశంలో అటు ఏడు తరాలు, ఇటు ఏడు తరాలు చూసినా విడాకులు వున్నాయిట్రా? మగవాడివి నువ్వు మాట తూలావనుకో. ఆడది అది కూడా రెచ్చిపోతుందా? తెగేవరకు లాగి తెంపింది. కోర్టుకెక్కి నాకు విడాకులు కావాలని బరితెగించి చెప్పిన ఆ పొగరుమోతుని నీ మనసులో నుంచి తుడిచెయ్యలేక మళ్ళీ పెళ్లి చేసుకోనంటున్నావా? " శాంభవి అసహనంగా అంది.

"అమ్మా! నాకు పెళ్ళంటేనే భయం వేస్తోంది. మరోసారి ఆ మాటెత్తకు" వసంత్ వీధిలోకి వెళ్లిపోయాడు.

శాంభవి, రామ్‌నారాయణ ముఖముఖాలు చూసుకున్నారు.

"అంతా వాడి కర్మ! నా అన్న కూతుర్ని చేసుకోమంటే మేనరికం చేసుకుంటే వైకల్యంతో వున్న పిల్లలు పుడతారని అదని, ఇదని వంకలు పెట్టి ఆ ముదనష్టపు సంబంధాన్ని చేశారు. అది మన సంసారాన్ని వీధికీడ్చి మనశ్శాంతి లేకుండా చేసింది. ముప్ఫయి రెండేళ్ళకే వాడి జీవితమిలా అయిపోయింది" ఆవిడ ఏడుస్తోంది.

రామ్‌నారాయణ అసహాయంగా చూస్తున్నాడు. కొడుక్కి కోడలికి మధ్య నిజంగా ఏం జరిగిందో, వాళ్ళ మధ్య పొరపొచ్చాలు ఎందుకొచ్చాయో ఆయనకే కాదు ఎవరికీ తెలియదు. అయినా కన్న తల్లిదండ్రులుగా వాళ్ళు వసంత్‌నే సమర్థించారు. వాళ్ళ

దృష్టిలో వకుళ అహంకారి! ఆమెపట్ల వైమనస్య భావంతో ఉన్న ఆ ఇద్దరికీ ఇప్పుడు 'విశ్వనాథం' అనే వ్యక్తి కొడుక్కి పిల్లనిస్తానని ఫోన్ చెయ్యడంతో కొత్త ఆలోచన మొదలయింది.

వసంత్‌ని పెళ్ళికి ఒప్పించడం ఎలా?

వసంత్‌తో మాట్లాడి ఫోన్ పెట్టేసిన వకుళ అదే సమయంలో అక్కడ ఆనందాతిరేకంతో డాన్స్ చేసినంత పని చేసింది.

పునర్వివాహం పట్ల విముఖంగా వున్నట్లు తనే స్వయంగా చెప్పాడు. ఇంక అతను తనతో తిరిగి జీవితాన్ని పంచుకోవాలనుకుంటున్నాడో లేదో తెలుసుకోవాలి. ఎలా? ఏపని చేస్తున్నా, ఆఖరికి టీవీ చూస్తున్నా అదే ఆలోచన.

టీవీలో తను రోజూ చూసే సీరియల్‌లోనూ విడాకుల కోసం కోర్టుకెక్కాక హఠాత్తుగా కనువిప్పు కలిగి భర్తతో కలిసి వుండాలని నిశ్చయించుకుని అతనికి చేరువ కావడానికి ప్రయత్నాలు చేస్తుంటుంది. ఆ సీరియల్‌లో ఆరోజు ప్రసారమయిన ఎపిసోడ్‌ని చూస్తున్న వకుళ మనసులో ఒక్కసారి వసంత్‌ని కలవాలనే ఆలోచన కలిగింది. అది క్షణాలలో నిశ్చయంగా బలపడింది. ఆ అవకాశం ఆమెకి పదిరోజుల తర్వాత లభించింది.

**ఆ సీరియల్‌లో ఆరోజు ప్రసారమయిన ఎపిసోడ్‌ని చూస్తున్న వకుళ మనసులో ఒక్కసారి వసంత్‌ని కలవాలనే ఆలోచన కలిగింది. అది క్షణాలలో నిశ్చయంగా బలపడింది. ఆ అవకాశం ఆమెకి పదిరోజుల తర్వాత లభించింది.**

★ ★ ★

నేను స్కూలుకి వెళ్ళను. ఆటో దిగుతూనే ఏడుస్తూ లోపలకి వచ్చిన రాహుల్ స్కూల్ బ్యాగ్‌ని విసిరేసాడు.

"ఏమయిందమ్మా?"

"ముందిది చెప్పు. డాడీ అమెరికా నుంచి ఎప్పుడొస్తారు?

"నువ్వు బాగా చదువుకుని పెద్ద ఉద్యోగం చేసాక వస్తారు"

"నా ఫ్రెండు పింకీ వాళ్ళ డాడీ నిన్ననే అమెరికా నుంచి వచ్చారు! దానికి బోలెడన్ని డ్రెస్‌లు, బొమ్మలు తెచ్చారు. డేడీ నాకు బొమ్మలు, డ్రెస్‌లు పంపుతారు తప్ప ఒక్కసారైనా రారెందుకని?"

సరిత గొంతులో ఏదో అడ్డుపడ్డట్టయింది.

"వస్తారమ్మా"

"ఎప్పుడు?"

"నువ్వు బాగా చదువుకుని..." ఇందాకటి జవాబునే రిపీట్ చెయ్యబోయింది.

ఎప్పుడు అడిగినా తల్లి అదే జవాబుని చెప్పడంతో వాడి ఉక్రోషం రెట్టింపయింది.

"ఎప్పుడూ ఇలాగే చెబుతావు. డాడీ నాకు ఇప్పుడే కావాలి"

"ఇప్పుడంటే ఇప్పుడే ఎలా వస్తారు. అమెరికా ఇక్కడకి చాలా దూరం. ప్లేన్ టికెట్టు బుక్ చేసుకుని రావాలి"

"డాడీకి ఫోన్ చెయ్యి. మాట్లాడతాను"

"డాడీ ఇప్పుడు ఇంట్లో వుండరు"

"సెల్‌కి చెయ్యి"

ఆ పసివాడు తండ్రిని చూడాలని, కనీసం అతనితో మాట్లాడాలని ఎంతగా తపించి పోతున్నాడో అర్థమై సరిత మనసుని దుఃఖం మెలితిప్పుతోంది.

"చెప్పమ్మా! డాడీ సెల్ నెంబర్" రాహుల్ ఫోన్ దగ్గరకి నడిచాడు.

సరిత వాడివైపు అసహాయమైన క్రోధంతో చూస్తూ అరిచింది.

"డాడీ ఆఫీసు వర్క్‌తో బిజీగా

వుంటారు. డిస్టర్బ్ చెయ్యకూడదు"

గతంలో ఎప్పుడూ చూడని తల్లి కోపాన్ని చూసిన వాడు బిక్కచచ్చిపోయి అలాగే నిలబడిపోయాడు.

అదురుతున్న వాడి లేత పెదవులు, వాడి ముఖంలోని భయం చూసిన సరిత మనసు ద్రవించిపోయింది. పొంగిపొరలి వస్తున్న దుఃఖాన్ని నిగ్రహించుకోలేక గది లోకి వెళ్ళి తలుపు మూసేసుకుంది.

కూతురికి, మనవడికి జరుగుతున్న సంభాషణని వింటున్న శాంతమ్మ మనసు ఆర్ద్రమై కళ్ళలో నీళ్ళూరాయి.

"రాహుల్! ఇలారా నాన్నా! నీకో మంచి కథ చెబుతాను" మరిపించడానికి పిలిచింది.

కథ అనగానే ఎప్పుడూ ఉత్సాహంగా వచ్చేవాడు నిరాసక్తంగానే ఆవిడ దగ్గరకి వెళ్ళాడు. ఆవిడ వాడిని ఎత్తుకుని ఒడిలో కూర్చోబెట్టుకుంది. " అనగా అనగా... ఒక రాజు. రాజుగారికి ఒక కొడుకు"

"కొడుకు పేరేంటి? " మధ్యలోనే అడిగాడు.

"రాహుల్!". అని ఆవిడ చెప్పగానే వాడు నవ్వాడు. ఆవిడ ఎప్పుడు కథ చెప్పినా వాడలా అడగడం ఆవిడ రాహుల్ అని చెప్పడం. వాడు తనని ఆ రాజకుమారుడితో ఐడెంటిఫై చేసుకుని, రాక్షసుడిని కత్తియుద్ధంతో చంపి రాజకుమార్తెని తనే రక్షించినంత ఫీలింగ్ వాడి ముఖంలో కనబడేది.

"రాజు పేరేమిటి? "

"నరేంద్ర వర్మ"

"మరి మా డేడీ పేరేంటి? "

వాడలా అడుగుతాడని ఊహించని ఆవిడ క్షణకాలం ఏం సమాధానం చెప్పాలో తెలియక బిత్తరపోయింది.

"చెప్పమ్మమ్మా! డేడీ పేరేంటి? "

ఆ సమయంలో టి.వి.లో 'ఆనంద్' సినిమా వస్తోంది.

"అదుగో 'ఆనంద్' సినిమా వస్తోంది చూడు"

"డాడీ పేరు చెప్పవా? ప్లీజ్" వాడు ఆవిడ చుబుకం పట్టి తనవైపు తిప్పుకున్నాడు.

ఆవిడ క్షణకాలం బాధగా కళ్ళు మూసుకుంది. తర్వాత వాడివైపు చూస్తూ 'ఆనంద్...' అంది.

వాడు ఇంకేమీ అడగకుండా "సినిమా చూడు" అని వంటగదిలోకి వెళ్ళింది. రాహుల్ ఆవిడ వెనుకే వెళ్ళాడు.

"అమ్మమ్మా! నువ్వు చెప్పు. డాడీ అమెరికా నుంచి ఎప్పుడొస్తారు? "

"వస్తారు నాన్నా! అన్నం తిందువు గాని పద" అని ప్లేటులో అన్నం కూర వడ్డించి టీవీలో ఛానల్ మార్చింది. వాడు కార్టూన్ ఫిల్మ్ చూస్తుండగా అన్నం తినిపించి పడుకోబెట్టింది. తర్వాత కూతురున్న గది తలుపు తట్టింది.

తలుపు తీసిన సరిత కళ్ళు ఎర్రగా ఉబ్బి ఉన్నాయి. ఆవిడ భారంగా నిట్టూర్చి అంది.

"భోజనానికి రామ్మా, ఇప్పటికే ఆలస్యమయింది"

"నాకు తినాలని లేదమ్మా!" సరిత స్వరంలో దుఃఖపు జీర.

"అన్నం మానేస్తే సమస్యలకి పరిష్కారం దొరుకుతుందంటే నేను రోజుల తరబడి ఉపవాసం ఉంటాను"

"నా మనసు బాగా లేదు"

"రాహుల్ అలా అడిగాడనేగా? పసివాడు... వాడికేం తెలుసు. వాళ్ళ నాన్న అమెరికాలో ఉన్నాడని చెప్పినదానివి నువ్వు. వాడి మనసులో లేనిపోని ఆశలని కల్పించిన దానివి నువ్వు!"

"నిజమే! పొరపాటు చేశాను. వాళ్ళ నాన్న చచ్చిపోయాడని చెప్పి ఉండవల

సింది" సరిత కళ్లలో మళ్లీ నీళ్ళూరాయి.

"నువ్విప్పుడు ఏం చెప్పినా వాడికి అర్థం కాదు. అర్థం చేసుకునే వయస్సు వచ్చాక చెప్పు. వాడిని సమాజంలో తలెత్తుకుని తిరిగేలా ఉన్నతమైన వ్యక్తిత్వం గల మనిషిగా పెంచి పెద్ద చెయ్యి"

సరిత కళ్ళు తుడుచుకుంది. "అందుకు అవసరమైన మనోబలాన్ని నాకివ్వు భగవంతుడా!" అని మూగగా ప్రార్థించింది.




రాజ్యలక్ష్మి ఆ ఉదయం కూతురితో కలిసి పుట్టింటికి వచ్చింది.

"అమ్మా! మా మామగారికి ఒంట్లో బాగా లేదని ఫోన్ చేశారు. నేను, మీ అల్లుడు అమలాపురం వెళ్తున్నాం. మేము తిరిగి వచ్చేదాకా వసంతని నీ దగ్గర ఉంచుకో"

"అలాగేనమ్మా! అయినా మీరిద్దరే వెళ్తే ఏం బాగుంటుంది? ఆనంద్‌ని కూడా మీతో తీసుకెళ్లండి. డెబ్బై ఏళ్ళు నిండిన ఆయన ఎప్పుడెలా ఉంటారో? " అంది వర్ధనమ్మ.

"ఎందుకూ? అక్కర్లేదు. అసలు మేము వెళ్ళడమే అనవసరం. అందరూ ఏడ్చిపోతారని కాని, నాకసలు వెళ్ళాలని లేదు. అంతగా ఆయన పరిస్థితి విషమిస్తే అప్పుడే నువ్వు, ఆనంద్ వద్దురు గాని" అని వసంత వైపు తిరిగింది.

"నేను చెప్పింది గుర్తుందిగా? జాగ్రత్త!" అని హడావుడిగా వెళ్లిపోయింది.

తల్లి వెళ్తున్న వైపే చూస్తున్న మనుమరాలి కళ్లలోని నీటిని గమనించి "వెర్రి పిల్లా! అప్పుడే మీ అమ్మ కోసం బెంగ పెట్టుకున్నావా? నేను లేనూ? " అని ఆప్యాయంగా ఆమెని అక్కున చేర్చుకుంది వర్ధనమ్మ.

"అది కాదమ్మమ్మా!" వసంత ఏదో చెప్పబోయి అప్పుడే గదిలో నుంచి బయటికి వచ్చిన ఆనంద్‌ని చూసి ఆగిపోయింది.

అక్కకి వసంతని తనకిచ్చి పెళ్లి చెయ్యాలనే ఉద్దేశం ఉందని తెలిశాక, ఆమెకి ఎదురుగా నిలబడాలంటేనే అదోలా ఉంద తనికి. తనకా ఉద్దేశం లేదని తెలియచేస్తే మంచిదనిపించింది.

"ఏమిటి వసంతా! ఇంత పొద్దుటే ఒక్కదానివీ వచ్చావ్. మీ అమ్మేది? " చిరునవ్వుతో అడిగాడు.

"వాళ్ల మామగారికి ఒంట్లో బాగా లేదని మీ అక్క, బావ అమలాపురం వెళ్లారు" అంది ఆవిడ.

సరిగా అప్పుడే ఫోన్ మోగింది. ఆనంద్ వెంటనే రిసీవ్ చేసుకున్నాడు.

అవతల శివరామయ్యగారు!

రాజ్యలక్ష్మి మామగారు!

"నమస్కారమండీ! నేను ఆనంద్‌ని మాట్లాడుతున్నాను, ఎలా ఉన్నారు? మీ ఆరోగ్యమెలా ఉంది? "

"బేషుగ్గా ఉంది. నువ్వు అమెరికా నుంచి ఎప్పుడొచ్చావ్ నాయనా? "

"వారం అయిందండీ"

"మా అబ్బాయి, కోడలు క్షేమమేనా? "

"బాగున్నారండీ!"

"వాళ్ళింటికి ఫోన్‌చేస్తే ఎవరూ ఎత్తడం లేదు. ఎక్కడికైనా వెళ్ళారా? "

"వాళ్ళు మీ దగ్గరకే బయలుదేరారండీ!" మీకు ఒంట్లో బాగా లేదని, మిమ్మల్ని చూడాలని వచ్చారని చెప్పాలనుకుని ఆగి

కొత్తగాలి...

**మా సినిమా నిండా**
**సంస్కృతే వుందండి**
**పైట కొంగులంటారా**
**పట్టించుకోకండి.**
**-కన్నోజు లక్ష్మీకాంతం**

పోయాడు. నిక్షేపంలా వున్న మామగారికి అనారోగ్యం అని అక్క ఎందుకు చెప్పిందో అతనికి అంతుపట్టలేదు.

"సరే! వుంటాను" అని ఆయన ఫోన్ పెట్టేసాడు.

తర్వాత తనని తప్పించుకుని తిరుగుతున్న వసంతని మాట్లాడించడానికి అనేక ప్రయత్నాలు చేసి చివరకి సఫలీకృతుడయ్యాడు ఆనంద్.

"నిన్ను చిన్నప్పుడు ఎత్తుకుని ఆడించేవాడిని. నా దగ్గర మొహమాటమెందుకమ్మా? " అన్నాడు ఆప్యాయంగా చూస్తూ.

'అమ్మా!' అనే అతని పిలుపులోని ఆత్మీయత ఆమె మనసుని చల్లగా స్పృశించింది. సంకోచపు తెరలని తొలగించుకున్న మనసు బాల్యంలోకి రెక్కలొచ్చిన విహంగంలా ఎగిరింది.

"మామయ్యా! నీకు గుర్తుందా. మనమిద్దరం గాలి పటాలను ఎగరేస్తుంటే నాది ఎదురింటివాళ్ళ మామిడి చెట్టుకి చిక్కుకుపోయింది. తాతయ్య నువ్వు చెట్టెక్కినందుకు కోప్పడ్డాడని తొందరగా చెట్టు దిగబోయి పడిపోయి తలకి దెబ్బ తగిలించుకున్నావు"

"అవును. ఇప్పుడు మా నాన్న లేడుకాని, ఆరోజు ఆయన కోపం నాకింకా గుర్తుంది. నామీదున్న ప్రేమవల్ల ఆయన ఆగాడు కాని, లేకపోతే ఆయన చేతిలోని కర్ర ఆరోజు నా ఒంటిమీద ముక్కలయ్యేదే!" క్షణం ఆగి అన్నాడు. "నిన్ను మీ అమ్మ నా దగ్గర వదిలేసి బజారుకో, సినిమాకో వెళ్తే నీకు సీసాతో పాలు పట్టించేవాణ్ణి. నువ్వు గుక్కపట్టి ఏడిస్తే జోకొట్టి నిన్ను నిద్ర పుచ్చేవాడిని."

అక్క వసంత మనసులో నాటిన ప్రేమ విత్తనం మొలకెత్తకుండా రూపు మాపాలని కావాలనే, నిన్ను ఎత్తుకుని పెంచిన నేను ఎలా పెళ్ళి చేసుకోను అనే భావం వచ్చేలా మాట్లాడాడు.

"నాకు ఏడేళ్ళు వచ్చాక కూడా నువ్వు నన్ను ఎత్తుకోడం నాకు గుర్తుంది. కాని మా అమ్మకి గుర్తులేదు" ఆ స్వరంలోని శ్లేష ఆనంద్‌కి అర్థమయింది.

ఆ రాత్రి ఒంటిగంట ప్రాంతంలో దాహమనిపించి నిద్ర లేచింది వర్ధనమ్మ. పక్క మంచంమీద వసంత లేదు. బాత్‌రూమ్‌కు వెళ్ళిందేమో అనుకుంది. పది నిముషాలయినా రాకపోవడంతో ఆమెకేదో అనుమానం వచ్చి హాలులోకి వెళ్ళింది. మాటలు విన్పించడంతో ఠక్కున ఆగిపోయింది.

"వూరుకో వసంతా! ఇప్పుడేం జరిగిందని"

"ఈ సమస్యని నువ్వే పరిష్కరించాలి మామయ్యా!" వసంత ఏడుస్తోంది.

వర్ధనమ్మ కనుబొమ్మలు ముడిపడ్డాయి. ఏమిటా సమస్య? వసంత అంత రాత్రివేళ ఆనంద్ గదికెళ్ళి ఏం మాట్లాడుతోంది?

మామయ్యతో ఏం మాట్లాడుతున్నావని వసంతని అప్పటికప్పుడే అడగాలనిపించినా తమాయించుకుంది. తల్లికీ తండ్రికీ కూడా వసంత 'ఆ సమస్య'ని చెప్పివుండదు. తనడిగినా బహుశా చెప్పదు. అన్నీ అవే బయటికొస్తాయిలే' అనుకుందావిడ గదిలోకెళ్ళి పడుకుంటూ. రెండు నిముషాల తర్వాత వసంత కళ్ళు తుడుచుకుంటూ వచ్చి తన పక్కన మంచంమీద

పడుకోడం నిద్ర నటిస్తున్న ఆవిడ గమని స్తూనే ఉంది.

★ ★ ★

ఐ.సి.యు ముందు విషణ్ణ వదనంతో నిలబడి వున్నాడు వసంత్. శాంభవి ఏడు స్తోంది. లోపలనుంచి డాక్టర్ రాగానే ఆత్రుతగా అడిగాడు.

"డాక్టర్! మా నాన్నగారు"

"సెరిబ్రల్ హెమరేజ్! మెదడులో రక్త నాళాలు చిట్లడం వలన కోమాలోకి వెళ్ళి పోయారు. వైద్యపరిభాషలో చెప్పాలంటే హి ఈజ్ క్లినికల్లీ డెడ్! ఆ కోమాలో ఆయన ఎన్ని రోజులుంటారో కూడా చెప్ప లేను. నా అంచనా ప్రకారం నాలుగైదు రోజులు. అంతే!" చెప్పి డాక్టర్ వెళ్ళిపో యాడు.

గొల్లుమంది శాంభవి. తల్లిని అనున యిస్తూ బయటికి తీసుకెళ్ళిపోయాడు వసంత్.

ఇద్దరూ హాస్పిటల్ గేటు అవతల వున్న చెట్టు కింద నిలబడ్డారు. కుమిలిపోతున్న తల్లినెలా ఓదార్చాలో అర్థం కాలేదతనికి.

అప్పుడే ఆటో దిగిన వకుళ ఆ ఇద్దరినీ చూస్తూ ఒక్కక్షణం అలాగే నిలబడింది. రామ్‌నారాయణగారికి పక్షవాతం వచ్చిం దని, హాస్పిటల్‌లో అడ్మిట్ చేసారని ఆమెకి ఆ ఉదయమే తెలిసింది. వసంత్ హాస్పిటల్‌లో తండ్రి దగ్గర వుంటాడని తెలుసు. అతన్ని కలుసుకోవాలి. ఏం మాట్లాడాలో ముందే రిహార్సల్ చేసు కుంది. అయినా ఏదో సంకోచం.

"డబ్బులివ్వండమ్మా!" ఆటో అతను విసుగ్గా అనడంతో తేరుకుని డబ్బుని చ్చింది. అల్లంత దూరంలో వసంత్‌ని చూడగానే ఆమె శరీరం ఉద్విగ్నతతో కంపించింది. శరీరంలోని రక్తమంతా వడి వడిగా ప్రవహించసాగింది. హిప్నటైజ్ చెయ్యబడిన మనిషిలా తానేం చేస్తోందో తనకే తెలియని స్థితిలో వసంత్‌ని సమీ పించింది.

"ఏమిటిక్కడ వున్నారు అరె.. అత్తయ్య గారు ఏడుస్తున్నారెందుకని?" అతి మామూలుగా రోజూ కలుసుకునే మను షులని, ఆప్తులని, సన్నిహితులని పలకరిం చినట్టే పలకరించింది.

వసంత్ షాక్ తిన్నట్లు ఏం జవాబి వ్వాలో తెలియక అలా చూస్తుండిపో యాడు. శాంభవి ఏడవడం మరచిపో యింది. ఆవిడ ముఖంలో రంగులు మారుతున్నాయి.

"ఏం జరిగింది వసంత్? మీరెందుకలా వున్నారు? అత్తయ్యగారెందుకలా వున్నా రు?" ఆతృతగా అడిగింది.

"నా.. నాన్నగారికి ఒంట్లో బాగాలేదు" తడబడుతూ అన్నాడు.

"మామయ్యగారికా? అరె! ఏమిటి సుస్తీ?" అవసరమైన దానికంటే ఎక్కువ ఆందోళనని ముఖంలో ప్రతిఫలింప చేస్తూ అంది.

"పెరాలసిస్" క్లుప్తంగా అన్నాడతను. వకుళ ఒక క్షణం ఏమీ మాట్లాడలేదు. మామగారికి పెరాలసిస్ వచ్చింది. ఆయన హాస్పిటల్‌లో వున్నారు. ఇదే మంచి అవ కాశం. తను ఆయనకు సేవ చెయ్యాలి. మంచితనంతో వాళ్ళ మనసులలో స్థానం సంపాదించుకోవాలి. ఆ ఆలోచన రాగానే ఆమె ముఖంలో మరింత బాధని కనబ రుస్తూ అంది.

"ఎంతో ఆరోగ్యంగా వుండే మామయ్య గారికి పెరాలసిస్ రావడమేమిటి? అయినా ఈ రోజుల్లో మంచి వైద్యం, మందులు అందుబాటులో వున్నాయి. ఆయనకి తప్పక బాగవుతుంది. బాధపడ కండి"

ఆ ఓదార్పు వచనాలతో ఘనీభవించి వున్న వసంత్ మనసు మెల్లగా మెత్తబడ

సాగింది. కష్టాలలో వున్న మనిషి ఎదుటి వ్యక్తి ఓదార్పుని ఆశిస్తాడు. ఆ ఓదార్పు తన కష్టాలని తీరుస్తుందని కాదు. అదొక తృప్తి అంతే.

"మీకు అభ్యంతరం లేకపోతే మామయ్యగారి దగ్గర నేనుంటాను. అత్తయ్యగారిని ఇంటికి వెళ్ళి కాస్సేపు విశ్రాంతి తీసుకోమనండి. పాపం! మనిషి బాగా డీలా పడిపోయారు" ఆపేక్షని ఒలకబోస్తూ అంది. శాంభవి మౌనంగా ఉన్నా మనసులో ఆగ్రహం పెల్లుబుకుతోంది.

వసంత్‌కి పరిస్థితి ఇబ్బందిగావుంది. "ఒక్కసారి ఇలా రా" అన్నాడు కొంచెం పక్కకి నడుస్తూ.

వకుళ అతన్ని అనుసరించింది.

"మా నాన్నగారికి నువ్వే కాదు ఎవరం ఏమీ చెయ్యలేము" అంటూ తండ్రిని గురించి డాక్టర్ చెప్పింది చెప్పాడు. వకుళ నోట మాట రానట్టు చూస్తోంది.

ఆమె తన మాజీ భార్య అని కాకపోయినా తండ్రిని చూడ్డానికి వచ్చిన ఒక విజిటర్‌గా ఐ.సి.యు దగ్గరకి తీసుకెళ్ళడంలో తప్పులేదు అనుకుంటూ ముందుకి దారి తీశాడతను. వకుళ అనుసరించింది.

బాధని, దుఃఖాన్ని అరువు తెచ్చుకోవడానికి ఆమె ఎక్కువ కష్టపడలేదు. హఠాత్తుగా అతన్ని సమీపించి అతని భుజంపై తలానించి వెక్కివెక్కి ఏడవసాగింది. ఊహించని ఈ పరిణామానికి అతను నిశ్చేష్టుడయ్యాడు. అప్రయత్నంగా తల్లివైపు చూసిన అతను అగ్నిగోళాల్లాంటి ఆవిడ కళ్ళలోని హెచ్చరికను గమనించి ఆమెకి దూరంగా జరిగాడు.

"నువ్వు చూడాలనుకుంటే మా నాన్నగారిని చూసిరా!" అన్నాడామెని అక్కడ నుంచి పంపించే ఉద్దేశంతో.

"ఎక్కడున్నారు?" వకుళ స్వరంలో దుఃఖచ్ఛాయలింకా పోలేదు.

"మీరు కూడా నాతో రాగలరా?"

వసంత్ క్షణం తటపటాయించాడు. తర్వాత తనకి తనే సమాధానం చెప్పుకున్నాడు.

ఆమె తన మాజీ భార్య అని కాకపోయినా తండ్రిని చూడ్డానికి వచ్చిన ఒక విజిటర్‌గా ఐ.సి.యు దగ్గరకి తీసుకెళ్ళడంలో తప్పులేదు అనుకుంటూ ముందుకి దారి తీశాడతను.

వకుళ అనుసరించింది. జంటగా నడుస్తున్న ఆ ఇద్దరినీ చూస్తున్న శాంభవి ముఖంలో ఏహ్యత, క్రోధం లాంటి భావాలెన్నో కదలాడసాగాయి.

ఐ.సి.యులో బెడ్ మీద స్పృహలో లేని మామగారిని చూసి బావురుమంది వకుళ. వసంత్ కళ్ళలో కూడా నీళ్ళూరాయి.

మామయ్యగారిని ఇలా చూడవలసి వస్తుందనుకోలేదు అంది గాద్గదికంగా.

"ఆయనింకా బ్రతికే వున్నారమ్మా! ఏడవకు" అంది శాంభవి. అంత దుఃఖంలోనూ ఆమె స్వరంలో పదును ధ్వనించింది. వకుళ వెనుదిరిగి ఆవిడ ముఖంలోకి చూసింది. ఆవిడ ముఖంలోని ఆగ్రహం ఆమెని రెండడుగులు వెనక్కి వేసేలా చేసింది.

తను అక్కడికి రావడం ఆమెకి ఇష్టంలేదని అర్థమయిందామెకి. "ఎలా అత్తగారిని ప్రసన్నం చేసుకోవడం? ఆవిడ మనసులో స్థానాన్ని సంపాదించడమెలా?" ఆలోచిస్తూనే అంది.

"నేనిక్కడ వుంటాను. మీరు, అత్తయ్యగారు ఇంటికి వెళ్ళి భోజనం చేసి రండి" అంది ఆప్యాయంగా.

"అక్కర్లేదు" అంది శాంభవి అదే

# మర్యాద

రాజనీతి శాస్త్రం తరగతిగది. అంతా శ్రద్ధగా పాఠం వింటూంటే వెనుకబెంచీ కుర్రాడు గోపాల్ మాత్రం బెంచీపై తల వాల్చి కునుకు తీస్తున్నాడు. అది గమనించిన లెక్చరర్ ఉగ్రనరసింహుడై అతనివద్దకు వచ్చి 'పాఠం వినకుండా నిద్రపోతున్నావేంటి?' అని గర్జించాడు.

గోపాల్ తడుముకోకుండా 'నిద్రకాదు సార్... బాధ! మేమంతా హాయిగా కూర్చుని వింటూంటే పాపం మీరు నిలువుకాళ్లమీద నిలబడి పాఠం చెప్పాల్సి వస్తోంది. మీలాంటి పెద్దలు నిలబడడం చూడలేకే తలవాల్చి కళ్లు మూసుకున్నాను' అనేసరికి లెక్చరర్ మారు మాటాడలేకపోయాడు.




స్వరంతో. వకుళ, ఆమె వైపు ప్రాధేయ పూర్వకంగా చూస్తూ- "ప్లీజ్, అత్తయ్యా! నా మాట వినండి మీరసలే నీరసంగా వున్నారు"

ఆవిడ ఆమె వైపు చూడకుండానే అంది. "వసంత్! నువ్వు ఇంటికి వెళ్ళి బీరువా లోని డబ్బు తీసుకురా. చాలదనుకుంటే బ్యాంక్‌కి వెళ్ళి డబ్బు డ్రా చెయ్యి"

తనని అక్కడ నుంచి పంపించే ఉద్దేశం తోనే తల్లి తనని ఇంటికి వెళ్ళమంటోందని అర్థమైన అతను తల ఊపి అక్కడనుంచి బయలుదేరాడు.

"నేను కూడా ఇంటికి వెళ్ళి మీకు భోజనం తెస్తానత్తయ్యా!" అంది వకుళ.

"ఏ ఇంటికి?"

"మా ఇంటికి"

"అక్కర్లేదు. నాకు తినాలని లేదు"

వకుళ అత్తగారి ముఖంలోకి చూసింది. ఆవిడ తన ఉనికి భరించలేక పోతోందని అర్థమయిందామెకి.

'తనపట్ల ఇంత విముఖతతో వున్న ఆవిడ మనసులో స్థానం సంపాదించుకోడమెలా' ఆమె మనసు ముడుచుకుపోతోంది.

"సరే అయితే వెళ్లొస్తానత్తయ్యా. మీరు ధైర్యంగా వుండండి" అని వడివడిగా హాస్పిటల్ బయటకొచ్చింది. వసంత్ స్కూటర్ స్టార్ట్ చెయ్యబోతున్నాడు. ఆమె అతని దగ్గరకొచ్చింది. అనుకోకుండా ఇద్దరి చూపులూ కలిసాయి.

"పాపం! అత్తయ్యగారు బాధలో, బెంగతో వున్నారు. కొంచెం ఆవిడని కనిపెట్టుకుని వుండండి" ఆప్యాయంగా చూస్తూ అంది.

"అవును" అన్నాడతను. "రేపు మా అక్కయ్య వస్తుంది. తను చూసుకుంటుంది. అయినా చూసుకోడానికేమీలేదు. అంతా అయిపోయింది" అతని స్వరం గాద్గదికమైంది. వకుళకి ఒక్కక్షణం అతన్ని గుండెలకి హత్తుకుని ఓదార్చాలనిపించింది.

వసంత్ స్కూటర్ స్టార్ట్ చేసాడు.

"నిన్ను మీ ఇంటి దగ్గర డ్రాప్ చేస్తాను, రా!"

వకుళ మొహమాటంగా నవ్వింది.

"ఫర్వాలేదు ఆటోలో వెళ్తాను"

"ఆటో ఎందుకు? నేను ఇంటికేగా వెళ్తున్నాను.. రా" నవ్వుతూ అన్నాడతను.

వకుళ ఎక్కింది. అతను స్కూటర్‌ని ముందుకి పోనిచ్చాడు.

"అమ్మా! ఆటో కావాలా?" తన ముందు ఆటో ఆగడంతో ఊహలలో నుంచి బయటపడింది వకుళ. వసంత్ స్కూటర్ దూరంగా వెళ్తూ కనిపించింది.

ఆమె నిట్టూర్చి ఆటో ఎక్కి అడ్రస్ చెప్పింది. ఆ రాత్రి ఎంత ప్రయత్నించినా వకుళకి నిద్ర పట్టలేదు. వసంత్‌తో తన సంభాషణని పునశ్చరణ చేసుకుంటోం దామె. అతను ఒక్కసారి కూడా టింకూ ఎలా వున్నాడని అడగలేదని గుర్తుకొచ్చిం దామెకి. మనసులో ఏదో అలజడి.. అశాంతి మేఘంలా కమ్ముకున్నాయి. అతను తన తండ్రి అనారోగ్యాన్ని గురించిన ఆందోళనతో టింకూ విషయాన్ని మరచిపోయి వుంటాడులే అని తనే సర్ది చెప్పుకుంది.

'వసంత్‌కి దగ్గర కావడం ఎలా?' ఆమె ఆలోచన ఎంతకీ తెగడంలేదు.

★ ★ ★

కాలింగ్ బెల్ శబ్దం విని టీవీ వాల్యూమ్ తగ్గించి వెళ్ళి తలుపు తీసింది సూర్యకాంతమ్మ.

ఎదురుగా శాంతమ్మని చూసి ఆరోజు మూడో తారీఖు అని గుర్తుకొచ్చి విప్పారిన ముఖంతో ఆహ్వానించింది.

"లోపలకి రండి"

ఆవిడ లోపలకి వచ్చి చేతిలోని డబ్బు సూర్యకాంతమ్మకిచ్చింది. "ఇదుగోండి అద్దె. అమ్మాయికి నిన్ననే జీతమిచ్చారు".

"కూర్చోండి, నిలబడే వున్నారు"

"పని వుంది. ఇంకా ఇడ్లీపప్పు రుబ్బుకోవాలి. వస్తాను"

"సరిత ఆఫీసుకి వెళ్ళిందా?"

"వెళ్ళిందండీ"

"అమెరికా ఎప్పుడు వెళ్తుందేమిటి?"

"అతనికి ఇంకా ఏదో వీసా రావాలిట"

"ఎప్పుడైనా ఫోను చేస్తాడా?"

"రాత్రే చేశాడు"

"మొన్న మీ మనవడు డాడీకి ఫోన్ చెయ్యమని పేచీ పెడుతుంటే..."

గతుక్కుమంది శాంతమ్మ. "ఆరోజు రాహుల్ డాడీకి ఫోన్ చెయ్యమని పేచీ పెట్టడం, సరిత వాడిపై అరవడం విన్నదా?" మరుక్షణం తన ముఖంలో మారే రంగులకి చిరునవ్వనే ముసుగు వేసి అంది.

"అదా! వాడు పడుకున్నాక రాత్రి బాగా పొద్దుపోయాక ఫోన్ చేసాడతను. అమెరికాకి మనకి టైమింగ్స్ వేరు కదా!" అంటూ అందమైన అబద్ధం కల్పించింది.

"రెండు నెలల్లో కాకపోతే మరో ఏడాదికైనా మీ అమ్మాయి అల్లుడి దగ్గరకి వెళ్తుందనే ఆశ వుంది మీకు. మా కర్మ ఇలా కాలింది. జీవితమంతా అది మోడులా, బతకవలసిందే" ముక్కు చీదింది సూర్యకాంతమ్మ.

శాంతమ్మ ముఖం మ్లానమయింది. సరిత కూడా వకుళ పరిస్థితిలోనే వుందని ఆవిడకి తెలియదు. పాపం! తన కూతురి జీవితమిలా అయిందని బెంగపెట్టుకుంది అనుకుంటూ "అమ్మాయి చదువు మధ్యలోనే ఆపేసిందన్నారు కదూ? పూర్తి చెయ్యమనవలసింది" తన అర్హతలకి తగిన ఉద్యోగం చేసుకునేది అంది.

"వకుళ మానసికంగా దెబ్బతిని వుంది. దాని బుర్రకి చదువెలా ఎక్కుతుంది? చదువుకోవాలంటే ఎంత ఏకాగ్రత వుండాలి?"

ఆ తర్వాత-

సూర్యకాంతమ్మ కాస్సేపు అల్లుడిని, వియ్యపురాలిని, వియ్యంకుడిని తిట్టిపోసింది.

**ఆ రాత్రి ఎంత ప్రయత్నించినా వకుళకి నిద్ర పట్టలేదు. వసంత్‌తో తన సంభాషణని పునశ్చరణ చేసుకుంటోం దామె. అతను ఒక్కసారి టింకూ ఎలా వున్నాడని అడగలేదని గుర్తుకొచ్చిం దామెకి. మనసులో ఏదో అలజడి.. అశాంతి**

## నేనున్నాగా?

'సీనియర్స్ వీడ్కోలు పార్టీకి మీరంతా చందాలివ్వాలి. వెంటనే తలాకొంత తీసి మీ తరగతినాయకుడికి ఇవ్వండి' ఆదేశించారు ప్రిన్సిపాల్ గారు.

'సార్ ఆ డబ్బుల్ని అతను సొంతానికి వాడుకుంటేనో?' సందేహం వ్యక్తంచేశాడో విద్యార్థి.

'ఆ భయం మీకక్కరలేదు.. అందుకు నేనున్నాగా!' ప్రిన్సిపాల్ సమాధానంలో మరో అర్థం విన్పించి పిల్లలు కిసుక్కున నవ్వారు.




"మాధవి సరిత ఒకే ఆఫీసులో పనిచేస్తున్నారటగా?" ఉన్నట్టుండి అడిగిందామె.

"అవునండీ"

"మాధవి ఎలాంటిదంటారు?"

"మంచిపిల్ల. ఎవరిజోలికి వెళ్లదు. తన పనేమో తన లోకమేమో"

"ఏమో నాకు మాత్రం ఆ పిల్ల చెప్పేవన్నీ అబద్ధాలనిపిస్తుంది. ఆమె భర్త చచ్చిపోతే మాత్రం అత్తింటి వాళ్ళు, పుట్టింటివాళ్లూ కూడా వదిలేస్తారా? ఆ అమ్మాయి అబద్ధం చెబుతోంది. అసలు పెళ్ళయి వుండదు ఎవరితోటో లేచొచ్చి వుంటుంది. అందుకే పుట్టింటి వాళ్ళే వదిలేసారు".

శాంతమ్మ నిర్ఘాంతపోయి వింటోంది. మాధవి భర్త మరణించాడా? అని మాధవే చెప్పినా ఈవిడ నిజం కాదంటోంది. ఈ లెక్కన సరిత, భర్త అమెరికాలో వున్నమాట అబద్ధమని ఇంకెంత మందికి చెప్పి వుంటుంది? ఆవిడకి కూతురిమీద కంటే మాధవిపైన ఎక్కువ జాలి వేస్తోంది.

★ ★ ★

"మాధవి భర్తపోయాడుటే పాపం!" తల్లి చెప్పింది విని సరిత షాకింగ్‌గా చూసింది.

"ఎప్పుడు?" ఆదుర్దాగా అడిగింది.

ఆవిడకి అప్పుడుగానీ తను చెప్పే విధానంలోని తప్పు అర్థం కాలేదు.

"నేను చెప్పేది ఆమె వితంతువని"

"అవునా?" ఆశ్చర్యంగా అడిగింది. "ఈ విషయం నీకెలా తెలుసు?"

"సూర్యకాంతమ్మగారు చెప్పారు"

"ఆవిడకెలా తెలుసు?"

"ఇంట్లోకి అద్దెకి దిగేప్పుడు అడుగుతారుగా పెళ్లయిందా? ఒక్కర్తివే వుంటావా లాంటి ప్రశ్నలు. మాధవి అప్పుడు చెప్పి ఉంటుంది. పాపం మాధవి! ఎంత కళగా వుంటుంది. మామూలుగా బొట్టు పెట్టుకుని మెడలో చిన్న గొలుసు వేసుకుంటే ఇంకా పెళ్లవ్వలేదేమో అనుకున్నాను."

"సూర్యకాంతమ్మగారు ఈ విషయం నీదగ్గర ఎందుకు ప్రస్తావించింది?"

"మాధవి అబద్ధం చెబుతోందేమో అని ఆవిడ అనుమానం. ఆమె భర్త పోయినంతమాత్రాన అత్తింటివాళ్ళు వదిలేస్తారా!? ఎవరితోటో లేచి వచ్చి వుంటుంది. అందుకే పుట్టింటివాళ్ళు కూడా వదిలేశారని అసహ్యంగా మాట్లాడింది. నాకు చాలా బాధనిపించింది భయం కూడా వేసింది. నీ గురించి ఎవరి దగ్గర ఏం వాగుతుందో అని. అయినా భర్తపోయాడనే పెద్ద అబద్ధాన్ని మాధవి ఎందుకు చెబుతుంది?"

సరిత మనసు మాధవి వితంతువనే మాట దగ్గరే కేంద్రీకృతమయివుంది. ఆమె అద్దెకి వచ్చి రెండు నెలలయినా ఆమె తరపు బంధువులుగాని స్నేహితులుగాని ఒకళ్ళు కూడా ఆమెని చూడ్డానికి రాలేదు.

పాపం! ఒంటరిగా వుండలేక అప్పుడప్పుడు తమ ఇంటికి వస్తుంది కాబోలు. ఒక క్షణం ఆమెపై జాలిపడింది. ఆమె తన వ్యక్తిగత విషయాలలో తలదూర్చక మామూలుగా మాట్లాడితే తను ఆమెకి స్నేహం పంచేదే! అనవసరంగా తన భర్త గురించి ఆరాలు తీస్తుంది. చికాగ్గా అను కుంది.




"ఆనంద్" సంభ్రమాశ్చర్యాలు నిండిన స్వరంతో ఆహ్వానించింది మాధవి.

"ఎన్నాళ్ళయింది నిన్ను చూసి.. రా కూర్చో!" ఆనంద్ ఆమెకెదురుగా కూర్చు న్నాడు. విచలితంగా ఆమెని చూస్తూ అన్నాడు.

"నీ జీవితంలోని ట్రాజెడీ తెలిసింది మాధవీ! ఐయామ్ సారీ!"

"అది ట్రాజెడీ అని నేననుకోడంలేదు ఆనంద్! వైవాహిక జీవితంలో ప్రతీక్షణం నేననుభవించిన నరకానికి, విషాదానికి అది విముక్తి అనుకుంటున్నాను"

"అవును. ఆ విషయాలన్నీ అమ్మ చెప్పింది. చాలా బాధపడ్డాను" ఒక క్షణం మౌనం తర్వాత అతను చిన్న పేకెట్టుని ఆమె ముందుకి జాపుతూ అన్నాడు.

"చిన్న గిఫ్ట్! నీ కోసం తెచ్చాను".

"ఎందుకిది? మొహమాటంగా అంది".

"నువ్విప్పుడు జాబ్ చేస్తున్నావుటగా? నీకు బాగా ఉపయోగపడేది. చిన్న గిఫ్ట్"

ఆమె ఆ పేకెట్‌ని విప్పి చూసింది. అందులో ఖరీదైన పెన్ సెట్ ఉంది.

"థ్యాంక్ యూ! కాఫీ తాగుదాం. ఇప్పుడే వస్తానుండు" అని కిచెన్‌లోకి వెళ్లి పాలు స్టవ్‌మీద పెట్టింది.

"ఆంటీ!" ఎవరో పిలవడంతో తల తిప్పాడు ఆనంద్.

నాలుగేళ్ళ బాబు. చేతిలో స్టీలు టిఫిన్ బాక్సుతో నిలబడి ఉన్నాడు. నుదుటి మీదికి పడుతున్న వత్తైన జుట్టు. అంద మైన చిన్న ముఖంలో మెరిసే నల్లటి కళ్ళు. చూడగానే ముద్దొచ్చాడు.

కొత్తవ్యక్తిని చూసి ఆగాడు.

"లోపలకి రా బాబూ!" ఆనంద్ పిలి చాడు.

"అమ్మమ్మ ఆంటీకి ఇచ్చి రమ్మంది"

"ఏమున్నాయి అందులో? " నవ్వుతూ అడిగేడు.

"బజ్జీలు" అంటూ వాడు చేతిలోని డబ్బాని అక్కడున్న టీపాయ్‌పై పెట్టాడు.

"నీ పేరేంటి? " వాడిని దగ్గరకి తీసు కుని ముద్దు పెట్టుకుంటూ అడిగాడు.

"రాహుల్!"

"ఆనంద్! ఎవరొచ్చారు? " ట్రేలో కాఫీ కప్పులతో వస్తూ అడిగింది మాధవి.

"రాహుల్! నీ కోసం వాళ్ళమ్మమ్మగారు బజ్జీలు పంపారు"

ఆనంద్ అనే పేరు వినగానే రాహుల్ నాగస్వరం విన్నట్టు తలెత్తాడు.

"మీ పేరు ఆనందా? " వాడి స్వరంలో సంభ్రమం.

"అవును" అన్నాడతను చిరునవ్వుతో.

"మీరు అమెరికా నుంచి వచ్చారా? "

"అవును, నీకెలా తెలుసు? నువ్వు చెప్పావా మాధవీ" అతను ఆశ్చర్యంగా అడిగేడు.

రాహుల్ ముఖంలో వింత కాంతి! వాడు ఒక్కంగలో అతన్ని సమీపించి

హత్తుకుపోయాడు.

"డాడీ!"

తనని రెండు చేతులతో చుట్టేసిన ఆ పసివాడిని చూసి ఆనందే కాదు మాధవి కూడా నివ్వెరపోయింది.

"అమెరికా నుంచి ఎప్పుడొచ్చావు డాడీ! నన్ను, అమ్మని చూడ్డానికి రాలేదేం? " ఆ పసిగొంతులో తను చాలా రోజులుగా కలుసుకోవాలని ఎదురుచూసిన వ్యక్తిని కలుసుకున్న ఆనందం, ఇన్నాళ్ళూ అతన్ని మిస్ అయిన ఫీలింగ్ కలగాపులగంగా కనిపిస్తుంటే ఆశ్చర్యంగా ఆ అబ్బాయినే చూస్తున్నాడు. తనని తొలి చూపులోనే ఆకట్టుకున్న ఆ పసివాడు తనని కౌగలించుకుంటే అతని మనసు అనిర్వచనీయమైన ఆనందంతో ఉప్పొంగిపోతోంది.

"మీ డాడీ పేరు ఆనందా? "

"అవును"

"మీ డాడీ కూడా అమెరికాలో వుంటారా? "

"అవును... మీరు మా డాడీ కాదా!"

ఆనంద్ వాడి కళ్ళలోని ఆశని చూస్తున్నాడు. తను వాడి తండ్రి కాడని తెలిస్తే ఆ ఆశాభంగాన్ని వాడు భరించగలడా?

ఆనంద్‌ని ఆ సంకట పరిస్థితి నుంచి రక్షించడానికి మాధవి రాహుల్‌కి చాక్లెట్ ఆశ చూపించింది.

"రాహుల్! ఇంద ఫైవ్ స్టార్ నీ కోసమే కొన్నాను"

"నో థ్యాంక్స్ ఆంటీ! మమ్మీ నన్ను చాక్లెట్ తినద్దంది" వాడి చిన్న బుర్రలో ఏ ఆలోచన వచ్చిందో తెలియదు 'బై ఆంటీ' అంటూ గిర్రున వెనుదిరిగి మెట్లు దిగి కిందకొచ్చాడు.

సరిత బట్టలు ఇస్త్రీ చేస్తోంది.

"అమ్మా! డాడీ అమెరికా నుంచి వచ్చారు" వాడి స్వరంలో ఉత్సాహం పరవళ్ళు తొక్కుతోంది.

"డాడీయా? " సరిత భ్రుకుటి ముడిపడింది.

"అవును పైన ఆంటీతో మాట్లాడుతున్నారు"

"డాడీ కాదు, వేరే ఎవరో"

"కాదు. డాడీయే! పేరు కూడా నాకు తెలుసు ఆనంద్!"

"డాడీ పేరు ఆనంద్ అని నీకెవరు చెప్పారు? "

"అమ్మమ్మ"

చప్పున తల్లివైపు చూసింది. అపరాధిలా తలవంచుకుంది శాంతమ్మ.

"డాడీ పేరు చెప్పమని నా ప్రాణం తీసేస్తుంటే నోటికి వచ్చిందేదో చెప్పాను"

సరితకి సిగ్గుతో, అసహాయతతో దుఃఖం వస్తోంది. వాడి తండ్రి అమెరికాలో వున్నాడని చెప్పడమే తను చేసిన పెద్ద తప్పు. ఆ అబద్ధాన్ని నమ్మించడానికి నిత్యం అనేక అబద్ధాలాడవలసి వస్తోంది.

రాహుల్‌కి ఉక్రోషంతో కన్నీళ్ళొస్తున్నాయి.

'డాడీ అమెరికా నుంచి వచ్చారని మాధవి అంటీతో మాట్లాడుతున్నారని చెప్పినా అమ్మ పట్టించుకోదేం'

"రామ్మా డాడీని చూద్దాం"

"ఆంటీతో మాట్లాడుతున్నాయన పేరు ఆనంద్ అయితే అవచ్చుకాని ఆయన మీడేడీ కాదు"

"కాదు ఆయన మా డాడీయే!" ఉక్రోషం దుఃఖం కలగలిపిన స్వరంతో అరుస్తూ

**కొత్తగాలి...**

**పిల్లలూ మీకు నమస్సులు**
**అపరిచితులను**
**అమ్మానాన్నలుగా**
**కలిపి వుంచారు.**

–ఎం. రాజ్యశ్రీ

తల్లి చెయ్యి పట్టి లాగాడు.

మాధవి, ఆనంద్ అప్పుడే మెట్లు దిగి కిందకొస్తున్నారు. ఆనంద్‌ని చూస్తూనే రాహుల్ ఒక్క పరుగులో వెళ్ళి అతన్ని సమీపించి డాడీ అంటూ అతని చేతిని పట్టుకున్నాడు.

ఆనంద్ నిటారుగా అయ్యాడు. ఈ పసి వాడు తనని వాడి తండ్రి అని పొరపాటు పడనీ.. అది వేరే సంగతి కాని వాడు తనని డాడీ అని పిలుస్తుంటే తన పితృ హృదయం ఉప్పొంగిపోతోంది.

మాధవి అవాక్కై నిలబడిపోయింది. ఈ పరిస్థితి ఆమె ఊహించనిది.

"క్షమించండి..." సిగ్గు, అసహాయత కలగలిపిన కోమలమైన స్వరం విని అతను తల తిప్పాడు. కడిగిన బంగారం లాంటి దేహకాంతితో అపురూపమైన రూప లావణ్యాలు కలిగిన ఆమె రూపం వెలుగు చీకట్ల సమ్మిళితమైన చిత్రమైన కాంతిలో అస్పష్టంగా కనిపించిందతనికి.

"రాహుల్ మిమ్మల్ని వాళ్ళ డేడీ అని పొరపాటు పడుతున్నాడు" తలదించుకుని అందామె.

"రాహుల్ తండ్రి అమెరికాలో వుంటారా? " అతనడిగేడు.

"అవును" అని రాహుల్ చెయ్యి పట్టుకుని నచ్చచెబుతున్న ధోరణిలో అంది. "రాహుల్ డాడీ నెక్స్ట్ వీక్ అమెరికా నుంచి వస్తానని ఫోన్ చేశారు."

"అంతా అబద్ధం. ఈయన మా డాడీయే" శాంతమ్మ నిర్ఘాంతపోయి చూస్తోంది. సమయానికి సూర్యకాంతమ్మ కూతురిని, మనవడిని తీసుకుని సినిమాకి వెళ్ళింది. ఆవిడే కనుక ఈ దృశ్యం చూసి వుంటే ఎంత రచ్చయ్యేది? అనుకుంటూ. సరిత ముఖం ఎర్రబడిపోతోంది.

"రాహుల్ నా మాట విను నాన్నా! ఈయన మీ డాడీకాదు"

"కాదు... మా 'డాడీయే" పట్టుదలగా అన్నాడు వాడు.

"రాహుల్!" ఈసారి కరుగ్గా హెచ్చరికగా ధ్వనించిందామె స్వరం. చప్పున తల్లి ముఖంలోకి చూసిన వాడు ఆ చూపుల లోని శాసనానికి భయపడిన వాడిలా ఆనంద్ చేతిని వదిలి తల్లి దగ్గరకి వెళ్ళిపోయాడు.

"సారీ! మీకు ఇబ్బంది కలిగించినందుకు క్షమించండి" అని రాహుల్ చెయ్యి పట్టుకుని ఇంట్లోకి వెళ్ళిపోయింది సరిత. శాంతమ్మ కూతురిని అనుసరించింది.

ఆనంద్ అప్పటికి తేరుకున్నాడు.

"ఏమిటి మాధవీ ఇదంతా? "

"అదో పెద్ద కథ. సరిత నా దగ్గర ఉద్యోగంలో చేరకముందే నాకామె తెలుసు. బహుశా తను నన్ను గుర్తుపట్టి వుండదు"

"ఆమె భర్త అమెరికాలో వున్నాడుగా? మరి ఈమె ఇక్కడ? "

"అబద్ధం. ఆమె భర్త నుంచి లీగల్‌గా విడిపోయింది" ఆనంద్ నిశ్చేష్టుడయ్యాడు.



సరిత రాహుల్‌కి అన్నం తినిపించి నిద్ర పుచ్చింది. తల్లి ముఖంలోని సీరియస్‌నెస్‌కి భయపడి వాడు పేచీ పెట్టకుండా అన్నం తినేసాడు. వాడు నిద్రపోయాక వాడినే చూస్తున్న ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి. శాంతమ్మ కూతురి ఏడుపు చూసి చలించిపోయి తనూ కన్నీళ్ళు పెట్టుకుంది.

"ఇవాళ ఆ అపరిచిత వ్యక్తి ముందు తలెత్తుకోలేకపోయాను. వాడికి నిజం చెప్పాలనిపించినా అర్థం చేసుకునే వయసు లేదని సందేహిస్తున్నాను. వాడి తండ్రి అమెరికాలో వున్నాడని చెప్పినదంతా అబద్ధమని తెలిస్తే వాడి లేత మనసు తట్టుకోలేదని భయం వేస్తోంది"

సరిత స్వరం గాద్గదికంగా వుంది.

"అంతా నీ కర్మ! ముదనష్టపు సంబంధం చేసాం. బాలచంద్రుడిలాంటి కొడుకుని కన్నావు. వాడి తండ్రి ఎవరో చెప్పుకోలేని దుస్థితి" ఆవిడ ఏడ్చింది.

సరిత మనసు పౌర్ణమి నాటి సముద్రంలా వుంది.

ఆ పసివాడికి నిజాన్ని ఎలా చెప్పాలనే ప్రశ్న ఆమెని భూతంగా భయపెడుతోంది.

★ ★ ★

ఇంటి ముందు ఆగిన ఆటోలోనుంచి దిగింది రాజ్యలక్ష్మి.

"ఎలా వున్నారక్కా మీ మామగారు?" వరండాలో కుర్చీలో కూర్చుని పేపరు చూస్తున్న ఆనంద్ అడిగాడు.

"బాగానే వున్నారు"

"ఆ రోజు వసంతని నువ్విక్కడ దింపి అమలాపురం వెళ్ళగానే మీ మామగారు నాకు ఫోన్ చేసారు" ఆమె ముఖంలోని భావాలని జాగ్రత్తగా పరిశీలిస్తూ అన్నాడు.

"అవును చెప్పారు. పెద్దాయనకి మతిమరపు వచ్చింది. ముందురోజు ఒంట్లో బాగా లేదని, మమ్మల్ని చూడాలని వుందని రమ్మన్న మనిషి ఆ విషయమే మరచిపోయారు. మా ఇంటికి ఫోన్ చేసి, మేమింట్లో లేమని నీకు ఫోన్ చేసి... అబ్బబ్బ! ఆయన మతిమరుపుతో చంపేస్తున్నారనుకో!" అతి సహజంగా చెప్పింది రాజ్యలక్ష్మి. అక్క నటనకి మనసులోనైనా మెచ్చుకోకుండా వుండలేకపోయాడు ఆనంద్.

వర్ధనమ్మ కూతురిని ముభావంగా పలకరించింది. తల్లి ముభావంగా మాట్లాడుతున్న ధోరణికి రాజ్యలక్ష్మి ఆశ్చర్యపడనూ లేదు. బాధపడనూ లేదు.

'ఈవిడకి ముందు నుంచి వసంతని ఆనంద్‌కి చేసుకోడం ఇష్టం లేదు. తను కాబట్టి మంచి మనసుతో తమ్ముడికి తన కూతురినివ్వడానికి సిద్ధపడింది కాని, లేకపోతే వయసులో 13 సంవత్సరాల వ్యత్యాసం ఉండగా ద్వితీయ వివాహానికి ఎవరు పిల్లనిస్తారు?' అక్కడికి తనేదో ఆనంద్‌ని ఉద్ధరించడానికో వసంతనివ్వబోతున్నట్టు గొప్పగా అనుకుంది.

"వసంతని పిలువమ్మా! వెళ్తాం"

తల్లిగొంతు విని వసంత బట్టల బ్యాగుతో బయటికి వచ్చింది.

"వస్తాను అమ్మమ్మా! బై మామయ్యా!" అంది.

'బై' అన్నాడు ఆనంద్ చిరునవ్వుతో.

ఆ ఇద్దరినీ చూస్తున్న రాజ్యలక్ష్మి మనసులో ఏవేవో ఊహాలు కదిలాయి.

★ ★ ★

రామ్‌నారాయణగారి మరణవార్త విన్న వకుళ అత్తగారిని, వసంత్‌ని పరామర్శించడానికి ఆ ఇంటికి వెళ్దామనుకుంది. కాని అత్తగారి ముఖంలో తనపట్ల వ్యక్తమయిన నిరసన, తిరస్కారాలు ఆమెని ఆ ఆలోచనని విరమించుకునేలా చేసాయి. తన ఉనికే గిట్టని అత్తగారింటికి వెళ్ళడం అనవసరం. వసంత్‌ని మాత్రం పలకరించాలి ఎలా? అతని ఆఫీసుకి వేళ్తే సరి.

రామ్‌నారాయణగారి కర్మకాండ పూర్తయి వసంత్ ఆఫీసుకి వస్తున్నాడో లేదో తెలుసుకోడానికి అతని ఆఫీసుకి ఫోన్ చేసింది. అతను ఆఫీసులో విధులకి హాజరవుతున్నాడని తెలియగానే ఆ రోజు పనిగట్టుకుని బయలుదేరింది. అయితే తనెక్కడికి వెళ్తోందో తల్లికి చెప్పలేదు. తన ప్రయత్నంలో సక్సెసయ్యే వరకు చెప్పకూడదనుకుంది.

వకుళని చూసి వసంత్ ఆశ్చర్యపడ్డాడు.

"మామయ్య పోయారని తెలిసింది" అంది వకుళ కన్నీళ్ళు పెట్టుకుంటూ.

వసంత్ చుట్టూ చూసాడు. అందరూ తమనే చూస్తుండడం అతనికి ఇబ్బందిగా అనిపించింది.

"పద క్యాంటీన్‌కి వెళ్దాం" అన్నాడు సీటులో నుంచి లేస్తూ. వకుళ అతన్ని అనుసరించింది. ఆఫీస్ వర్కింగ్ అవర్స్ కావడం వలన క్యాంటీన్ ఖాళీగా వుంది. ఇద్దరూ ఒక టేబిల్ దగ్గర కూర్చున్నారు.

"మామయ్యగారు చనిపోయారని తెలిసి చాలా బాధ పడ్డాను. మిమ్మల్ని పరామర్శించడానికి మీ ఇంటికే వద్దామనుకున్నాను. కాని అత్తయ్యగారికి నేను హాస్పిటల్‌కి రావడమే నచ్చలేదు. అసలే దుఃఖంలో వున్న ఆవిడని నేను వచ్చి మరింత బాధ పెట్టడమెందుకని రాలేదు" అంది అతని కళ్ళలోకి లోతుగా చూస్తూ.

ఆ రోజు వకుళ హాస్పిటల్‌కి వచ్చి వెళ్ళాక తల్లి వ్యంగ్యంగా అన్న మాటలు గుర్తుకొచ్చాయి అతనికి. 'విడాకుల కోసం కోర్టుకెక్కి మన బతుకులని బజారుకీడ్చిన ఆ రాక్షసి తగుదునమ్మా అని ఎందుకొచ్చిందిరా? అసలు మనకి దానికి ఏం సంబంధం వుంది? అత్తయ్యా అంటూ పిలవడం, కల్లబొల్లి ఏడుపులూను. ఏదైనా కొత్త ప్లాన్ వేస్తోందేమో జాగ్రత్త' తల్లి మాటలు గుర్తుకొచ్చి అతని ముఖం మరింత గంభీరంగా మారింది.

వకుళ కాస్సేపు మామగారి మంచితనాన్ని పొగిడింది. ఆయన హఠాన్మరణం పట్ల తన బాధని వ్యక్తం చేసింది. "టింకూ అంతా మీ నాన్నగారి పోలికేనండి. అచ్చం మీ నాన్నగారిలాగే వాడికీ ఆవకాయ అన్నంలో మీగడ నంజుకుని తినడం అలవాటు" అంది కావాలనే టింకూ ప్రసక్తి తెస్తూ.

వసంత్‌కి రెండేళ్ళ పిల్లవాడుగా వున్న టింకూ కళ్ళముందు మెదిలాడు. సహజంగానే అతని పితృ హృదయం స్పందించింది. "టింకూ ఎలా వున్నాడు?" అప్రయత్నంగానే అడిగాడు.

"వాడు రోజూ మిమ్మల్నే అడుగుతాడు. వాళ్ళ తాతగారు పోయారని తెలిసి చాలా ఏడ్చాడు" కల్పించి చెప్పింది.

వసంత్‌కి అప్పటికప్పుడు కొడుకుని చూడాలని, వాడిని గుండెలకి హత్తుకోవాలనే బలీయమైన కోరిక కలిగింది. అంతలోనే తల్లి హెచ్చరిక చెవులలో ప్రతిధ్వనించి ఆ భావాన్ని అణచుకున్నాడు.

**వసంత్‌కి అప్పటికప్పుడు కొడుకుని చూడాలని, వాడిని గుండెలకి హత్తుకోవాలనే బలీయమైన కోరిక కలిగింది. అంతలోనే తల్లి హెచ్చరిక చెవులలో ప్రతిధ్వనించి ఆ భావాన్ని అణచుకున్నాడు.**

"టింకూ కూడా మీ దగ్గరకొస్తానని పేచీ పెట్టాడు. ఆఫీసుకి తీసుకురావడం బాగుండదని వద్దన్నాను. వసంత్ మనసు రకరకాల భావాలతో ఉక్కిరిబిక్కిరవుతోంది. తన రక్తం తన కొడుకుని చూడాలని ఉవ్విళ్ళూరుతోందతని మనసు. కాని వకుళ పట్ల తల్లికి వున్న వైమనస్య భావం మెత్తబడుతున్న మనసుని కఠినంగా మారుస్తోంది. టింకూని వదులుకోలేని బలహీనత ఒక వైపు, వకుళతో రాజీపడలేని పట్టుదల మరోవైపు అతని మనసుని అతలాకుతలం చేస్తున్నాయి.

అతని ముఖంలోని భావాలని చదువుతున్న వకుళకి సంతృప్తిగా అనిపించింది. ఈ మాత్రం చాలు, ప్రతీక్షణం అతను టింకూ గురించి ఆలోచిస్తాడు. ఆటోమేటిగ్గా తనవైపు మొగ్గు చూపుతాడు.

వసంత్ లేచాడు.

"ఆఫీస్ వర్కింగ్ టైమ్‌కదా! ఇంతసేపు నా టేబిల్ వదిలి బయటకి రావడం బాగుండదు. నువ్వు బయలుదేరు".

"మళ్ళీ కలుద్దాం" అంది చిరునవ్వుతో.

అతను తల పంకించి కదిలాడు.

★ ★ ★

"వకుళ నీ ఆఫీసు కెందుకొచ్చింది?" శాంభవి తీక్షణంగా కొడుకుని చూస్తూ అడిగింది.

వసంత్ చివ్వున తల ఎత్తాడు. ఆ విషయం తనింకా చెప్పకుండానే తల్లి కెలా తెలిసింది?

"నువ్వు చెప్పనిదే నాకెలా తెలిసిందనా ఆశ్చర్యం? అవును నువ్వు చెప్పవు. ఎందు కంటే నువ్వు అది చేసిన అవమానాన్ని తేలిగ్గా మరిచిపోయావు. నీ మనసులో దానిపట్ల ప్రేమ చావలేదు. తెగిపోయిన వైవాహిక బంధాన్ని తిరిగి ముడివేసుకోవా లనే ఆలోచన నీకు పుట్టింది"

"అమ్మా..." ఎర్రబడిందతని ముఖం.

"ఏం నేను చెప్పినమాట అబద్ధమా? నీకా ఉద్దేశం లేదా? అది హాస్పిటల్‌కి వచ్చి మీ నాన్నని చూసినప్పుడు మీ మధ్య ఏమీ జరగనట్టే దానితో ఎంత బాగా మా ట్లాడావు. నిన్న ఆఫీసుకి వచ్చి నిన్ను కలు సుకున్న సంగతి చెప్పావా? మూడో వ్యక్తి ద్వారా నాకా సంగతి తెలియాలా?"

"ఎవరు చెప్పారు నీకీసంగతి?"

"సునీత చెప్పింది. వకుళ వసంత్ మళ్ళీ కలిసివుండబోతున్నారా అని అడిగింది"

సునీత పక్కింటి వాళ్ళమ్మాయి. వసంత్ ఆఫీసులోనే పని చేస్తోంది.

"అమ్మా! నువ్వు నన్ను అపార్థం చేసు కుంటున్నావు. వకుళ నాకేమీ కాని మాట నిజం. కాని ఆమె నాన్నగారిని చూడ్డానికి హాస్పిటల్‌కి వస్తే ఆమెతో మాట్లాడకుండా ఎలా వుండగలను? ఇరుగుపొరుగు వాళ్ళె వరైనా వస్తే మాట్లాడినట్టే ఆమెతోనూ మాట్లాడాను. అంతే కాని నామనసులో వేరే ఉద్దేశం లేదు"

"నిన్న అది మీ ఆఫీసుకొస్తే దానితో కలిసి క్యాంటిన్‌కి ఎందుకు వెళ్ళావు?"

"ఆఫీసులో మాట్లాడితే మిగతావాళ్లు డిస్టర్బ్ అవుతారని"

"ఏం మాట్లాడుకున్నారు మీరిద్దరూ?" క్రాస్ఎగ్జామినేషన్ చేస్తున్న లాయర్‌లా చూసింది శాంభవి.

"నాన్న చనిపోయారని బాధపడింది".

"బాధ? అవును. చాలా బాధ. విడా కులు తీసుకోవద్దు. పసిపిల్లాడి కోసమైనా కలిసి వుండండమ్మా అని నచ్చచెప్పడానికి వెళ్లిన మీ నాన్నగారిని ఎంత అవమానిం చిందో, నువ్వు మరచిపోయావా? అద సలు ఆడదేనా? దానివల్లనే కదూ, పరు వుగా బతుకుతున్న మనం వీధిన పడింది. నాన్నగారు నీ విడాకుల వ్యవహారం నుంచి మొన్న మొన్నటి వరకు అనుక్షణం ఎంత టెన్షన్ అనుభవించారు? ఎంతో ఆరోగ్యంగా వుండే ఆయనకి అమాంతం బి.పి. రెయిజయి మెదడులో నరాలు చిట్లి కోమాలోకి వెళ్లిపోడానికి కారణం ఆయన అనుభవించిన మానసిక వ్యథే! ఆయన చావుకి కారణం ఆ రాక్షసే," ఉద్రేకంతో వూగిపోతూ అరుస్తున్న ఆవిడకి హఠా త్తుగా దుఃఖం ముంచుకొచ్చింది.

ఏడుస్తున్న తల్లి వైపు అసహాయంగా చూసాడు వసంత్. తండ్రి మరణానికి కార కురాలు వకుళ అవునో కాదో అతనికి తెలి యదు. కాని తన వైవాహిక జీవిత వైఫ ల్యాన్ని ఆయన తట్టుకోలేకపోయారన్నది వాస్తవం. వకుళ తను విడిపోవడంలో తన లోపం ఎంత వుందా అని అతను ఎప్పుడూ పునస్సమీక్షించుకోలేదు. తను మగవాడిననే అహం. నేనేం చేసినా చెల్లు బాటవుతుందనే ధీమా. తప్పుని అంగీకరిం చని పురుషాహంకారం అతనిది.

ఏడుస్తున్న తల్లిని ఓదార్చి అన్నాడు,

"టింకూ అస్తమానం నన్నే తలచుకుంటాడట."

"అదే చెప్పిందా?"

"అవును".

"నాకు తెలుసు. అదేదో పెద్ద ప్లాన్‌తోనే నీ దగ్గరికి వస్తోంది. లేకపోతే మీ నాన్న గారు పోయారని పరామర్శకి వచ్చినది టింకూ ప్రసక్తి తేవడమెందుకు? అయినా దానికి మనతో ఏ సంబంధం వుందని ఈ రాకపోకలు? 'సిగ్గుమాలినది మొగుడి రెండోపెళ్ళికి వెళ్లి బేడా అర్ధణా కట్నం చదివించిందిట' అలా వుంది కథ" పళ్లు కొరుకుతూ అంది.

వసంత్ ఎలాంటి వ్యాఖ్యానం చెయ్యలేదు. మౌనంగా వుండిపోయాడు. అతని ముఖంలోని వేదనని గమనించిన శాంభవికి అంత దుఃఖంలోనూ చిన్న అనుమానం వచ్చింది.

వీడి మనసు వకుళ వైపు మొగ్గుతోందా? తిరిగి ఆమెతో కలిసి జీవించాలనుకుంటున్నాడా? అని.

వసంత్ మనసులో ఏ ఆలోచనలు కదలాడుతున్నాయో చెప్పడం కష్టం.

★ ★ ★

ఇరవై రోజుల తరువాత... హఠాత్తుగా వచ్చిన పెద్దకొడుకు అచ్యుత్‌ని, కోడలు మీనాని సంభ్రమంగా ఆహ్వానించింది వర్ధనమ్మ.

"ఇదేమిట్రా, వస్తున్నట్టు ఫోనయినా చెయ్యలేదు."

"ఆనంద్ అమెరికా వెళ్లే వరకు మేమూ ఇక్కడే వుందామని వచ్చాం".

"మంచి పని చేసారు" ఆవిడ ముఖం వికసించింది. "అనిల్‌ని తీసుకురాలేదే?"

"వాడికి స్కూల్ పోతుందని ఫ్రెండ్స్ ఇంట్లో వదిలాం" అన్నాడు అచ్యుత్.

"ఏమయ్యా ఆనంద్, ఇండియాకి వచ్చాక నల్లబడ్డట్టున్నావ్?" మరిదిని పలకరించింది మీనా.

"ఏం లేదు వదినా! ఎండలెక్కువగా వున్నాయి కదా!" వదిన పక్కనే నిలబడి సిగ్గుగా తననే చూస్తున్న బంటీని దగ్గరికి తీసుకున్నాడు.

"ఏరా, నన్ను మరచిపోయావా? నేను మద్రాస్‌లో వుండగా నన్ను ఒక్కక్షణం కూడా వదిలేవాడివి కావు"

వాడు నవ్వేడు.

"వాడు నిన్నెలా మరచిపోతాడయ్యా? నువ్విచ్చిన ఏరోప్లేన్ బొమ్మతోనే ఎప్పుడూ ఆడుతూ వుంటాడు. నిన్ను ఏరోప్లేన్ బాబాయ్ అని పిలుస్తాడు."

"అవునా?" వాడిని దగ్గరకి తీసుకుని ముద్దుపెట్టుకున్నాడు. వాడు బుగ్గ తుడుచుకోడం చూసి నవ్వేడు.

వర్ధనమ్మ వంట గదిలో కుస్తీపడుతుంటే మీనా కాఫీ తాగుతూ అత్తగారితో కబుర్లు చెబుతోంది.

## నీదా?

జువాలజీ ప్రాక్టికల్స్ క్లాస్ జరుగుతోంది. అందరూ బొద్దింక డిసెక్షన్ చేస్తున్నారు. అంతలో ఓ అమ్మాయి కెవ్వుమంది. అంతా ఉలిక్కిపడ్డారు. 'మేడమ్ నా జీర్ణనాళం తెగిపోయింది మేడమ్' అంటూ కంగారు పడిపోతోందా పిల్ల.

మేడమ్ నవ్వుతూ ఆమె దగ్గరకు వచ్చి 'తెగింది నీ జీర్ణనాళమా? బొద్దింకదా?' అనే సరికి అంతా ఫక్కున నవ్వారు. ఆ పిల్ల కూడా చిరునవ్వుతో తలదించుకుంది.



ఆనంద్, అచ్యుత్ కబుర్లలో పడ్డారు. ఆ సాయంకాలం రాజ్యలక్ష్మి, వసంత్, గోపాల్రావు వచ్చారు.

రాజ్యలక్ష్మి ముఖంలోని ఉద్విగ్నత అందరికీ కొత్తగా వుంది.

"ఎలా వున్నావ్ పెళ్లి కూతురా? " మీనా వసంతని అడిగింది. ఆమె నవ్వింది.

వర్ధనమ్మ అందరికీ కాఫీ కలిపితెచ్చింది. అందరూ ఏదో మాట్లాడుకుంటుండగా రాజ్యలక్ష్మి భర్తకి సైగ చెయ్యడం వర్ధనమ్మ దృష్టిని దాటిపోలేదు.

గోపాల్రావు గొంతు సవరించుకున్నాడు. "వసంత పెళ్లి విషయం మాట్లాడాలని వచ్చాను" ఉపోద్ఘాతంగా అన్నాడు.

"మాట్లాడ్డానికేముంది? మీరేమైనా పరాయివాళ్లా? వాళ్లిద్దరూ ఒకరినొకరు ఇష్టపడ్డారు. ఇంక ముహూర్తాలు చూసి పెళ్లి చేసెయ్యడమే" అన్నాడు అచ్యుత్.

రాజ్యలక్ష్మి గొంతు సవరించుకుంది.

"వసంతని మీరందరూ చిన్నప్పటి నుంచీ చూస్తునే ఉన్నారు. నా కూతురని చెప్పుకోడంకాదుగాని బంగారం. కట్నకానుకల విషయానికి వస్తే రెండో పెళ్లివాడికి కట్నమెవరిస్తారు? అలాగని మరీ కొబ్బరి బొండాంతో పిల్లనిచ్చి పంపను. పది కాసుల బంగారం పెడతాను. ఉభయఖర్చులు పెట్టి పెళ్లి జరిపిస్తాను. దాన్ని అమెరికా పంపడానికి టిక్కెట్టు ఖర్చు పెట్టుకుంటాను."

"వసంత పెళ్లి నిశ్చయమయిందా? వరుడెవరు? " ఆనంద్ సంభ్రమంగా అడిగాడు.

"ఎంత అమాయకంగా అడుగుతున్నావురా! నువ్వే!" ముద్దుగా తమ్ముడి తలపై చిన్నగా మొడుతూ అంది.

"నేనా? నేను వసంతని పెళ్లి చేసుకోడమేమిటి? తనపై నాకలాంటి అభిప్రాయం ఎప్పుడూ లేదు".

"అలాంటప్పుడు కల్లబొల్లి కబుర్లు చెప్పి దాన్ని ఎందుకు వశపరుచుకున్నావ్? నువ్వు దాన్ని పెళ్లిచేసుకుని తీరాలి. ఎందుకంటే వసంత నెల తప్పింది".

వర్ధనమ్మకి ఆ రాత్రి కొడుకు గదిలో వసంత ఏడుస్తూ అన్న మాటలు గుర్తుకొచ్చాయి.

వసంతకొచ్చిన ఆ సమస్య ఏమిటో ఆవిడకి అర్థం అయినా నింద మాత్రం ఆనంద్‌పై పడిందని అర్థమయిందావిడకి.

"నావల్ల వసంత నెల తప్పిందా? హు!" నవ్వేడు ఆనంద్. "పరిస్థితి ఇంత వరకు వచ్చింది కాబట్టి చెబుతున్నా విను. నాకు జన్మలో తండ్రయ్యే యోగం లేదు."

"పెళ్లి చేసుకోవలసి వస్తుందని అబద్ధమాడుతున్నావా? దాని కడుపులో పెరిగే పాపానికి కారకుడివి నువ్వు కాదూ? "

"అబద్ధం చెప్పవలసిన అవసరం నాకేమిటి? శిల్పకి, నాకు పెళ్లయి మూడేళ్లు దాటుతున్నా పిల్లలు పుట్టకపోవడంతో డాక్టర్లు అన్ని పరీక్షలూ చేసారు. లోపం నాలోనే వుందని తేల్చారు. కావాలంటే, ఇప్పుడే నన్ను ఏ డాక్టరు దగ్గరకైనా తీసుకెళ్లి పరీక్ష చేయించుకో."

రాజ్యలక్ష్మి ముఖం వెలవెలబోయింది. కోపంతో కూతురి జుట్టు పట్టుకుంటూ "ఎవరితో పోయావే ముండా! ఈ పాపానికి కారకుడెవరే? " నిలువెల్లా వణికిపోతూ సభ్యతని మరచిపోయి ఆగ్ర

## కొత్తగాలి...

**సాఫ్ట్‌వేర్ బూమ్**
**పుష్టిగా ఉంది యువత**
**దేశ సౌందర్యమే**
**బక్కచిక్కింది**

–వారణాసి రామకృష్ణ

హంతో అరిచింది.

"వంశీకృష్ణ" తొణక్కుండా చెప్పింది వసంత. "వంశీ నేను ప్రేమించుకున్నాం".

"వంశీకృష్ణా.. వాడెవడు? "

"వసుంధరత్తయ్య కొడుకు"

"ఒళ్లు కొవ్వెక్కి వెళ్లి వెళ్లి ఆ ముష్టివెధవని ప్రేమించావా? " చెయ్యెత్తింది.

ఆచేతిని బలంగా పట్టుకున్నాడు గోపాల్రావు. "తొందరపడకు రాజ్యం! అరిచి గొడవ చెయ్యకు. నలుగురూ వింటారు".

"మీరు నోరు మూసుకోండి. ఈ ఛండాలానికి కారణం మీరు. పూటకి గతిలేని వసుంధరని చెల్లెలంటూ నెత్తికెక్కించుకున్నారు. ఆ వంశీగాడు చేసేది బ్యాంకులో గుమాస్తా ఉద్యోగం. తండ్రి బట్టల కొట్టులో గుమాస్తా. తన కొడుకు పెద్ద హీరో అని మురిసిపోతుండావిడ. వెధవ వంశం. వెధవ సాంప్రదాయం" దెయ్యం పట్టినట్టు అరుస్తున్న రాజ్యలక్ష్మిని, ఆడబడుచుని నీచంగా తిడుతున్న ఆమె కుసంస్కారాన్ని చూస్తుండిపోయారు శ్రోతలు.

సహనం చచ్చిన గోపాల్రావు చెయ్యెత్తి ఆమె చెంపపై బలంగా కొట్టాడు.

"నన్నే కొడతారా? " కీచుమంది ఆమె స్వరం.

"ఇప్పుడు కొట్టిన దెబ్బ నువ్వు నా ఇంటికి కాపురానికి వచ్చిన మరునాడే కొడితే, నువ్విలా మాట్లాడగలిగేదానివి కాదు. అసలు క్లాసు ఫస్టున చదువుకుంటున్న వసంత బుర్రలో పెళ్లి అనే విత్తనాన్ని నాటింది నువ్వు. టీనేజీలో ఆకర్షణకి, ప్రేమకి మధ్య తేడా తెలియని ఆ పసిపిల్ల వంశీకి దగ్గరయింది. అది ప్రేమించింది మన కులంలోని వాడిని, వరసైన వాడిని అని సంతోషించు. ఆస్తి లేకపోతేనేం.. వంశీ బుద్ధిమంతుడు. మన వసంతకి, ఈడు జోడు అయిన సంబంధం."

"రాతలని బట్టే బుద్ధులని దానికి గుమాస్తాగాడి పెళ్లాంగా బతికే యోగం వుంటే అమెరికా సంబంధం ఎందుకొస్తుంది? "

"మరో మాట మాట్లాడావంటే చంపేస్తాను. నువ్వీక మీదట అన్నం తినడానికే తప్ప నోరు తెరవడానికి వీల్లేదు. వంశీతో పెళ్లికి ముహూర్తం పెట్టిస్తాను. సాధ్యమైనంత త్వరలో వాళ్ల పెళ్లి జరిగిపోవాలి."

రాజ్యలక్ష్మి అసహాయంగా పళ్లు కొరుక్కుంది.

"రాజ్యం తరఫున నేను మిమ్మల్నందరినీ ముఖ్యంగా నిన్ను క్షమాపణ అడుగుతున్నాను ఆనంద్!" అన్నాడు గోపాల్రావు ఆనంద్ చేతులని పట్టుకుంటూ.

"ఛ! అదేమిటి బావగారూ!" అన్నాడు ఆనంద్ నొచ్చుకుంటూ.

"నిజానిజాలని తెలుసుకోకుండా మీ అక్క నీమీద నింద మోపినందుకు, క్షమాపణ కోరుకుంటున్నాను. వసంత ఇప్పటికైనా ధైర్యంగా విషయాన్ని బయటపెట్టి వుండకపోతే నీమీద పడిన నింద ఎప్పటికీ మాసి పోయేదికాదు"

"వసంత తాను వంశీని ప్రేమిస్తున్న విషయం నాకెప్పుడో చెప్పింది బావగారూ! నేనే మీతో ఆవిషయాన్ని మాట్లాడాలనుకున్నాను. అక్కకి తమ పెళ్లి ఇష్టంలేదని, ఆమెకి నచ్చచెప్పమని నన్ను అడిగింది వసంత. నేను అమెరికా వెళ్లేలోగా వాళ్ల పెళ్లి సెటిల్ చేద్దామనే అనుకున్నాను. ఈలోగా ఇలా జరిగింది"

వసంత కన్నీళ్ళతో ఆనంద్ పాదాలకి నమస్కరించింది.

వర్ధనమ్మ మనుమరాలిని ఆప్యాయంగా దగ్గరికి తీసుకుని కొడుకువైపు చిరుగర్వంతో చూసింది. మచ్చలేని అతని వ్యక్తిత్వానికి ఆవిడ గర్వపడినా ఆనంద్‌కి పిల్లలు పుట్టకపోడానికి గల కారణాన్ని అతని నోటి వెంటే విన్నా ఆవిడకి నమ్మశ

క్యంగా లేదు. ఆనంద్ నిజమే చెబుతున్నాడా? లేక ఆ అబద్ధంతో తనని తాను రక్షించుకున్నాడా?




మాధవి ఇంటికొచ్చిన ఆగంతకుడిని రాహుల్ 'డాడీ' అని పిలవడాన్ని, తలచుకుంటే సరితకి సిగ్గుతో ప్రాణం పోతున్నట్టుంది. ముఖ్యంగా మాధవి ముందు తల ఎత్తుకోలేకపోతోంది. తన భర్తని గురించి ఆరాతీసే మాధవి ముందే, ఇదంతా జరగాలా? రాహుల్ డాడీ పేరేమిటో చెప్పమని విసిగిస్తే తల్లి 'ఆనంద్' అని పేరు చెప్పడం, ఆ పేరు గల వ్యక్తే రావడం, అతన్ని రాహుల్ తన తండ్రి అని పొరబాటుపడడం.. భగవంతుడా! ఇలా జరిగిందేమిటి? ఆమె అనుభవిస్తున్న మానసిక సంఘర్షణకి ఆమె కళ్ల కింద నల్లటి వలయాలు సాక్ష్యం చెబుతున్నాయి. ఆమె ముఖం లంఖణాలు చేసినట్టుగావుంది. ఆమెలోని ఈ మార్పుని మాధవి గమనించకపోలేదు. సరితతో ఆఫీసు వర్క్‌కి సంబంధించి తప్ప మరో మాట మాట్లాడలేదు. తరచు ఏదో ఒక సందర్భంలో తన భర్త గురించి అడిగే ఆమె ఆ ప్రస్తావన తేకపోవడంతో సరితకీ హాయిగానే ఉంది. కాని అది తుపాను ముందు ప్రశాంతత అని ఆమెకి తెలియదు.

ఆరోజు ఆఫీసు పనిముగిసాక సరిత ఇంటికి బయలుదేరుతుండగా అంది మాధవి.

"ఒక్క నిముషం నీతో మాట్లాడాలి".

"చెప్పండి మేడమ్"

"ఇక్కడ కాదు" అంది. బ్యాగ్ తీసుకుంటూ ఇద్దరూ లిఫ్ట్‌లో కిందకొచ్చారు.

మాధవి తన సన్నీని బయటకి తీసింది.

"ఎక్కు"

సరిత ఇంటిదగ్గర పనివుందని అబద్ధం చెప్పి, ఇంటికెళ్ళిపోదామా అనుకుంది. కాని ఏదో బలహీనత. ఆమె తనతో ఏం మాట్లాడుతుందో అనే కుతూహలం. ఆమె ఆహ్వానాన్ని తిరస్కరించలేని మొహమాటం. ఆమె చూపు గుర్తుకొస్తే ఏదో తెలియని ఇబ్బందికరమైన ఫీలింగ్.

సన్నీ పార్కు ముందు ఆగింది. ఇద్దరూ ఒక సిమెంటు బెంచీ మీద కూర్చున్నారు.

"ఉపోద్ఘాతాలు, డొంక తిరుగుళ్లు లేకుండా విషయానికి వస్తాను. నా ఫ్రెండ్ ఆనంద్ అమెరికాలో సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గా పనిచేస్తున్నాడు. ఆరోజు నువ్వు అతన్ని చూసావు."

మాధవి నోటివెంట అమెరికా మాట వినగానే ఆమె ముఖం కళ తప్పింది. ఏం చెప్పాలనుకుంటోందో అనే భయంతో గుండెవేగం అమాంతం పెరిగింది.

"ఆనంద్ చాలా మంచివాడు సరితా!"

"నాకు తెలియని వ్యక్తి గురించి నాకెందుకు చెబుతున్నారు మేడమ్? " ఆమెవైపు చూడకుండానే అంది.

"నువ్వు తెలుసుకోవాలని. ఆనంద్ మా ఫ్యామిలీ ఫ్రెండ్ రావుగారబ్బాయి. వాళ్లది మాది పక్క పక్క ఇళ్లే. అంకుల్ చనిపోయి నాలుగేళ్లవుతోంది. ఆనంద్ తల్లి వర్ధనమ్మగారు చాలా మంచిమనిషి. అమెరికాలో ఒక రోడ్ యాక్సిడెంట్‌లో ఆనంద్ భార్య శిల్ప మరణించింది. ఇది జరిగి మూడేళ్లయినా పెళ్లి చేసుకోకుండా ఒంటరిగా గడుపుతున్నాడు. తను అమితంగా

# పిల్లి ప్రియులు




**ఏం**డీ జూవ్‌కో, కోవర్ గ్రెగరీ రూంమేట్స్. ఆ ఇద్దరూ కలసి మూడేళ్ళ వయసుగల గాడ్రీ అనే పిల్లిని పెంచుకోసాగారు. కంప్యూటర్ కన్సల్టెంట్ అయిన గ్రెగరి ఆ పిల్లికయ్యే ఖర్చుని భరిస్తూంటే, తక్కువ సంపాదన గల ఏండీ దానికి చాకిరి చేస్తూండేవాడు. క్రమంగా ఆ ఇద్దరికీ పిల్లిమీద ఆపేక్ష పెరగసాగింది.

వారిద్దరు విడిపోయేరోజు వచ్చింది. పిల్లి తనకి చెందాలంటే, కాదు తనకి చెందాలని వాదించుకుని ఇద్దరూ గొడవ పడ్డారు. ఏండీ పిల్లిని తీసుకెళ్ళిపోతే అతని మీద దొంగతనం నేరం ఆపాదిస్తూ గ్రెగరీ పోలీసులకి ఫిర్యాదు చేసాడు. సెర్చ్‌వారెంట్ లేకుండా పోలీసులని ఏండీ తనింట్లోకి అడుగు పెట్టనివ్వనన్నాడు. వారెంట్‌తో వెళ్ళి వెదికిన పోలీసులకి గాడ్రీ (పిల్లి) కనబడింది. దాన్ని వారు గ్రెగరీకిస్తే ఏండీ స్మాల్ కాజెస్‌షెల్టర్ కోర్టులో ఆ పిల్లి తనకి చెందాలంటూ కేసు వేసాడు. కేసు తేలేదాకా దాన్ని ఏనిమల్ షెల్టర్ సెంటర్‌లో ఉంచాలని తీర్పు చెప్పాడు జడ్జి. అయితే తర్వాత ఆ చిన్న కోర్టు పిల్లిని గ్రెగరీ పరం చేస్తే, ఏండీ మళ్ళీ సివిల్ కోర్ట్‌లో అపీల్ చేసాడు. తను ఆ పిల్లికి ఫేవరేట్ మనిషి అని తెలియజేసే మనుషుల్ని సాక్షులుగా కోర్టుకి తెచ్చాడు. ఏనిమల్ షెల్టర్‌లో ఆ పిల్లి ఉండగా ఏండీ దాన్ని చూడటానికి 64 సార్లు వెళ్తే, గ్రెగరీ 2 సార్లే వెళ్లాడని షెల్టర్ యజమాన్యం సాక్ష్యం చెప్పింది.

దాంతో జడ్జి ఆ పిల్లి ఏండీకే చెందాలని తీర్పు చెప్పాడు. దీంతో గ్రెగరీ పట్టుదలగా పై కోర్టుకి అపీల్‌కి వెళ్ళాడు. ఆ కేసు ఏమవుతుందో అని పత్రికల వాళ్ళంతా వేచి చూస్తూ, ఆ హియరింగ్స్‌ని కవర్ చేస్తున్నారు. హైకోర్టుకి మార్జాల వ్యాజ్యం ఎక్కడం ఆర్లింగ్టన్ (వాషింగ్టన్)లో ప్రథమం కాబట్టి వర్జీనియా రాష్ట్ర పేపర్లన్నీ ఈ కేసుని మొదటి పేజీలో కవర్ చేస్తూ, పిల్లి ఎవరికి చెందాలన్న ఒపీనియన్ పోల్స్‌ని కూడా నిర్వహిస్తున్నాయి.



ప్రేమించిన భార్య జ్ఞాపకాలు అతన్ని పెళ్లికి దూరంగా వుంచాయి."

"ఇదంతా నాకెందుకు చెబుతున్నారు? " ముడివడిన భ్రుకుటితో చూస్తూ అడిగింది.

"నువ్వు ఒప్పుకుంటే నీ గురించి ఆనంద్‌తో మాట్లాడతాను"

"దేనికి ఒప్పుకోడం? " అయోమయంగా అడిగింది.

"నువ్వు ఆనంద్‌ని పెళ్లి చేసుకుంటే బాగుంటుందని నిన్ను చూసిన మొదటి రోజే అనుకున్నాను"

నాకు పెళ్లయింది. భర్తవున్నారు. మా ప్రేమ ఫలితమైన బాబువున్నాడు" వ్యంగ్యంగా అంది సరిత.

"నువ్వు మోహన్ లీగల్‌గా విడిపోయారని నాకు తెలుసు సరితా!" నిదానంగా అంది మాధవి.

సరిత తలపై నుంచి మిస్సైల్ దూసుకుపోయినట్టయింది. తను ఇన్నాళ్లుగా కాపాడుకుంటూ వస్తున్న రహస్యం ఈమెకెలా తెలిసిందా? అనే దిగ్భ్రమతో ఆమె అప్రయత్నంగా లేచి నిలబడింది. ఆమె ముఖం పాలిపోగా, పెదవులు వణుకుతున్నాయి.

"మీకు... మీకిదంతా ఎలా తెలుసు? " హీన స్వరంతో అడిగింది.

"నేను మోహన్ కజిన్‌ని. మీ పెళ్లికి వచ్చాను. నీకు నేను గుర్తుండి వుండను. సుమూహూర్తం అవగానే ముంబాయి వెళ్లిపోయాను"

"నాకు సరిగా గుర్తులేదు. మీరేకాదు 'పెళ్లి', 'భర్త' అనే గతాన్ని నేనెప్పుడో నా జ్ఞాపకాల్లో నుంచి తుడిచేసాను"

"ఆ పీడకలని గుర్తు చేసుకోకపోవడం మంచిదేలే! నిజం సరితా! మీ పెళ్లి ఒక పీడకల. జరిగినదాంట్లో నీ తప్పేమీ లేదు. మోహన్ మనిషి కాదు. మృగం.. శాడిస్ట్! మేల్ చావనిస్ట్ పిగ్! వాడి నుంచి విడాకులు తీసుకున్నందుకు నువ్వేమీ నష్టపోలేదు"

తనని నీడలా వెంటాడుతున్న గతం తాలూకు జ్ఞాపకాలు మనసులో ముళ్లు గుచ్చాయో ఏమో సరిత కళ్ల నుంచి అశ్రువులు జాలువారాయి.

"గతాన్ని వదిలెయ్యి. ఆనంద్ చాలా మంచివాడు. అతన్ని పెళ్లి చేసుకుని కొత్త జీవితాన్ని మొదలుపెట్టు? "

"వద్దు. మరోసారి నాదగ్గర పెళ్లి ప్రస్తావన తీసుకురావద్దు. పెళ్లి అనేది నా జీవితంలో ఒక పెద్ద యాక్సిడెంట్. నన్ను దురదృష్టం అనే లోయలోకి విసిరేసిన యాక్సిడెంట్. మళ్లీ కోరి ఆ యాక్సిడెంట్ బారిన పడాలనిలేదు" సరిత ఏడుస్తోంది.

మాధవి ఓదార్పుగా ఆమె భుజంపై చెయ్యి వేసి ఆర్ద్ర స్వరంతో అంది.

"ఆనంద్‌ని పెళ్లి చేసుకుంటే జీవితంలో నువ్వెప్పటికీ పశ్చాత్తాపపడవని హామీ ఇస్తున్నాను"

"వద్దు దయవుంచి నాదగ్గర మళ్లీ ఆప్రస్తావన తీసుకురావద్దు"

"నీకు భర్త వద్దు. సరే, బాబుకి తండ్రి ప్రేమ వద్దా? "

"ఈ లోకంలో తల్లీతండ్రీ లేని అనాథలు ఎందరోవున్నారు. వాళ్లకంటే రాహుల్ పరిస్థితి చాలా మెరుగు. వాడిని గుండెలలో పెట్టుకుని కాపాడుకోడానికి నేనున్నాను"

"మరి వాడి తండ్రి అమెరికాలో వున్నాడని వాడికెందుకు అబద్ధం చెబుతున్నావు? లోకాన్ని కూడా అదే అబద్ధంతో నమ్మిస్తున్నావే! సంఘంలో గౌరవం కోసమా? "

"ఒక రకంగా అంతే! ఈ సమాజం భర్త వదిలేసిన స్త్రీపై సానుభూతి చూపించదు. ఆమె ఏదో ఘోరమైన తప్పు చేసిందన్నట్టు చులకనగా చూస్తుంది. అదే భర్త ఎక్కడో

వున్నాడన్నా ఆమెని గౌరవంగానే చూస్తుంది. నా భద్రత కోసం అబద్ధం చెప్పక తప్పలేదు"

"ఈ అబద్ధంతో రాహుల్‌ని ఎన్నాళ్లు మభ్యపెట్టగలవు? వాడు పెరిగి పెద్దయ్యాక నా తండ్రి ఎక్కడ అని నిలదీస్తే? ఇప్పటికే వాళ్ల నాన్నకోసం పేచీ పెడుతున్నాడు కదా!"

"వాడి తండ్రి ఎంత దుర్మార్గుడో, అతని వల్ల నేనెంత నరకాన్ని అనుభవించానో చెబుతాను. మేము లీగల్‌గా విడిపోయామని అప్పుడు చెబుతాను."

"తను తండ్రి ప్రేమని పొందుతాననే ఆశని, తండ్రి అమెరికాలో వున్నాడనే వాడి నమ్మకాన్ని నాశనంచేస్తే వాడి మనసు తట్టుకుంటుందనే అనుకుంటున్నావా?"

"వాడు నా బిడ్డ. ఎలాంటి పరిస్థితినైనా ఎదుర్కోగల మనోధైర్యం వాడు అలవరచుకునేలా పెంచుతున్నాను"

"ఆనంద్ మంచివాడు, సహనశీలి"

"వెళ్తాను మేడమ్! రాహుల్ నాకోసం ఎదురుచూస్తుంటాడు..." అని ఆమె సమాధానం ఎదురు చూడకుండానే ముందుకి నడిచింది సరిత. ఆమె తను ఆనంద్ గురించి చెప్పగానే పెళ్లికి అంగీకరిస్తుందనుకోకపోయినా కనీసం తన ప్రపోజల్ గురించి ఆలోచిస్తుందనుకుంది మాధవి.

**"ఈ అబద్ధంతో రాహుల్‌ని ఎన్నాళ్లు మభ్యపెట్టగలవు? వాడు పెరిగి పెద్దయ్యాక నా తండ్రి ఎక్కడ అని నిలదీస్తే? ఇప్పటికే వాళ్ల నాన్న కోసం పేచీ పెడుతున్నాడు కదా!"**

★ ★ ★

ఫోన్ మోగింది. ఏదో ఆలోచనలతో పరధ్యానంగా వున్న వకుళ ఉలిక్కిపడి ఫోన్ తీసింది.

"నేను"

అవతలి స్వరాన్ని వెంటనే గుర్తుపట్టలేక పోయింది.

"ఎవరూ?"

"నేను వసంత్‌ని"

వకుళ ఆనందం ఆశ్చర్యం ముప్పిరిగొన్న స్వరంతో అంది. "మీరా"

"టింకూని మా ఇంటికి పంపించు"

"మీ ఇంటికా ఎందుకూ?"

"వాడిని చూడాలనివుంది"

"పసివాడు... వాడినొక్కడినీ అంత దూరం పంపడం క్షేమంకాదు. నేనూ వస్తాను."

"నువ్వు రావద్దు. అమ్మకి నీపై కోపమింకాపోలేదు" వకుళ ముఖం పాలిపోయింది. గతంలో అయితే జరిగిన దాంట్లో తప్పు నా ఒక్కర్తిదేనా? మీ తప్పేంలేదా? అని అరిచేదే కాని, ఇప్పుడిప్పుడే మెత్తబడుతున్న వసంత్ మనసులో తను స్థానం సంపాదించుకోవాలి. ఆ స్థానాన్ని సుస్థిరం చేసుకోవాలంటే తను తగ్గాలి.

"అది నా దురదృష్టం" వేదన నిండిన స్వరంతో అంది.

"నిజమే నువ్వన్నట్టు టింకూని ఒక్కడినీ మా ఇంటికి పంపడం క్షేమం కాదు. పోన్లే నేనే వాడి స్కూల్‌కి వెళ్తాను"

"మీరే మా ఇంటికి రావచ్చుగా".

ఆమె ప్రతిపాదనకి తన అంగీకారాన్ని కాని తిరస్కారాన్ని కాని తెలియచెయ్యకుండా అడిగాడు.

"టింకూ ఏ స్కూల్?"

"వివేకానందా పబ్లిక్ స్కూల్"

"ఓ.కె. నేను స్కూలుకి వెళ్ళి వాడిని చూస్తాను".

కథా నిలయం శ్రీకాకుళం

"ఎప్పుడు ఇవాళేనా?" ఆతృతగా అడిగింది.

"అవును" ఫోన్ పెట్టేసాడతను.

వసంత్ టింకూతో ఏం మాట్లాడతాడు? వాడు స్కూల్‌కి వెళ్ళక ముందు ఫోన్‌చేసివుంటే తండ్రితో ఏం మాట్లాడాలో వాడిచేత రిహార్సల్ చేయించి వుండేది. వకుళ గుండెలో ఏదో గుబులు. తను కూడా స్కూల్‌కి వెళ్తే? టింకూకి తండ్రితో ఏం మాట్లాడాలో ప్రిపేర్ చెయ్యవచ్చు. ఆ ఆలోచన వచ్చిందే తడవుగా గబ గబ స్నానం ముగించి తయారయింది.

"ఎక్కడికైనా వెళ్తున్నావా?" అడిగింది సూర్యకాంతమ్మ.

"పనిమీద వెళ్లున్నప్పుడు ఎక్కడకని అడగకూడదని నువ్వే చెప్పావుగా? ఎందుకడుగుతున్నావ్?" తల్లిమీద చిరాకు పడింది.

ఆవిడ చిన్నబుచ్చుకుని "క్షేమంగా వెళ్ళి లాభంగా రా" అంది.

వకుళ బ్యాగ్ తీసుకుని బయటపడింది. ఆటో స్కూల్ ఆవరణని సమీపిస్తుండగా ఆమె శరీరం ఉద్విగ్నతతో కంపిస్తోంది.

గేటు దగ్గర గూర్ఖా అడిగాడు "ఎవరు కావాలమ్మా?"

"మా బాబు... టింకూ... అదే రామ్‌నారాయణ. యు. కె. జి చదువుతున్నాడు"

"క్లాస్‌లో వున్నాడు. ఇంటర్వెల్ దాకా వెయిట్ చెయ్యండి"

ఆమె చూపులు స్కూలు మెయిన్‌గేటు వదిలి రానంటున్నాయి. అరగంట తర్వాత బెల్ మోగింది. పిల్లలంతా బిలబిల మంటూ బయటకి వచ్చారు.

"అమ్మా" అన్న పిలుపుతో చప్పున వెనుదిరిగింది.

"నువ్వు మా స్కూలుకెందుకొచ్చావ్?" సంభ్రమంగా టింకూ అడిగాడు.

"డాడీ నీకోసం వస్తానన్నారు. వచ్చారా?"

"డాడీయా?" వాడి స్వరంలో నిరాసక్తత.

"అవును"

"ఎందుకు?" అప్రియంగా ధ్వనించింది వాడిస్వరం. వాడికి ఊహ తెలిసిన దగ్గర నుంచి తండ్రి అనే వ్యక్తి పట్ల ద్వేషాన్ని కలుగచేసింది వకుళ. తండ్రి దుర్మార్గుడని దుష్టుడనే భావాలని వాడికి ఉగ్గుపాలతో రంగరించి పోసింది. అలాంటి తండ్రి వాడికోసం వస్తాడనే నిజం వాడికి అంతగా రుచించలేదు.

**ఊహ తెలిసిన దగ్గర నుంచి తండ్రి అనే వ్యక్తి పట్ల ద్వేషాన్ని కలుగచేసింది వకుళ. తండ్రి దుర్మార్గుడని దుష్టుడనే భావాలని వాడికి ఉగ్గుపాలతో రంగరించి పోసింది. అలాంటి తండ్రి వాడికోసం వస్తాడనే నిజం వాడికి రుచించలేదు.**

"డాడీ మా స్కూల్‌కి ఎందుకొస్తానన్నారు?"

"నీతో ఏదో మాట్లాడతారుట"

"నాతోనా.. అక్కర్లేదు. డాడీ అంటే నాకిష్టం లేదు."

"తప్పు అలా అనకూడదు" లాలనగా అంది.

"మరి డేడీ నిన్నెప్పుడూ తిడుతూ వుండేవారని చెప్పావు. డాడీ వెరీ బేడ్ అని చెప్పావు".

"నువ్వు ఫ్లవర్ వేజ్ బద్దలు కొట్టినప్పుడు నేను నిన్ను కొట్టానా?"

"కొట్టావు"

"మరి నీకు నేనంటే ఇష్టంలేదా?"

"చాలా ఇష్టం. మరి నువ్వేం విరగొట్టావని డాడీ నిన్నుకొట్టారు?"

గతంలో తను చేసిన తప్పొప్పులని పదే

పదే పునస్సమీక్షించుకుంటున్న వకుళ కళ్ళు చెమ్మగిల్లుతుండగా అంది,

"చాలా చెడ్డపనులు చేసాను."

"అయితే డాడీ మంచివారేనా? "

"చాలా. డాడీ నీ దగ్గరకి వస్తే ఐ మిస్ యు డాడీ అని చెప్పు. త్వరగా నన్ను, మమ్మీని నీ దగ్గరకి తీసుకెళ్ళు అని చెప్పు."

బెల్ మోగింది.

"చెప్పు. ఏం.. చెబుతావా? "

"అలాగే!" అన్నాడు వాడు బుద్ధిగా.

"ఇప్పుడు రాలేదు. సాయంకాలం లాంగ్ బెల్ తర్వాత వస్తారు. అప్పుడు మరిచిపోకుండా నేను చెప్పినవన్నీ చెప్పు."

"అలాగే మమ్మీ. బై!" వాడు క్లాసురూమ్ లోకి పరుగుతీసాడు. వకుళ ఒంటరిగా చెట్టుకింద నిలబడిపోయింది. వసంత్ కోసం ఆమె ఒళ్ళంతా కళ్ళయ్యాయి. 'అతను ఎందుకు రాలేదు. ఒకవేళ ఆఫీసయ్యాక సాయంకాలం వస్తాడేమో!' ఆమె గేటు దగ్గరకి నడిచింది. అతనికి తను దగ్గరవ్వాలి. అందుకు టింకూని వాడుకోవాలి. వసంత్ సాయంకాలం వస్తాడా లేక ఇప్పుడొచ్చి టింకూ క్లాసు టీచర్‌ని పర్మిషనడిగి వాడిని బయటికి తీసుకొస్తాడా?

ఆమె నిలబడిన చెట్టు కొమ్మల మధ్య నుంచి సూర్యకిరణాలు వాలుగా ఆమె తలపై పడుతున్నాయి. దాహం, ఆకలితో ఆమెకి నిస్త్రాణగా ఉంది. ఎదురు చూపు ఎంత బాధాకరమో మరోసారి అనుభవపూర్వకంగా తెలిసివచ్చింది. వసంత్‌తో పెళ్ళయిన దగ్గర నుంచి అతని నుంచి విడిపోయేవరకు అతనికోసం అలా ఎదురు చూస్తూనే వుండేది. ఆఫీసయ్యాక ఇంటికి ఎప్పుడూ వచ్చేవాడుకాదు. ఫ్రెండ్స్‌తో కాలక్షేపంచేసి రాత్రి పదిగంటలకి వచ్చేవాడు. ఆదివారాలయితే పొద్దుట బయటకి వెళ్తే ఏ అర్థరాత్రికో ఇల్లు చేరేవాడు. అతని కోసం ఎదురు చూపులో విసిగిపోయిన తన ఉక్రోషం కన్నీళ్ళ రూపంలో అనువాదమయ్యేది. అతనింటికి వచ్చాక ఇల్లు రణరంగమయ్యేది. మగవాడన్నాక ఫ్రెండ్స్ వుండరా అని అతను, ఇంటి దగ్గర మీకోసం భార్య అనే ప్రాణి ఎదురు చూస్తోందనే ఇంగితజ్ఞానం వుండదా అని తను వాదనకు దిగేవారు.

లాంగ్‌బెల్ అయింది. పిల్లలంతా బిలబిలలాడుతూ బయటకి వచ్చారు. కానీ అతను రాలేదు! ఆమెకి ఉక్రోషం, దుఃఖం తన్నుకొచ్చాయి.

"మమ్మీ!" టింకూ వచ్చి చెయ్యి పట్టుకున్నాడు.

ఉలిక్కిపడి తన కన్నీరు వాడి కంట పడకుండా ముఖం తుడుచుకునే నెపంతో రుమాలుతో వత్తుకుంది.

"డాడీ వస్తారన్నావు. రాలేదేం? "

వాడి పసిమనసులో తండ్రిపై ప్రేమను అంకురింపచేసి కొన్ని గంటలయినా కాలేదు. అప్పుడే వాడు అతని గురించి ఆలోచిస్తున్నాడు.

"చెప్పు మమ్మీ"

"ఏమో, ఇప్పుడు వస్తారేమో!" వాడి ముఖంలోకి చూస్తూ అంది. వాడిపోయిన ముఖంలో ఆకలి, అలసట స్పష్టమవుతున్నాయి. వాడిచేతిలో నుంచి కేరియర్, వాటర్ బాటిల్ వున్న బుట్ట తను అందుకుంది. బయట పార్క్ చేసివున్న స్కూటర్లపై తమ పిల్లలని ఎక్కించుకుని తల్లిదండ్రులు వెళ్తున్నారు. స్కూలు బస్సులన్నీ వెళ్ళిపోయాయి. వసంత్ జాడలేదు. "ఎందుకు రాలేదతను? ఆఫీసులో పని ఒత్తిడా? లేక కావాలనే రాలేదా? " అయోమయంగా చావని ఆశతో చుట్టూ వెతుకుతోంది. అతను ఇంక రాడని నిర్ధారించుకున్న ఆమెకి ఆశాభంగంతో కన్నీళ్లు వచ్చాయి. వసంత్ ఫోన్ అందుకున్న ఆతృతలో ప్రొద్దుట టిఫిన్ తినకుండా

బయలుదేరింది. ఉదయం తొమ్మిదిగంటల నుంచి సాయంకాలం అయిదు గంటల వరకు అతని కోసం ఎదురు చూస్తునే వుంది. కాని ఆ నిరీక్షణ వ్యర్థమయిపోయింది. ఆమెకి దుఃఖం వస్తోంది.

"పద" అంది టింకూ చెయ్యిపట్టుకుని.

"డాడీ" అన్నాడు వాడు.

"నోర్మూయ్ ! బయట నీ స్కూల్ ఆటో వుందో లేదో? కర్మ! ఇప్పుడు సిటీ బస్సెక్కి తగలడాలి" అనవసరంగా కొడుకు మీద విరుచుకుపడింది.

టింకూ బిత్తరపోయాడు. వాడి చెయ్యి పట్టి దాదాపు ఈడ్చుకెళ్ళింది. గేటు బయట వాడిని రోజూ స్కూల్ నుంచి ఇంటికి తీసుకెళ్ళే ఆటోలేదు. ఆకలి, అలసట, నిస్సత్తువ వీటన్నింటిని మించిన ఆశాభంగంతో నిండిన ఆమె మనసుని కోపం వశపరచుకుంది. వసంత్‌పై కోపం! తన మీద తనకే కోపం! చెయ్యి పట్టుకుని నడుస్తున్న టింకూ చేతిని విదిల్చికొట్టింది.

"నేను చచ్చేదాకా నా చేతిని పట్టుకుని నడుద్దామనుకున్నావా? స్వంతంగా నడవడం, స్వతంత్రంగా బతకడం నేర్చుకో. మీ నాన్నకి నువ్వు అక్కర్లేదు. నీ బాబు పోలికలే నీకూ వస్తే నువ్వూ నా ముఖం చూడవు. అందుకే నేను చచ్చాననుకుని ఒంటరిగా బతుకు"

అర్థం లేని కోపంతో అరుస్తోంది.

అది రోడ్డని మరచిపోయింది. పక్క నుంచి ఖాళీ ఆటో దూసుకువెళ్ళింది.

"వెధవా! ఎదురుగా ఆటో వస్తుంటే ఆపలేవు? ఇక్కడ నుంచి ఇంటిదాకా నడిచి వెళ్తావా? " వీపుపై ఛళ్ మని చరిచింది.

కెవ్వుమంటూ ఏడ్చాడు వాడు. దారిన పోయే వాళ్ళు విచిత్రంగా ఇద్దరినీ చూస్తున్నారు. అదేమీ గమనించే స్థితిలో లేదామె. వసంత్ రాలేదనే నిజమొక్కటే ముల్లులా ఆమె మనసుని పొడుస్తోంది.

"ఏడ్చావంటే చంపేస్తాను. అదుగో ఆటో వస్తోంది, పిలువు"

టింకూ బలవంతాన ఏడుపుని ఆపుకుని ఎక్కిళ్ళు పెడుతూ ఆటో వైపు చెయ్యివూపాడు. వాడి అదృష్టం బాగుండి ఆటో ఆగింది. వకుళ అడ్రస్ చెప్పింది. టింకూ తల్లి పక్కనే ఆమెకి తాకకుండా ఒక పక్కకి ఒదిగి కూర్చున్నాడు. ఆటో కదిలింది.

★ ★ ★

"పొద్దుటనగా వెళ్ళావు. మధ్యాహ్నం భోజనానికి రాలేదు. ఎక్కడికెళ్ళావే? " సూర్యకాంతమ్మ కూతురిని చూస్తూనే ఆత్రుతగా అడిగింది.

"నీకు చెప్పాలా? నీకు అప్రదిష్ట కలిగించే పనులేవీ చెయ్యలేదులే" విసురుగా అంది.

తెల్లబోయిందావిడ.

"ఇంకా నిలబడ్డావేంరా, వెళ్ళి స్నానం చెయ్యి" గుడ్లురిమి చూస్తూ చెయ్యెత్తేసరికి టింకూ బాత్‌రూమ్‌లోకి పరుగుతీసాడు. వాడి పుస్తకాల బ్యాగ్ ఫ్లయింగ్ సాసర్‌లా ఎగిరి టేబిల్ మీద పడింది. టిఫిన్ డబ్బావున్న బుట్ట మిస్సైల్‌లా ఎగిరి పెరట్లోపడింది.

కూతురి రౌద్రాకారాన్ని చూసి ఏం కొంపమునిగిందోనని సూర్యకాంతమ్మ గుండె దడదడలాడుతోంది.

టింకూ బకెట్టులోని నీళ్ళని ఆదరాబాదరాగా ఒంటిమీద వంపుకుని టవల్ చుట్టుకుని బయటకి వచ్చి భయం భయంగా చూస్తూ నిలబడ్డాడు.

"సబ్బురుద్దుకోలేదా? ఎక్కడ మురికి అక్కడేవుంది" ఎర్రబడిన కళ్ళతో మాడ్చేసేలా చూస్తూ అంది తీవ్రంగా. అసలే బిక్కచచ్చిపోయివున్నవాడు వస్తున్న ఏడుపుని దిగమింగుకుంటూ "మళ్ళీ స్నానం చేసిరానా మమ్మీ? " అనడిగేడు.

"రెండు బకెట్ల నీళ్ళు తగలెట్టింది చాలక

మళ్ళీ స్నానం చేస్తావా? నేను చచ్చాక మైలస్నానం చెయ్యి" ఉద్రేకంతో పిచ్చిదానిలా వూగిపోతోంది వకుళ.

"చాల్లే! నోర్ముయ్! ఇందాకటి నుంచి చూస్తున్నాను ఎందుకంత కోపం, ఎక్కడికెళ్ళావో చెప్పవు. పగలంతా తిండీ తిప్పలు మానేసి నువ్వు వెలగబెట్టిన రాచకార్యాలేమిటి? ఎవరి మీద నీకోపం? అభం శుభం తెలియని పసివాడి మీదనా? రోజూ వాడికి నువ్వు స్నానం చేయించేదానివి. ఇవాళేమయింది? వాడిని స్నానం చెయ్యమన్నావు. వాడికి చేతయినట్టు స్నానం చేస్తే వాడి మీద విరుచుకుపడతావా? పైగా నోటికొచ్చినట్టు ఆ తిట్లేమిటి? రా నాన్నా! నీకు నేను స్నానం చేయిస్తా" వుండబట్టలేని సూర్యకాంతమ్మ కూతురిని మందలించి టింకూని బాత్ రూమ్‌లోకి తీసుకెళ్ళింది.

వకుళ నట్టింట్లో శిలలా నిలబడింది. ఆవేశం అవమానంగా, అవమానం అసహాయతగా మారి దుఃఖం వచ్చింది.

వసంత్ రాలేదనే కోపాన్ని ఆ పసివాడిపై ప్రదర్శించడం ఎంత వరకు సమంజసం? ఎన్ని దెబ్బలు కొట్టింది వాడిని? సిగ్గుతో తల్లి ముందు, కాదు నాలుగేళ్ళ పసివాడి ముందు తలెత్తుకోలేక పోతోంది.

**వసంత్ రాలేదనే కోపాన్ని ఆ పసివాడిపై ప్రదర్శించడం ఎంత వరకు సమంజసం? ఎన్ని దెబ్బలు కొట్టింది వాడిని? సిగ్గుతో తల్లి ముందు. కాదు నాలుగేళ్ళ పసివాడి ముందు తలెత్తుకోలేక పోతోంది**

సూర్యకాంతమ్మ మనవడిని సముదాయిస్తూ స్నానం చేయించింది. బట్టలు తొడిగి తలదువ్వి తనే స్వయంగా టిఫిన్ తినిపించి పాలు తాగించింది. ఏ పని చేస్తున్నా టింకూ భయం భయంగా తననే చూడడం వకుళ దృష్టిని దాటిపోలేదు.

అకారణంగా అరిచి కేకలుపెట్టి కొట్టి తిట్టే తను వాడి దృష్టిలో బ్రహ్మరాక్షసి. అయినా అరిచి తనేం సాధించింది? అత్త మీద కోపం దుత్తమీద అన్నట్టు వసంత్ మీద కోపాన్ని పసివాడిపై చూపించింది. ఆ పసివాడి ముందు తన వ్యక్తిత్వం మరుగుజ్జు అయింది. తల దించుకుని కుమిలిపోతున్న కూతురి దగ్గరకి టిఫిన్ ప్లేటుతో వచ్చింది సూర్యకాంతమ్మ.

"టిఫిన్ తిను" మార్దవంగా అంది.

వకుళ తల ఎత్తలేదు.

"పొద్దుట నుంచీ నువ్వేమీ తినలేదు. తిను" లాలనగా అంది తల్లి. వకుళ కళ్ళలో నీళ్ళూరాయి. అవి తల్లి కంటపడకుండా వ్యర్థ ప్రయత్నం చేస్తూ అంది.

"నాకు తినాలని లేదు. అసలు బతకాలని లేదు"

"ఏమయింది? ఏం జరిగింది? ఎవరేమన్నారు? "

"ఎందుకు? చెప్తే నువ్వు ఆరుస్తావా తీరుస్తావా? " స్వరం జీరబోగా చప్పున బాత్‌రూమ్‌లోకి వెళ్ళి తలుపు మూసుకుని తనివి తీరా ఏడ్చింది. కన్నీళ్ళతో మనసుని, చన్నీళ్ళతో ముఖాన్ని ప్రక్షాళించుకుని బయటకి వచ్చేప్పటికి టింకూ అమ్మమ్మ చెవి దగ్గర ఏదో గుసగుసలాడడం కనిపించింది. తల్లిని చూసి వాడి నోట్లోని మాట నోట్లోనే ఆగిపోగా భయంగా పుస్తకంలో తల దూర్చాడు.

"పీక దాకా తిన్నావు! చదువుకోకుండా కబుర్లేమిటి నీకు? "

అప్పటికే వాడు జరిగినదంతా తల్లితో చెప్పి ఉంటాడనే అక్కసుతో అరిచింది.

"చాల్లే! పసిపిల్లాడి మీదనా నీ ప్రతాపం? మందలించింది సూర్యకాంతమ్మ. "ఇంత జరిగినా కన్నతల్లిని. నీ

సుఖం కోసం అనుక్షణం తాపత్రయపడే దాన్ని. నాకో ముక్క చెప్పవచ్చుగా? "

"ఏమిటి చెప్పేది? " విసురుగా అంది.

"వసంత్... స్కూలుకొచ్చి టింకూతో మాట్లాడతానన్నాడా? "

"అన్నాడు. కాని రాలేదు" కొడుకువైపు ఉరిమి చూస్తూ అంది.

"అసలు మీ ఇద్దరికీ మాటలెలా కలి సాయి? " కుతూహలంగా అడిగింది.

"అదేమీ చెప్పుకుని మురిసిపోయే గొప్ప కథేమీ కాదు. అయినా వేలెడు లేని వెధవ వీడికి అక్కర్లేనిదంటూ ఏమీ లేదు. అన్ని విషయాలూ కావాలి. జరిగినదంతా పూస గుచ్చినట్లు చెబుతున్నాడు కదూ? "

"వాడినెందుకు ఆడిపోసుకుంటావు? ఏం జరిగిందిరా? మీ అమ్మ ఎందుకలా ఉందని అడిగాను. పోన్లేమ్మా! వసంత్ మనసులో ఇన్నేళ్ళ తర్వాత టింకూపై ప్రేమ ఏర్పడడం శుభపరిణామమే కదా! భగవంతుడి దయ వలన మీరిద్దరూ ఒక టయితే అంతకంటే నాకేం కావాలి? టిఫిన్ తిను. కాఫీ కలిపి తెస్తా!" పైకి అల్లుడిని తిడుతున్నా లోలోన మళ్లీ కూతురు అల్లుడు ఒకటైతే బాగుండుననే కోరిక సూర్యకాంతమ్మది.

తల్లి మాటలు వకుళ చెవులలో అమృతం పోసినట్టయింది. ఇన్నాళ్ల తర్వాత వసంత్ టింకూని చూడాలనే అభి లాషని వ్యక్తం చెయ్యడం ఆశ్చర్యమే. వాడి కోసమైనా తనతో కలిసి ఉండాలనుకో వచ్చు. మామగారిని చూడ్డానికి హాస్పిట ల్‌కి వెళ్ళడం మంచిదయింది. తన చొరవవల్లే ఈ శుభపరిణామం. అలా అనుకోగానే ఆమెకి కొడుకు ముద్దొచ్చాడు.

"నాన్నా టింకూ!" అమాంతం వాడిని దగ్గరకి తీసుకుని వాడి ముఖాన్ని ముద్దు లతో ముంచెత్తింది. క్షణం క్రిందట తల్లి ఆగ్రహం, ఇప్పటి ప్రేమ ఏది నిజమో తెలి యక వాడు బిత్తరపోయాడు.

★ ★ ★

"ఆనంద్! నాకో నిజం చెప్పాలి" తల్లి అడగ్గానే ఆనంద్ చదువుతున్న పుస్తకాన్ని పక్కన పెట్టాడు.

"నీ దగ్గర నేనెప్పుడైనా అబద్ధం చెప్పా నామ్మా? "

"చెప్పలేదు. కాని కొన్ని నిజాలను తట్టు కునే శక్తి నాకు లేదురా. అది అబద్ధమ యితే బాగుండుననిపిస్తుంది"

"దేన్ని గురించమ్మా నువ్వు మాట్లా డేది? "

"నీకు... పిల్లలు పుట్టకపోవడానికి లోపం నీలో ఉందా? " అడగలేక అడి గింది.

"అవును. శిల్పకి, నాకు అన్ని పరీక్షలూ చేసిన డాక్టర్లు ఆ విషయాన్ని నిర్ధారిం చారు. నువ్వు నన్ను మళ్లీ పెళ్ళి చేసుకో మన్నా నేను విముఖత చూపించడానికి కారణం నేను శిల్పని మరచిపోలేకపోవడం ఒక్కటేకాదు. నా వలన మరే అమ్మాయికి అన్యాయం జరగకూడదని కూడా!"

"నీ నుదుటన భగవంతుడు ఎలాంటి రాత రాసాడురా! అయ్యో! నీ వంశం నిర్వంశమయిపోతుందా? ఏ పాపానికి శిక్షరా ఇది!" ఆవిడ కన్నీళ్లు పెట్టుకుంది.

ఆనంద్ తల్లిని పొదివి పట్టుకున్నాడు. ఓదార్చడానికి అతని దగ్గర మాటలులేవు. ఓదారిస్తే తీరే దుఃఖం కూడా కాదది. కొద్దిసేపటి తర్వాత ఆవిడ తేరుకుంది.

"నాన్నా! నందూ! నేనొకటి చెబుతాను వింటావా? నీకు జీవితంలో తోడు అవ సరం. నిన్ను నాన్నా అని పిలిచే పసివాడు ఈ ఇంట్లో తిరుగుతుంటే చూడాలని వుంది. వాడు నీ జీవితానికి ఆలంబన కావాలి. నీలోని లోపాన్ని దాచకుండా

చెప్పి అందుకు ఇష్టపడిన అమ్మాయిని పెళ్ళి చేసుకో. తర్వాత మీ కిష్టమైన ఆడ పిల్లనో, అబ్బాయినో దత్తత తీసుకోండి"

"డాడీ!" అంటున్న రాహుల్ గుర్తుకొచ్చాడు ఆనంద్‌కి. ఆ స్వరంలోని ఆర్తి, తనని అల్లుకున్న చిన్న చేతులలోని ఆత్మీయత గుర్తొచ్చి మనస్సు పులకించింది.

"ఏమంటావురా? " పరధ్యానంగా ఉన్న ఆనంద్ చేతిపై తట్టిందావిడ.

"ఆలోచిద్దాం"

"ఆలోచించడం కాదు. ముందు నేను నీకో మంచి అమ్మాయిని వెతుకుతాను. తర్వాత మీరిద్దరూ మీకు నచ్చిన బాబుని దత్తత తీసుకుందురు గాని"

"ముందే నేనెవరినైనా దత్తత తీసుకుంటే ఎలా ఉంటుంది? నా కొడుకుని తన బిడ్డగా ప్రేమించే గొప్పమనసు ఉన్న అమ్మాయి దొరికితేనే పెళ్ళి చేసుకోడం మంచిది. అవునా? "

"నిజమే. కాని ఇప్పటికిప్పుడు నీకు ఎవరి అబ్బాయిని దత్తత ఇస్తారు? ఎవరిని అడుగుతాం? " ఆలోచనలో పడిందావిడ.

★ ★ ★

మీనాకి నిద్ర పట్టడంలేదు. ఆనంద్ ఎప్పటికీ తండ్రి కాలేడనే నిజం ఆమెలో ఏవో కొత్తఆలోచనలని కలుగచేస్తోంది.

ఆనంద్, మళ్ళీ పెళ్లి చేసుకున్నా తండ్రి మాత్రం కాలేడు. అతను తన ఇష్టపూర్వకంగానో భార్య బలవంతం వలనో ఎవరినైనా దత్తత తీసుకుంటాడు. ఏ అనామకుడో అతని ఆస్తికి వారసుడవుతాడు. ఆనంద్ అమెరికా నుంచి రాగానే తల్లికి పాతిక లక్షల రూపాయలిచ్చి ఇంటి స్థలాలో, రెండు ఫ్లాట్లో కొనమని చెప్పాడని భర్త ద్వారా వింది. అంత ఆస్తి ఏ అనామకుడికో పట్టం కడితే చూస్తూ వూరుకోవడమా? ఆమె తన పక్కన నిద్ర పోతున్న బంటీని చూసింది. నిద్రలో అమాయకంగా నవ్వుకుంటున్నాడు వాడు. వాడినే చూస్తున్న ఆమె మనసులో ఒక ఆలోచన అంకురించింది. క్షణాలలో అది నిశ్చయంగా బలపడింది. ఆమె గాఢనిద్రలో వున్న భర్తని లేపింది.

బద్ధకంగా కళ్లు విప్పాడు అచ్యుత్.

"ఏమిటి మీనా? "

"మీతో కొంచెం మాట్లాడాలి"

"ఇప్పుడా? రేపు పొద్దుట మాట్లాడుదువుగానిలే"

"కాదు. ఇప్పుడే మాట్లాడాలి"

"ఏమిటో చెప్పు" బద్ధకంగా ఆవలిస్తూ అడిగాడు.

"బంటీని పెంచుకోమని ఆనంద్‌ని అడగండి. అడగడం కాదు ఒప్పించండి"

"బంటీనా? ఆనంద్ దత్తత తీసుకోవాలా? నీకేమైనా మతిపోయిందా? " నిద్ర మత్తు వదిలిపోయిందతనికి.

"తప్పేం వుంది? ఆనంద్‌కి తండ్రయ్యే యోగమెలాగో లేదు. అమెరికాలో బోలెడు సంపాదిస్తున్నాడు. మొన్నటికి మొన్న మీ అమ్మగారికి పాతిక లక్షలిచ్చాడా? ఇదిగాక అమెరికాలో ఇంకెంత దాచుకున్నాడో? అతని ఆస్తిని ఏ అనాథకో ధారాదత్తం చెయ్యక ముందే మన బంటీని దత్తత తీసుకోమందాం"

"వాడి ఆస్తిని అనాథకి ఇవ్వడమేమిటి? నీకేమైనా మతిపోయిందా? "

"మీ తమ్ముడు మళ్ళీ పెళ్లి చేసుకున్నా ఎప్పటికీ తండ్రి కాలేడు. ఏ అనాథనో దత్తత తీసుకోకుండా వుంటాడా? "

"అసలు వాడికి మళ్లీ పెళ్లి చేసుకునే ఉద్దేశం వుందో లేదో? అన్నీ నువ్వు ఊహించుకోడమేనా? "

"ఏం ఎందుకు చేసుకోడు? ఎన్నాళ్ళు ఒంటరిగా వుంటాడు? మీ అక్క చాలా

తెలివైనది. ఆనంద్ ఆస్తికోసం వసంతనిచ్చి పెళ్లి చేయ్యాలనుకుంది. పాపం! ఆవిడ ప్లాన్ బెడిసికొట్టింది."

"మనకి మాత్రం ఏ పది మంది పిల్లలున్నారని? అనిల్, బంటీ ఇద్దరేగా"

"బంటీని ఆనంద్‌కి దత్తత ఇస్తే మనకి అనిల్ వుంటాడు. అయినా మనం ఎవరో పరాయివాళ్లకి మన బంటీని ఇవ్వడం లేదుగా? మీ తమ్ముడికేగా? "

అచ్యుత్ నిద్రపోతున్న బంటీని చూసాడు. అతని మనసు ఆర్ద్రమయింది. వీడిని విడిచి తనుండగలడా?

"ఏమిటాలోచిస్తున్నారు? "

"అసలు నువ్వు బంటీని విడిచివుండగలవా అని? "

"మనం ఇక్కడకి వస్తూ అనిల్‌ని మెద్రాస్‌లో ఎవరి ఇంట్లోనో వదిలి రాలేదూ? "

"ఏదో పది రోజులు వదిలి రావడం వేరు. ఏకంగా దత్తత ఇవ్వడమంటే? "

"బయటి వాళ్లకి ఇస్తున్నామా ఏమిటి? అనంద్‌కేగా"

అచ్యుత్ ఆలోచనలో పడ్డాడు. అతన్ని తమ్ముడి ఆస్తి పాస్తులు వూరిస్తున్నాయి. బంటీని వదులుకోలేని బలహీనత మరో వైపు. అతను కూడా మామూలు మనిషే. తమ్ముడి ఆస్తికి తన కొడుకుని వారసుడిగా చెయ్యాలనే స్వార్థం ముందు పితృప్రేమ ఓడిపోయింది.

★ ★ ★

ఆ రాత్రి సూర్యకాంతమ్మ కూతురు చెప్పిన విషయాలని ఆనందంగా వింది.

"ఎంత కర్కోటకుడికైనా పిల్లల మీద ప్రేమ వుండదుటే? అసలు టింకూ పుట్టినప్పుడు వసంత్ వాడిని ఎత్తుకుని దించేవాడా? ఏ దుష్టఘడియలోనో మీ ఇద్దరికీ గొడవలు వచ్చాయి. తెగేదాకా లాక్కున్నారు. పోన్లే తల్లీ, ఇప్పటికైనా మంచి రోజులు వచ్చాయి"

"వసంత్ ఇవాళ స్కూలుకి రాలేదుగా? దిగాలుగా అంది వకుళ"

"అతనికేం అర్జెంటు పని పడిందో, ఇవాళ కాకపోతే రేపు వస్తాడు. చూస్తూండు"

తెల్లవారింది. టింకూని తయారుచేసి స్కూలుకి పంపింది. మళ్ళీ ఆలోచనలు. ఇవాళయినా వసంత్ టింకూ కోసం స్కూల్‌కి వస్తే బాగుండును. వస్తే ఏం మాట్లాడతాడో ఈ వెధవ. ఆయనకి ఏం జవాబులిస్తాడో? మనసులోని బాధని తల్లి దగ్గర వెళ్ళ గక్కింది.

"ఊరికే ఆందోళన పడకు. పిచ్చికోపం తగ్గించుకో! పిల్లవాడిని తిట్టి కొట్టి బెదరగొడితే వాడు నీకు దూరమయిపోతాడు."

వకుళకి నిన్నటి తన ప్రవర్తనకి సిగ్గు, పశ్చాత్తాపం కలిగాయి.

ఇవాళ వసంత్ టింకూ దగ్గరకి వస్తాడని చెబుతోందామె మనసు. అప్పటికప్పుడు స్కూలుకి వెళ్లాలనే బలీయమైన కోరికని ఎలాగో అణచుకుంది. రోజంతా అస్థిమితంగా గడిపిన ఆమె ఇంటిముందు ఆటో ఆగడం, టింకూ రావడం కూడా గమనించలేదు.

టింకూ లోపలికి వస్తూనే 'అమ్మా' అని పిలిచాడు. వాడికళ్ళు వెలిగిపోతున్నాయి. "డాడీ ఇవాళ మా స్కూల్‌కి వచ్చారు"

"డాడీని నువ్వెలా గుర్తుపట్టావు? " అనుమానంగా అడిగింది.

"నువ్వోసారి ఫోటో చూపించావుగా? "

"ఏమన్నారు నీతో, ఏం మాట్లాడారు? "

"ఎలా చదువుతున్నావని అడిగారు"

"నువ్వేం చెప్పావు"

"నేనే క్లాసు ఫస్టని చెప్పాను".

"ఇంకేం ఆడిగారు" ఆతృతగా అడిగింది.

"నాదగ్గరకి వచ్చేస్తావా అని అడిగారు"

"ఏం చెప్పావు? "

"అమ్మ నీ దగ్గరకి వస్తే నేనూ వస్తానన్నాను"

"డాడీ ఏమన్నారు? " వకుళ గుండె గొంతులో కొచ్చింది.

"చాక్లెట్ ఇచ్చి ముద్దు పెట్టుకున్నారు" ఫైవ్‌స్టార్ చాక్లెట్టు చూపించాడు.

"అంతేనా? ఏమీ అనలేదా? "

"ఏమీ అనలేదు"

వకుళకి ఒక క్షణం నిరాశగా అనిపించినా మళ్ళీ ఏదో ఆశ. వసంత్ మనసులో టింకూపై మమకారం ఉంది. వాడిని తన దగ్గరకి వచ్చెయ్యమన్నాడంటే తన గురించి ఆలోచిస్తాడు. తనతో కలిసి వుండాలనుకున్నా అప్పుడే బయటపడదు. మగవాడు కదా, ఆ మాత్రం అహం వుంటుంది. ఆ రాత్రి టింకూని పక్కలో పడుకోబెట్టుకుని వాడి తల నిమురుతూ అంది.

"రేపు డాడీ మళ్ళీ నీ దగ్గరకొచ్చి నిన్ను తన దగ్గరకి రమ్మని అడిగారనుకో. అమ్మ- నువ్వు- నేను ఒకే ఇంట్లో కలిసివుందాం డాడీ అని చెప్పు. అర్థమయిందా"

"మన ముగ్గురం కలిసి ఒకే ఇంట్లోనా! భలే భలే!"

**"రేపు డాడీ మళ్ళీ నీ దగ్గరకొచ్చి నిన్ను తన దగ్గరకి రమ్మని అడిగారనుకో. అమ్మ- నువ్వు- నేను ఒకే ఇంట్లో కలిసివుందాం డాడీ అని చెప్పు. అర్థమయిందా"**

**"మన ముగ్గురం కలిసి ఒకే ఇంట్లోనా! భలే భలే!"**

"అవును. నువ్వు ఎదురింటి సంతోష్ లాగా, నీ ఫ్రెండ్ రాములాగా డాడీ స్కూటర్ మీద సినిమాకి, జూకి, అప్పుడప్పుడు స్కూల్‌కి వెళ్ళచ్చు"

టింకూ కళ్ళు వెలిగిపోతున్నాయి. వాడి ఊహలలో తల్లీ తండ్రితో తను చెయ్యబోయే షికార్లు కనిపిస్తున్నాయి. వకుళ కూడా ఊహలలో తేలిపోతోంది.

★ ★ ★

"బాబాయ్! నేను నీ దగ్గర పడుకుంటాను" అంటూ తన గదిలోకి వచ్చిన బంటీని ఆనంద్ ఆశ్చర్యంగా అడిగాడు.

"నా దగ్గర పడుకుంటావా? నీకు అమ్మ దగ్గర పడుకోడం అలవాటు కదరా? "

"నీ దగ్గర పడుకోమని అమ్మే పంపింది"

"రా మరి..." వాడిని ఎత్తుకుని పక్కలో పడుకోబెట్టుకున్నాడు.

"బాబాయ్! నన్ను నువ్వు అమెరికా తీసుకెళ్తావా? "

"నీకు నాతో అమెరికా రావాలని వుందా? " నవ్వుతూ అడిగాడు ఆనంద్.

"ఊహు! అమ్మదగ్గర వుండాలనిపిస్తోంది"

"మరి నాతో అమెరికా వస్తానంటున్నావు"

"మా అమ్మ పంపిస్తానంటోంది"

"నువ్వు అల్లరిచేసి మీ అమ్మని విసిగించి వుంటావు."

"లేదు అల్లరి కొంచెమే చేసాను."

"మీ అమ్మ నిన్ను నాదగ్గరకి పంపదులే! పడుకో! నిద్రపో" వాడితల నిమురుతూ అన్నాడు.

కాస్సేపు పైకప్పుని, మరి కాస్సేపు నాలుగు గోడలని మార్చిమార్చి చూసాడు.

"అమ్మకావాలి బాబాయ్!"

"అమ్మ దగ్గర పడుకుంటావా, వెళ్ళు"

"నీ దగ్గర పడుకోబోతే అమ్మ కొడతానంది"

"ఊరికే అని ఉంటుందిరా"

"కాదు. నిజంగానే కొడతానంది"

"మరి పడుకో"

"నిద్ర రావడంలేదు."

"కథ చెప్పనా? "

కథ అనే సరికి ఉత్సాహంగా చూసాడు.

ఆనంద్ తను చిన్నప్పుడు చదివిన చందమామలోని కథని గుర్తుచేసుకుంటూ కథ చెప్పడం మొదలుపెట్టాడు. వాడి ముఖంలో ఆసక్తి, ఉత్సాహం లేకపోవడం గమనించి తన నెరేషన్ ఎఫెక్టివ్‌గా లేదని అర్థమయిందతనికి. కథ పూర్తయ్యేసరికి వాడి కళ్ళు మూతలు పడుతున్నాయి. కాస్సేపటిలోనే నిద్రలోకి జారుకున్నాడు.

ఆనంద్‌కి నిద్ర పడుతుండగా 'అమ్మా' అనే బంటీ పిలుపు ఏడుపులా వినిపించి ఉలిక్కిపడి కళ్లు విప్పాడు.

"అమ్మా! నేను నీ దగ్గరే వుంటానమ్మా! అమెరికా వెళ్ళను" వాడు కలవరిస్తున్నాడు.

ఆనంద్‌కి జాలేసింది.

బంటీ అల్లరి చేస్తే వదిన వాడిని తనతో పంపించేస్తానని బెదిరించి వుంటుంది. అది వాడి మనసుని గాయపరిచింది. పిల్లలు అల్లరి చేసినప్పుడో అన్నం తిననని మారాం చేసినప్పుడో చాలామంది తల్లిదండ్రులు బూచాడికి అప్పగిస్తామనో, చీకటి గదిలో పెడతామనో బెదిరిస్తారు. ఆ భయం వాళ్ల లేత మనసులని ఎంత ప్రభావితం చేస్తుందో వాళ్ళూహించరు. బంటీని అమెరికా పంపించేస్తానన్న వదిన బెదిరింపు వాడిని నిద్రలో కూడా ఉలిక్కిపడేలా చేస్తోంది. అతను వాడిని దగ్గరగా తీసుకున్నాడు.

★ ★ ★

"ఏమయ్యా రాత్రి నిద్రపట్టలేదా?" అడిగింది మీనా.

"అదేమిటొదినా... అలా అడుగుతున్నావ్?"

"నీ వాలకం చూస్తే రాత్రంతా నిద్రపోనట్టుంది"

"నిజమే, నిద్ర పట్టలేదు. బంటీ ఒకటే కలవరింతలు"

"కలవరించాడా? ఏమని?"

ఆనంద్ చెప్పాడు "వాడిని నాతో అమెరికా పంపించేస్తానని భయపెట్టావా?"

"నీతో అమెరికా రావడానికి భయమెందుకూ? నేనేదో వాడిని అరబ్ కంట్రీకి అమ్మేస్తున్నట్టు.. వెధవ గొడవ వాడూను" విసుగ్గా అంది.

"వాడిని నిజంగా నాతో పంపిచేస్తానన్నావా? అల్లరి చేస్తే బెదిరించావా?"

మీనా ఏదో అనబోయింది. అచ్యుత్ కళ్ళతోనే వారించాడు. ఆమె చప్పున అక్కడనుంచి వెళ్లిపోయింది.

★ ★ ★

"ఏం ఆలోచించావ్ సరితా?" మాధవి హఠాత్తుగా అలా అడిగే సరికి సరిత అయోమయంగా చూసింది.

"ఏ విషయం మేడమ్?"

"ఆనంద్‌ని నువ్వు పెళ్లి చేసుకునే విషయం"

ఒంట్లోని రక్తమంతా చివ్వున ముఖంలోకి ఎగతన్నినట్లు ఎర్రబడి పోయిందామె ముఖం. "ఇంక ఆలోచించడానికేమీ లేదు. నా సమాధానాన్ని ఆ రోజే చెప్పాను మేడమ్"

"ఒక్క విషయం చెప్పు. మనం రోడ్డు మీద నడుస్తున్నప్పుడు ఏ ఆటోనో మనకి డేష్ ఇచ్చి వెళ్లిపోతుంది. ఆ యాక్సిడెంట్‌లో కాలో, చెయ్యో విరుగుతుంది. అలా అని ఇంక రోడ్డు మీద నడవడమే మానేస్తామా?"

"జీవితంలో పెళ్లి ఒక్కసారే మేడమ్! ఆ పెళ్లి నాకు చేదు అనుభవాన్నే మిగిల్చింది. ఇంక చేదుని భరించే శక్తి, ఓపిక నాకు లేవు"

"లిజన్ టుమి"

"మేడమ్ ప్లీజ్!" సరిత చేతులు జోడించింది.

మాధవి మరి మాట్లాడలేకపోయింది.

ఆనంద్ పునర్వివాహం పట్ల సుముఖంగా వున్నాడో లేదో తెలుసుకోకుండా పదే పదే సరిత దగ్గర ఆ విషయాన్ని ప్రస్తావించడం అనవసరం అనుకుంది. ఆ సాయంకాలం ఆఫీసునుంచి నేరుగా వర్ధనమ్మగారింటికి వెళ్ళింది.

మీనా, అచ్యుత్ సంభ్రమంగా పలుకరించారామెని.

"అరె! మాధవీ! వాటే ప్లజంట్ సర్ ప్రైజ్! నువ్విక్కడ ఈ వూళ్లో..."

"మాధవి ఇక్కడే ఉద్యోగం చేస్తోందని చెప్పాను కదురా? ఏమిటి తెగ ఆశ్చర్యపోతున్నావ్? " అంది వర్ధనమ్మ.

"అవునవును. మరిచేపోయాను. సారీ మాధవీ. ఎప్పటికప్పుడు మీ ఇంటికొద్దామనుకుంటూనే అశ్రద్ధ చేసేసాను. అశ్రద్ధ కూడా కాదు బద్ధకం"

"నువ్వేమీ మారలేదు అచ్యుత్!" అంది మాధవి నవ్వుతూ.

"నిజమే! వాడి బద్ధకం వయసుతో బాటు పెరిగిపోతోంది. ఇక్కడ కొచ్చి వారం రోజులయినా నిన్ను చూడ్డానికి మాత్రం రాలేదు"

"ఫర్వాలేదాంటీ! నేను అచ్యుత్‌ని చూడ్డానికి వచ్చాను కదా! ఆనంద్ ఏడీ? "

"నువ్వు మా ఇంటికొస్తావని గాలి చెప్పిందోయ్! బజ్జీలు వేస్తున్నాను" కిచెన్‌లో నుంచి చెప్పాడు.

"వద్దురా అంటే వినడు. అమెరికాలో చెయ్యి కాల్చుకున్నది చాలక నాకు హెల్ప్ చేస్తానని వంటింట్లోకి తయారు"

"అమెరికాలో ఇన్నేళ్లుగా వంట చేస్తున్నా ఒక్కసారి కూడా చెయ్యి కాల్చుకోలేదు". నవ్వుతూ కిచెన్‌లో నుంచి బయటికొచ్చాడు. వర్ధనమ్మ బజ్జీలు ప్లేట్లలో సర్ది తెస్తుంటే తను కూడా హెల్ప్ చేసింది మాధవి. కాఫీ తాగాక ఆనంద్ వైపు చూస్తూ అంది.

"ఆనంద్! నీకేమయినా పని వుందా? "

"నాకేం పని వుందిక్కడ? మూడుపూటల తినడం తప్ప"

"నాతో షాపింగ్‌కు వస్తావా? "

"నేనూ వస్తాను. ఇక్కడ చీరలు డిస్కౌంట్ సేల్ పెట్టారుట, చూస్తాను" అంది మీనా.

మాధవి ఆనంద్ వైపు చూసింది. ఆమె చూపులలోని భావాన్ని గ్రహించిన అతను "చీకటి పడ్డాక చీరల రంగులేం తెలుస్తాయి వదినా! రేపు ఉదయం వెళ్దాంలే!" అని "రా మాధవీ మనం వెళ్దాం" అన్నాడు.

ఇద్దరూ బయలుదేరారు.

వాళ్ళిద్దరూ కనుమరుగయ్యేవరకు అటే చూసిన మీనా అంది.

"ఆనంద్‌కి మాధవి అంటే చాలా ఇష్టం కద త్తయ్యా!"

"అవును. వాళ్ళిద్దరూ చిన్నప్పటి నుంచి కలిసి పెరిగారు"

"మాధవిని ఆనంద్ పెళ్ళి చేసుకునే ఉద్దేశంలో వున్నాడా? "

వర్ధనమ్మ చివ్వున తల ఎత్తింది.

"తప్పేం వుందత్తయ్యా... ఆనంద్‌కి భార్య పోయింది. మాధవికి భర్త పోయాడు. వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకుంటే తప్పేం వుంది? పైగా మాధవికి బోలెడు ఆస్తి వుంది కూడా"

"తప్పేం వుంద త్తయ్యా... ఆనంద్‌కి భార్య పోయింది. మాధవికి భర్త పోయాడు. వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకుంటే తప్పేం వుంది? పైగా మాధవికి బోలెడు ఆస్తి వుంది కూడా"

"పొరపాటుగా కూడా అలా మాట్లాడకు. మాధవి ఆనంద్ అన్నా చెల్లెళ్ళలా పెరి

గారు. అసలా ఊహే తప్పు" మందలింపుగా అంది వర్ధనమ్మ.

"సారీ అత్తయ్యా!" తేలిగ్గా అనేసింది మీనా.

★ ★ ★

"నీతో మాట్లాడాలనే షాపింగ్ వంకతో నిన్ను బయటకి తీసుకొచ్చాను" అంది మాధవి.

"నాకు తెలుసు. ఊహించాను. నేను కూడా నీతో మాట్లాడాలనే వచ్చాను"

"ఏ విషయం? "

"నేను ఎవరినైనా దత్తత తీసుకోవాలనుకుంటున్నాను"

"అదేమిటి ఆనంద్ నువ్వు ఎవరినో పెంచుకోవడమేంటి? పెళ్ళిచేసుకుంటే కావాలనుకున్నంత మంది పిల్లల్ని కనచ్చు"

"భగవంతుడు అందరికీ అన్నీ ఇవ్వడు" ఎటో చూస్తూ అన్నాడు. క్షణం ఆగి అతనే అన్నాడు, "నాకు పెళ్ళి చేసుకోవాలని లేదు. కాని నాకు పిల్లలు కావాలి. నన్ను నాన్నా అని పిలిచే బాబు కావాలి. మాధవీ ఇలా అడగవచ్చో అడగకూడదో తెలియదు. నేను రాహుల్‌ని దత్తత తీసుకోవాలనుకుంటున్నాను"

"రాహుల్‌నా? సరిత వాడిని నీకెలా ఇస్తుందనుకున్నావ్? "

"అడిగి చూడు"

"అనవసరం. ఆమె ఇవ్వదు. రాహుల్ ఆమె సర్వస్వం. ఒక రకంగా ఆమె వాడి కోసమే బతుకుతోంది"

ఆనంద్ క్షణం మూగబోయాడు. ఆశా భంగంతో అతని మనసు మూలిగింది.

"వాడు ఏ ముహూర్తంలో నన్ను 'డాడీ' అని పిలిచాడో... ప్రతీక్షణం వాడే గుర్తుకొస్తున్నాడు"

"రాహుల్‌ని బిడ్డగా స్వీకరించాలనుకుంటున్నావు. సరితని పెళ్ళి చేసుకోరాదా? "

"ప్లీజ్ మాధవీ! మరోసారి నా దగ్గర పెళ్ళి ప్రస్తావన తీసుకురాకు. శిల్పని మరిచిపోడం అసాధ్యం"

మాధవి నిట్టూర్చింది.




వకుళ లాయర్ శశిభూషణం దగ్గరకి వచ్చింది. "నేను వసంత్‌ని కలుసుకున్నాను"

ఆయన సంభ్రమంగా చూసారు. "ఏమంటాడతను? "

"అతనికి నాపై ఎలాంటి అభిప్రాయం వుందో తెలియదు. అతను తిరిగి వైవాహిక జీవితాన్ని పునరుద్ధరించాలనుకుంటున్నాడో లేదో తెలియదు. కాని నాతో ఫ్రెండ్లీగా మాట్లాడుతున్నాడు. గతంలో నాపై కనబరిచిన కోపం, తిరస్కారం ఇప్పుడు మచ్చుకైనా కనబడడంలేదు. స్కూలుకి వెళ్ళి టింకూని కలుసుకున్నాడు. వాడిని తన దగ్గరకి వచ్చెయ్యమని అడిగాడు. టింకూకి తండ్రి ప్రేమ కావాలి. అలా అని వాడు నన్ను వదులుకోలేడు. వాడికి అమ్మా నాన్న ఇద్దరూ కావాలి. ఆ విషయం అతనికి తెలియచెప్పాలి."

"ఈసారి అతన్ని కలుసుకున్నప్పుడు ఆ విషయం చెప్పమ్మా"

"నేనా! నో! నేను చెప్పనంకుల్! అతని ఉద్దేశమేమిటో తెలియనిదే నేను బయట పడదలచుకోలేదు" క్షణం ఆగి అంది.

"మీరు అతనితో మాట్లాడతారా? " సంకోచిస్తూనే అడిగింది.

"తప్పకుండా మాట్లాడతాను. మీరిద్దరూ ఒకటయితే నాకంటే సంతోషించే వాళ్ళెవరూ వుండరు"

"అంకుల్! కాని ఒక్క విషయం, అతని మనసులోని ఉద్దేశమేమిటో తెలిసేవరకు నేనతనితో జీవితాన్ని పంచుకోవాలనుకుంటున్న విషయం బయటపెట్టవద్దు"

"సరేనమ్మా!" అన్నాడాయన.

అన్నట్లుగా కొద్దిరోజులకే ఆయన వసంత్‌ని కలిశాడు.

"నమస్కారం లాయర్‌గారూ!" శశిభూషణాన్ని ఆహ్వానించాడు వసంత్.

ఆయన అయిదు నిముషాలు పిచ్చాపాటీ మాట్లాడాక నేరుగా విషయంలోకి వచ్చాడు.

"నేను వకుళ తరపు లాయర్‌గా కాదు, మీ శ్రేయోభిలాషిగా వచ్చాను"

"చెప్పండి" అన్నాడు వసంత్. ఈ సంభాషణ ఎటు మళ్లుతుందో అతనికి తెలుసు.

"ఏం.. విడాకులు తీసుకుని పొరపాటు చేసానని వకుళ అనుకుంటోందా?" వసంత్ నవ్వుతూనే అడిగినా ఆ మాటలలో వ్యంగ్యం ధ్వనించిందాయనకి.

"...అప్పట్లో వకుళకి విడాకులిప్పించడానికి లాయర్‌గా నా వృత్తి ధర్మాన్ని నెరవేర్చాను. మీ విడాకులయి దాదాపుగా ఏడాదిన్నర కావస్తోంది. ఈ ఏడాదిన్నర కాలంలోను ఒక్కసారైనా నీకు విడాకులు తీసుకుని పొరపాటు చేశానేమో అనిపించలేదా? కనీసం నీ రక్తం పంచుకుని పుట్టిన టింకూ అయినా నీకు గుర్తు రాలేదా? "

"ఏం.. విడాకులు తీసుకుని పొరపాటు చేసానని వకుళ అనుకుంటోందా? " వసంత్ నవ్వుతూనే అడిగినా ఆ మాటలలో వ్యంగ్యం ధ్వనించిందాయనకి.

"వకుళ సంగతి వదిలెయ్యి. నీ సంగతి చెప్పు"

"టింకూ గుర్తురాకేం? చాలాసార్లు గుర్తొచ్చాడు"

"వాడికి తండ్రి ప్రేమ అవసరమని నీకు అనిపించడం లేదా? "

"ఆ విషయం వకుళకీ గుర్తుండి వుండాలిగా? టింకూకి తల్లి, తండ్రి ఇద్దరూ కావాలనే స్పృహ వుంటే విడాకుల కోసం కోర్టుకి ఎక్కేదే కాదు. విడాకులకి అప్లై చేసాక ఆరునెలలు కాలంలో మాలో ఎవరమైనా అప్లికేషన్‌ని ఉపసంహరించుకోడానికి కోర్టు టైమ్ ఇచ్చింది. అప్పుడైనా ఆమె మనసు మార్చుకోవచ్చుగా? "

"నిజమే! ఆ విషయంలో నేనూ వకుళకి నచ్చచెప్పాను. కాని, ఫలితం లేకపోయింది. పోన్లే గతాన్ని వదిలెయ్యి. టింకుకి తల్లి ప్రేమ ఎంత అవసరమో తండ్రి ప్రేమ కూడా అంతే అవసరం. తండ్రిగా నీ బాధ్యతని గుర్తించు"

"టింకూ సంరక్షణ బాధ్యతని వహించడానికి నేనెప్పుడూ సిద్ధమే"

"కాని వాడికి తల్లి కూడా కావాలి"

"అంటే? మీరు మమ్మల్ని తిరిగి కలిసి జీవించమంటున్నారా? "

"అవును"

"అదెలా సాధ్యం? "

"మీరిద్దరూ చట్టబద్ధంగా పెళ్లి చేసుకుని భార్యాభర్తలు కావచ్చు"

"కాని ముందుగా విడాకులు కోరుకున్నది వకుళే"

"నిజమే! ఆమె నీ అహాన్ని దెబ్బ తీసింది. కాని, టింకూ కోసమైనా సర్దుకుపోలేరా? "

"మమ్మల్ని తిరిగి కలవమని మీరు చెబు



తున్నారా? వకుళ కోరుకుంటోందా?"

"నేనింకా వకుళ దగ్గర ఈ విషయాన్ని ప్రస్తావించలేదు. ఆమధ్య మాటల్లో టింకూ నిన్ను చాలా మిస్ అవుతున్నాడని చెప్పింది. మీరిద్దరూ కలిస్తే బాగుంటుందని నాకే అనిపించింది. నీకు అంగీకారమైతే వకుళతో మాట్లాడతాను"

"నాకు ఇష్టమే"

ఆయన తృప్తిగా నిశ్వసించాడు. "అయితే నేను వకుళతో మాట్లాడతాను"



అంటూ సెలవు పుచ్చుకుని వకుళ ఇంటికి హడావిడిగా పరుగెత్తుకొచ్చాడాయన.

"అమ్మాయ్ వకుళా! నాకు మంచి పార్టీ ఇవ్వాలి నువ్వు. పార్టీ మీ ఆయనతో కలిసి ఇద్దువుగానిలే ముందు నోరుతీపి చెయ్యి" అంటూ వచ్చిన శశిభూషణాన్ని చూసి వకుళకు ఆనందంతో నోటమాట రానట్టయింది. తను విన్నది కలా నిజమా అనే అయోమయం.

"మీరు చెప్పేది..."

"నేను వసంత్ దగ్గర నుంచి వస్తున్నాను" అని ఆయన అతనితో తన సంభాషణనంతా చెప్పాడు.

"నిజమా, అంకుల్" ఉద్వేగంగా అడిగింది.

"నిజం తల్లీ! కావాలంటే ఇప్పుడే నువ్వు వసంత్‌తో మాట్లాడు" ఆయన జేబులో నుంచి సెల్ తీసి ఆమె కిచ్చాడు.

వకుళ ఫోన్ చేసింది. అవతల వసంత్ హలో... అనగానే "మీరు... మీరు... నిజంగానా?" అంది. ఆమె స్వరం ఎనలేని సంతోషంతో కంపిస్తోంది. హఠాత్తుగా దుఃఖం ముంచుకొచ్చింది ఆమెకి. గుండె నిండిన ఆనందంతో వచ్చిన కన్నీళ్ళవి.

"హలో! వకుళా మాట్లాడు" అంటున్నాడు వసంత్. వకుళకి మాటలు కరువయ్యాయి. ఆనందోద్వేగాలతో మూగదయింది.

శశిభూషణం ఆమె చేతిలో నుంచి ఫోన్ తీసుకున్నాడు.

"హలో! నేను శశిభూషణాన్నయ్యా! వకుళ పిచ్చిది. ఆనందాన్ని తట్టుకోలేకపోతోంది. కొద్దిసేపయ్యాక మాట్లాడుతుందిలే"

వసంత్ నవ్వేడు, "ఓకే" అని ఫోన్ పెట్టేసాడు. వకుళ మనసు సంతోషంతో నర్తించే మయూరమయింది. ఈరోజు కోసం ఎన్నాళ్లు ఎదురు చూసింది? ఆ శుభ తరుణం వచ్చేసరికి మాటలు రావేం?

"మీ దయవలన మళ్లీ ఇద్దరూ ఒకటవబోతున్నారన్నయ్యగారు! మీ రుణం తీర్చుకోలేం" అంది సూర్యకాంతమ్మ ఆనందబాష్పాలతో.

"అంతా ఆ భగవంతుని దయ. మనం

## మాటకు మాట

ఆ లేడీస్ కాలేజీలోని అమ్మాయిలంతా కొంటె కోణంగులు. హోమ్‌సైన్స్ బోధించడానికి కొత్తగా వచ్చిన లెక్చరర్ ఒకామె ఇంట్లో వాడే రెండు బ్రష్‌లను గురించి వివరించేటప్పుడు ఓ కొంటె కోణంగి ఓ బ్రష్ వెంట్రుకలను చేత్తో తాకిచూస్తూ 'మేడమ్.. పందివా? మనిషివేమో అనుకున్నాను' అంది ద్వంద్వార్థం వచ్చేలా.

లెక్చరర్ కాలేజీకి కొత్తామె కానీ ఇలాంటి వాటికి కాదు. అందుకే వెంటనే 'అవును వమ్మా పందివే! మనిషివి కావు' అని జవాబిచ్చింది.



నిమిత్తమాత్రులం. వీలు చూసుకుని నువ్వు, వసంత్ రిజిస్ట్రార్ ఆఫీసుకు వెళ్ళి మీ పెళ్ళికి అప్లికేషన్ పెట్టుకోండి. వస్తానమ్మా!" ఆయన వెళ్ళిపోయారు.

"అదృష్టవంతురాలివి తల్లీ! నీ జీవితానికి పట్టిన గ్రహణం తొలగింది" అంది సూర్యకాంతమ్మ కూతురి తల నిమురుతూ.

వసంత్ ఇంత త్వరగా రాజీకి వస్తాడని ఊహించలేదు వకుళ. పట్టరాని సంతోషంతో ఉక్కిరిబిక్కిరవుతోంది ఆమె మనసు.

★ ★ ★

గర్భగుడి చుట్టూ మూడు ప్రదక్షిణలు చేశాక పూజారికి తను తెచ్చిన పూజాసామగ్రిని అందిస్తూ "బాబు పేర అర్చన చెయ్యండి" అంది సరిత.

"పేరు, గోత్రం చెప్పండమ్మా!" అడిగేడాయన. చెప్పిందామె.

పూజారి అర్చన చెయ్యడం మొదలుపెట్టాడు.

"దేముడికి దణ్ణం పెట్టు" అంది సరిత.

రాహుల్ చేతులు జోడించి కళ్ళు మూసుకున్నాడు.

"భగవంతుడా! సృష్టిలోని సకల జీవులని కాపాడు తండ్రీ. ఆకలి చావులు లేకుండా అందరూ కడుపునిండా అన్నం తినేలా అనుగ్రహించు..." అలా ప్రార్థన చెయ్యడం చాలా చిన్నప్పటినుంచే శాంతమ్మ నేర్పింది వాడికి. నేను పరీక్ష పాసవ్వాలి, నాకు ఇంకా డబ్బియ్యి, నాకు అది చెయ్యి, నాకు ఇది చెయ్యి అని భగవంతుడిని అడగడం స్వార్థం. అయినా ఎవరికి ఎప్పుడు ఏం ఇవ్వాలో ఆ భగవంతుడికి తెలియదా? ఈ సృష్టిలో అందరూ బాగుండాలని ప్రార్థించు. 'సర్వే జనాస్సుఖినో భవంతు' అనేది శాంతమ్మ. వాడికి ఊహ వచ్చిన దగ్గరనుంచి వాడిచేత అదే ప్రార్థన చేయించేది. వాడు ఆవిడ మాట తు.చ. తప్పక ఆచరిస్తూ అలాగే దేముడిని ప్రార్థిస్తాడు. అయితే ఇప్పుడు వాడి ప్రార్థనలో మరో కోరిక చోటు చేసుకుంది.

'మా డాడీ తొందరగా అమెరికా నుంచి వచ్చేలా చెయ్యి స్వామీ!' అని ప్రార్థన పూర్తిచేసి వాడు కళ్ళు తెరిచాడు.

ఎదురుగా వున్న వ్యక్తిని చూసి వాడి కళ్ళు వెడల్పయ్యాయి. ఆ వ్యక్తి ఆనంద్! వాడి కళ్ళలో ఆశ్చర్యానందాలు పోటీ పడుతున్నాయి.

"డాడీ!" అస్పష్టంగా అన్నాడు. ఆనంద్ కూడా రాహుల్‌ను చూసాడు. అతని మనసు చిత్రంగా స్పందించసాగింది.

"రాహుల్!" ప్రేమార్ద్రంగా పిలిచాడు. రాహుల్ తల్లివైపు చూసాడు. ఆమె కళ్ళు మూసుకుని చేతులు జోడించి భగవంతునికి నమస్కరిస్తోంది.

వాడు తల్లి తనని గమనించడంలేదనే ధైర్యంతో అతన్ని చూసి చిన్నగా నవ్వేడు.

"హాయ్!" అన్నాడు ఆనంద్. అతని పక్కన వున్న వర్ధనమ్మ "ఎవర్రా ఆ అబ్బాయి నీకు తెలుసా? " అనడిగింది.

"ఆః!" అన్నాడతను క్లుప్తంగా.

పూజారి అర్చన ముగించి ప్రసాదం తెచ్చి సరిత చేతిలో వుంచి రాహుల్‌ని, ఆమెని దీవించాడు.

"ప్రసాదం కళ్ళకద్దుకో!" అంది సరిత. ఆనంద్‌నే చూస్తున్న రాహుల్ తల్లి మాటలని పట్టించుకోలేదు. వాడు చూస్తున్నవైపు చూసిన సరిత ఉలిక్కిపడింది.

ఆనంద్‌ను గుర్తుపట్టిన భావం ఆమె ముఖంలో కదలాడింది. వెంటనే శరీరంలోని రక్తమంతా ముఖంలోకి వచ్చి చేరినంత ఎర్రగా అయిపోయిందామె ముఖం. రాహుల్ అతన్ని తన తండ్రి అనుకుని పొరపాటు పడడమే, ఆమెకి సిగ్గుతో ప్రాణం పోతున్నట్టుంటే, మాధవి అతన్ని పెళ్ళి చేసుకోమని ప్రపోజ్ చెయ్యడం, మరింత సిగ్గుని కలుగచేస్తోంది. మాధవి తన దగ్గర ఆ ప్రస్తావన తెచ్చినట్టే అతని దగ్గరా ఆ ప్రస్తావనే తెచ్చి వుంటుందా? తెచ్చే వుంటుంది? తన జీవితాన్ని బాగుచెయ్యాలని పెద్ద సంఘసంస్కర్తలా కంకణం కట్టుకున్నట్టుంది. పళ్ళు కొరుక్కుంటూ రాహుల్ వైపు చూసింది. వాడు ఇంకా ఆనంద్‌నే చూస్తున్నాడు.

"రాహుల్! పద" అంది వాడి చెయ్యి పట్టి లాగుతూ.

"డాడీ!" అన్నాడు వాడు అస్పష్టంగా.

"పద" పళ్ళ బిగువున అంటూ వాడి చెయ్యి పట్టి లాక్కెళుతోంది. వాడు తల్లి వెనకాల నడుస్తూనే మెడ తిప్పి ఆనంద్‌నే చూస్తున్నాడు. వాడి చూపులలో ఆశాభంగం.

"ఎవర్రా ఆ అబ్బాయి" వర్ధనమ్మ అడిగింది, ఆనంద్ కూడా వాడినే ఆర్తిగా తమకంగా చూడ్డం గమనించి.

ఇంతలో పూజారిగారు, బయటకి రాగానే చేతిలో పూజాద్రవ్యాలున్న సజ్జని అందిస్తూ, ఆనంద్ పేరు గోత్రం చెప్పి అర్చన జేయమని కోరింది.

పూజ ముగిసాక మండపంలో కూర్చున్నప్పుడు ఇందాకటి ప్రశ్నే వేసింది.

"రాహుల్! బాగున్నాడు కదమ్మా! వాడు నన్ను డాడీ అని పిలిచినప్పుడల్లా నాకేమనిపిస్తోందో తెలుసా? పూర్వజన్మలో వాడు నా కొడుకై వుంటాడని, ఆ అనుబంధాన్ని గుర్తుచేస్తూ ఇప్పుడు నన్ను డాడీ అని పిలుస్తున్నాడని" ట్రాన్స్‌లో వున్నట్టు చెప్పుకుపోతున్నాడు ఆనంద్.

ఆనంద్ తండ్రి కాలేడనే నిజం గుర్తుకొచ్చి ఆవిడ కళ్లు చెమర్చాయి.

"వాడు నీకంతగా నచ్చాడా నాన్నా? " ఆర్ద్రంగా అడిగింది.

"నచ్చినంత మాత్రాన మన స్వంతం చేసుకోలేముగా? " నవ్వేడు. "నిజానికివాడిని దత్తత చేసుకోవాలనుకున్నాను. కాని వాడి తల్లి అంగీకరించదు"

"చెట్టుకి కాయబరువా? ఎవరి పిల్లల్ని ఎవరు ఎవరికి ఇస్తారు? ఇంతకీ ఆ బాబు నీకెలా తెలుసు? "

ఆనంద్ తను మాధవి ఇంటికి వెళ్ళినప్పుడు జరిగిందంతా చెప్పాడు. సరిత విషయమూ పూసగుచ్చినట్టు చెప్పాడు.

విస్తుపోయింది వర్ధనమ్మ

"పాపం! ఎంత చక్కని బాబు! తండ్రి ప్రేమకి నోచుకోని దురదృష్టవంతుడు!"

ఆనంద్‌కి కళ్ళు మూసినా, తెరిచినా రాహుల్ ముఖమే కనిపించసాగింది. అతని కళ్ళు అప్రయత్నంగానే అక్కడంతా రాహుల్ కోసం వెతికాయి. వాడు అక్కడనుంచి ఎప్పుడో వెళ్ళిపోయాడని తెలిసినా వాడిని చూడాలని ఎందుకు ఆశపడుతున్నాడో అతనికే తెలియదు.

తల్లితో కలిసి ఆనంద్ గుడినుంచి

ఇంటికి వచ్చేప్పటికి బంటీ కనిపించలేదు. హాలులో మీనా, అచ్యుత్ మాట్లాడుకుంటు న్నారు. ఇద్దరి ముఖాలూ సీరియస్‌గా వున్నాయి. వర్ధనమ్మ కొడుక్కి కోడలికి ప్రసాదం ఇచ్చి బంటీ ఏడని అడిగింది.

గదిలో వున్నాడు అంది మీనా.

"పిలు. వాడికీ ప్రసాదం ఇస్తాను"

"నేను ఇస్తాలెండి" అత్తగారి చేతిలో నుంచి ప్రసాదం తీసుకుంది.

"బంటీ!" ఆనంద్ పిలిచాడు.

"వాడిప్పుడు నువ్వు పిలిస్తే వచ్చే మూడ్‌లో లేడు. అల్లరి చేస్తుంటే రెండు తగలనిచ్చింది మీ వదిన" అచ్యుత్ అన్నాడు.

"అరెరె... ఎందుకు వదినా చిన్నసన్నాసిని పట్టుకుని కొట్టావ్? " ఆనంద్ నొచ్చుకున్నాడు.

"చెప్పిన మాట వినడు. ఊరికే నస పెడతాడు" విసుగ్గా అంది.

"మాతో గుడికి పంపమంటే వినలేదు. అయినా చిన్నపిల్లవాడు అల్లరి చేస్తే కొడతారుటే? " మందలించే ధోరణిలో అంది వర్ధనమ్మ.

మీనా అత్తగారికి సమాధానం చెప్పకుండా గదిలోకి వెళ్ళిపోయింది. రాత్రి భోజనాలయ్యాక కాస్సేపు అన్నతో, తల్లితో కబుర్లు చెప్పి నిద్ర వస్తోందని గదిలోకి వెళ్ళాడు ఆనంద్. అలవాటు ప్రకారం పుస్తకం పట్టుకుని మంచం మీద వాలాడు. అంతలో తలుపు తీసుకుని బంటీ లోపలికి వచ్చాడు.

"రారా!" లేచి కూర్చున్నాడు.

"అమ్మ నీ దగ్గర పడుకోమంది" అన్నాడు. ఏడ్చి ఏడ్చి కళ్లు, ముఖం ఉబ్బి ఉన్నాయి. వాడిని చూస్తే జాలేసింది ఆనంద్‌కి.

"రా మరి పడుకో"

మంచమెక్కి బోర్లా పడుకున్నాడు వాడు.

"అలా చాలాసేపు పడుకుంటే పొట్ట నొప్పి పెడుతుంది. సరిగా పడుకో"

"వీపు మంట పుడుతుంది బాబాయ్!"

సాయంకాలం వదిన వాడిని కొట్టిందని అన్న చెప్పడం గుర్తొచ్చి జాలిగా అడిగాడు.

"మందు రాయనా? "

"అమ్మ రాసింది"

"అల్లరి చేసి దెబ్బలు తినే బదులు అమ్మ చెప్పినట్టు వినవచ్చుగా"

"నేను అల్లరి చెయ్యలేదు బాబాయ్! నీతో అమెరికా వెళ్ళనన్నాను"

"నిన్ను నాతో అమెరికా వెళ్ళమంటోందా మీ అమ్మ? "

"అవును. ఇకనుంచి నేను నిన్ను డాడీ అని పిలవాలిట"

ఆనంద్ కనుబొమ్మలు ముడిపడ్డాయి. బంటీని తనతో అమెరికా పంపుతానని వదిన అనడం వాడు అల్లరి చేసినందుకు బెదిరింపు కాదని అర్థమయిందతనికి.

"నీకు నేనంటే ఇష్టం లేదా? " వాడేం చెబుతాడో వినాలని కావాలనే అడిగాడు.

"నువ్వంటే ఇష్టమే బాబాయ్! కాని అమ్మని వదిలి అమెరికా ఎలా రాను? "

"ఆ మాటే అమ్మతో చెప్పు"

"అలా చెప్పినందుకే అమ్మ నా వీపు మీద వాతలు తేలేలా బెత్తంతో బాదింది"

ఆనంద్ అవాక్కయ్యాడు. చప్పున వాడి చొక్కా విప్పి చూశాడు. తెల్లటి లేత వీపుపై బెత్తం దెబ్బలు ఎర్రగా కమిలి ఉన్నాయి. అతని కళ్లలో నీళ్ళూరుతున్నాయి. ఆ వాతలు తనకి పెట్టినట్టు విల

**"అవును. ఇంకనుంచి నేను నిన్ను డాడీ అని పిలవాలిట" ఆనంద్ కనుబొమ్మలు ముడిపడ్డాయి. బంటీని తనతో అమెరికా పంపుతానని వదిన అనడం వాడు అల్లరి చేసినందుకు బెదిరింపు కాదు**

విలలాడాడు.

"నన్ను అమెరికా తీసుకెళ్లనని అమ్మతో చెప్పు బాబాయ్" ఏడుస్తున్నాడు వాడు.

ఆనంద్ మనసు ద్రవించిపోయింది.

"చెబుతానులే! ఏడవకు మరి" అతని లాలనతో ఓదార్పుతో స్థిమితపడి వాడు నిద్రలోకి జారుకున్నాడు.

★ ★ ★

"మా అమ్మాయి, అల్లుడు విడాకుల్ని రద్దు చేసుకుని, కలిసి బతకాలనుకుంటున్నారు" సూర్యకాంతమ్మ చెప్పగానే శాంతమ్మ ఆశ్చర్యంగా అడిగింది.

"అలా వీలవుతుందా? "

"అవుతుందిట. లాయర్‌గారు చెప్పారు. మా అమ్మాయి తరఫున కేసు వాదించి విడాకులు వచ్చేలా చేసింది ఆయనే. ఆయనే చెప్పారు. మా అమ్మాయి, అల్లుడు తిరిగి కలిసి బతికే అవకాశం ఉందిట. అయితే వాళ్లిద్దరూ మళ్లీ పెళ్ళి చేసుకోవాలిట. ఆ పెళ్లి చట్టబద్ధమైన గుర్తింపు కలిగి ఉండాలిట" తనే ఒక లాయర్‌లా చెప్పింది.

"అవునా? "

"కార్తీక మాసం రాగానే మా వకుళ మంచి రోజు చూసుకుని మా అల్లుడి దగ్గరికి వెళ్తుంది. అల్లుడు మంచివాడే కాని కొంచెం పట్టుదల ఎక్కువ. మా వకుళ కూడా తీసిపోలేదు. ఇద్దరూ పట్టుదలకి పోయి తెగేదాకా లాగి తెచ్చుకున్నారు"

"ఏదో లెండి... గ్రహస్థితి బాగాలేక..." అంది శాంతమ్మ.

"అంతే! ఇన్నాళ్లకి మళ్లీ మంచి రోజులు వచ్చాయి. నవ్విన నాప చేనే పండుతుందన్నట్టు మొగుడు వదిలేశాడని మా వకుళను వెక్కిరించిన వాళ్ళ నోళ్లు ఈ దెబ్బతో మూత పడతాయి"

"ఎవరు వెక్కిరిస్తారు లెండి? ఎంతో తప్పని పరిస్థితులలో తప్ప ఆడపిల్ల అత్తింటి గడప దాటదు" అంది శాంతమ్మ నొచ్చుకుంటూ.

"మీరు కష్టం సుఖం తెలిసినవారు కాబట్టి మా అమ్మాయిని సమర్థిస్తున్నారు గాని ప్రతీవాళ్ళూ నోటితో మాట్లాడుతూ నొసలుతో వెక్కిరించేవాళ్ళే. అందరికీ నా కూతురి విడాకుల గొడవే కావాలి"

"లోకులు కాకులన్నారందుకే..."

కాస్సేపు వసంత్ సుగుణాలని పొగిడి, వెళ్తానని చెప్పి లేచింది సూర్యకాంతమ్మ. ఏదో మరచిపోయినట్టు వెనక్కి వచ్చి "అవునూ, మీ అల్లుడు అమెరికానుంచి ఎప్పుడొస్తాడు? అమ్మాయిని అమెరికా తీసుకెళ్ళడానికి కాగితాలు పంపాడా? " అనడిగింది.

"అదేదో వీసా రాలేదుట. రాగానే..." శాంతమ్మ తొణక్కుండా చెప్పింది.

"వస్తుంది లెండి. అయినా మీ అమ్మాయి అమెరికా వెళ్ళడానికి ముందే మా వకుళ కాపురానికి వెళ్ళిపోతుంది" కూతురి కాపురం గాడిలో పడ్డ సంతోషం ఆవిడ స్వరంలో.

"అమ్మమ్మా!" అని పిలుస్తూ రాహుల్ పుస్తకాల బ్యాగ్‌తో ఇంట్లోకి వచ్చాడు.

"ఏరా నాన్నా! టింకూ వాళ్ళ డాడీ దగ్గరకి వెళ్ళిపోతున్నాడు. మరి నువ్వెప్పుడు మీ డాడీ దగ్గరకెళ్తావ్? " వాడి బుగ్గలు పుణికి ముద్దు పెట్టుకుంటూ అడిగింది సూర్యకాంతమ్మ.

శాంతమ్మకి ఆవిడ అలా అడగడం ఎంత మాత్రము నచ్చలేదు.

"రాహుల్! పుస్తకాలు లోపల పెట్టి కాళ్ళు కడుక్కునిరా టిఫిన్ తిందువుగాని" అని వాడిని అక్కడనుంచి పంపేసింది.

ఆ రాత్రి హోమ్‌వర్క్ చేస్తున్న రాహుల్ పున్నట్టుండి తల్లి ముఖంలోకి చూస్తూ అడిగాడు.

"అమ్మా! టింకూ వాళ్ళ డాడీ దగ్గరకి

వెళ్తున్నాడుట. మరి మనమెప్పుడు డాడీ దగ్గరకి వెళ్తాం? "

సరితకి వకుళ భర్త నుంచి వీడిపోయిన విషయం తెలుసుగాని, ఆమె మళ్ళీ భర్తతో కలిసి జీవించబోతున్న విషయం తెలియదు. కొడుకు ప్రశ్నతో ఒకింత ఆశ్చర్య పోయినా తను రాహుల్‌ని తండ్రి దగ్గరకి వెళ్తామని భ్రమ పెట్టినట్టే, వకుళ కూడా టింకూని భ్రమ పెట్టి వుంటుందనుకుంది. అందుకే తొణక్కుండా చెప్పింది.

"టైమ్ పడుతుంది. ఎందుకంటే అమెరికా వెళ్ళడానికి మనం వీసాకి అప్లై చెయ్యాలి. వీసా వచ్చాక టికెట్టు కొనుక్కోవాలి" అంటూ వివరంగా చెప్పింది. వాడు ఉత్సాహంగా విన్నాడు. వాడి కళ్ళలో తండ్రితో గడపబోయే భవిష్యత్తుపై ఆశ! వాడి ముఖంలోకి చూస్తున్న సరిత తను తప్పు చేసిందని మరోసారి అనుకుంది. వాడు పడుకున్నాక శాంతమ్మ చెప్పింది.

"వకుళ, ఆమె భర్త తిరిగి కలిసి జీవించబోతున్నారుట"

"నిజమేనన్నమాట. రాహుల్ చెప్తే నేను నమ్మలేదు"

"ఏమిటో మొన్నటి దాకా సూర్యకాంతమ్మగారు అల్లుడిని తెగ తిట్టిపోసేది. జరిగిన దాంట్లో తన కూతురు తప్పేమీ లేదని కేవలం అల్లుడిదే తప్పని చెప్పేది. ఇప్పుడు అల్లుడు మంచివాడేనని కొంచెం పట్టుదల ఎక్కువని, వకుళ కూడా మూర్ఖంగా ప్రవర్తించిందని చెబుతోంది. పోన్లే ఏదో రకంగా కలుస్తున్నారు. పిల్లాడికి తల్లీ తండ్రీ ఇద్దరి ప్రేమా అవసరమే కదా!"

సరిత గుండెల్లో గుచ్చుకుందా మాట. రాహుల్‌కీ తండ్రి ప్రేమ అవసరమే. పైగా వాడికి తండ్రిపై లేనిపోని ఆశలని కల్పించింది కూడా. కాని వాడి తండ్రి వ్యసనపరుడని, శాడిస్టు అని వాడికి తెలియదు. సర్దుకుపోలేని పరిస్థితులలో గడప దాటిన తను తిరిగి భర్త దగ్గరికి వెళ్ళలేదు. సరిత వేదనగా నిట్టూర్చింది.




బంటీని ఒడిలో కూర్చోపెట్టుకుంటూ అన్నాడు ఆనంద్.

"వీడిని నాతో అమెరికా తీసుకుపోతాను వదినా!"

మీనా ముఖం విప్పారింది. "నిజంగానే అంటున్నావా? "

"నిజంగానే వీడు నాకు బాగా అలవాటయిపోయాడు"

"ఆషామాషీగా తీసుకెళ్ళి కొన్నాళ్ళు నీ సరదా తీరేదాకా వుంచుకుని మళ్ళీ నా దగ్గరికి పంపడం కాదు. శాస్త్ర ప్రకారం దత్తత తీసుకో! మళ్ళీ మనసు మార్చుకోకు"

నవ్వేడు ఆనంద్.

"ముసుగులో గుద్దులాట అనవసరం. నీకు పిల్లలు పుట్టే యోగమెలాగూ లేదు. నువ్వు ఎవర్ని పెళ్ళి చేసుకున్నా ఫర్వాలేదు. బంటీని మాత్రం దత్తత తీసుకోవాలి. వాడిని నీతో అమెరికా తీసుకెళ్ళడానికి అవసరమైన పేపర్లవీ ఇప్పటినుంచే సిద్ధం చేసుకో"

"నాకు పిల్లలు పుట్టరని ఎవరు చెప్పారు? " ఆనంద్ సడెన్‌గా అలా అడిగేసరికి మీనా నివ్వెరపోయింది.

"వసంతని నువ్వు పెళ్ళి చేసుకుని తీరాలని మీ అక్కయ్య పట్టు పట్టినప్పుడు

నువ్వే చెప్పావుగా?"

"అది నిజమని నువ్వు నమ్మేసావా?" నవ్వేడు.

"వసంత వంశీవల్ల ప్రెగ్నెంటయినా మా అక్క దాన్ని నాకు ఎలాగైనా ఇచ్చి పెళ్లి చెయ్యాలని ఆ నింద నాపై తోస్తోందని అలా అన్నాను. అయినా నేను బంటీని దత్తత తీసుకున్నా వాడు నన్ను తండ్రిగా ఎలా అంగీకరిస్తాడు వదినా? వాడి తల్లి దండ్రులెవరో వాడికి తెలుసు. వాడు పసి వాడుగా వుండగా వాడిని నాకిచ్చేస్తే అది వేరే సంగతి. నాకు కావలసింది నా రక్తం పంచుకుని పుట్టిన బిడ్డ కాక పోయినా నన్ను నోరారా 'నాన్నా' అని పిలిచే బిడ్డ. మరో మాట వదినా! బంటీని అమెరికా పంపించి నువ్వుండగలవేమో గాని, వాడు మాత్రం నిన్ను వదిలి వుండలేడు. నీ ప్రేమకోసం తపించిపోతున్న వాడి లేత మనసు నీ కర్కశ ప్రవర్తనతో ఎంత బాధపడుతోందో ఆలోచించు. వాడిని దూరం చేసుకుంటే ఇప్పుడు వాడు, తర్వాత నువ్వు చాలా బాధ పడతారు"

"చాలా పొరబాటు చేసాను ఆనంద్! ఆస్తిపై ఆశతో బంటీని దూరం చేసుకోబోయాను. మూర్ఖురాలిని" అందామె కన్నీరు తుడుచుకుంటూ. కోడలిలోని పరివర్తన వర్ధనమ్మను ఉక్కిరి బిక్కిరి చేసింది.

అతనలా అంటాడని ఊహించని మీనా తల దించుకుంది. అచ్యుత్‌కి సిగ్గుతో ప్రాణం పోయినట్టయింది. బాబాయ్‌తో అమెరికా వెళ్ళను. నీ దగ్గరే వుంటానని బంటీ మారం చేస్తుంటే తను వాడి వీపుపై వాతలు తేలేలా కొట్టడం గుర్తొచ్చి మీనా కన్నపేగు విలవిల్లాడింది.

పెద్దకొడుకు అనిల్‌కి బంటీ అంటే ఎంత ప్రాణమో గుర్తుకొచ్చింది. రామలక్ష్మణుల్లా పెరుగుతున్న ఆ ఇద్దరినీ ఎలా విడదీద్దామనుకుంది? అయినా బంటీని విడిచి తను మాత్రం ఎలా వుండగలదు. వాడి ముద్దు మాటలని వినకుండా ఒక్క క్షణమైనా వుండగలదా? తన నెత్తిమీద డబ్బు ఆశ అనే దెయ్యం కూర్చుని తనని రాక్షసిలా మార్చింది. తనలోని మాతృప్రేమని చంపేసింది. అసలు తను తల్లేనా?" ఆమె వెక్కి వెక్కి ఏడుస్తూ బంటీని గుండెలకి హత్తుకుంది.

"చాలా పొరబాటు చేసాను ఆనంద్! ఆస్తిపై ఆశతో బంటీని దూరం చేసుకోబోయాను. మూర్ఖురాలిని" అందామె కన్నీరు తుడుచుకుంటూ.

కోడలిలోని పరివర్తన వర్ధనమ్మను ఆనందంతో ఉక్కిరి బిక్కిరి చేసింది.

★ ★ ★

వసంత పెళ్ళికి రెండు లక్షల రూపాయలు కానుకగా ఇచ్చాడు ఆనంద్.

"ఎందుకంత డబ్బు? మొన్ననేగా చీర తెచ్చావ్" అంది రాజ్యలక్ష్మి. ఆమెకి లోలోపల తమ్ముడికి కూతురినిచ్చి పెళ్ళి చెయ్యలేకపోయాననే బాధ, అతని ఆస్తి ఎవరో అనామకులకి ధారాదత్తమవుతుందనే ఈర్ష్య వున్నాయి.

"నా మేనకోడలికి కానుకగా ఇస్తున్నాను. ఆ డబ్బు వసంత పేర ఫిక్స్‌డ్ డిపాజిట్ చెయ్యి. దాని భవిష్యత్ అవసరాలకి, భద్రతకి పనికి వస్తుంది" అన్నాడు ఆనంద్.

వసంత పెళ్ళి వీలయినంత ఘనంగా జరిపించాడు గోపాల్రావు.

★ ★ ★

"హలో!"

"ఎవరు?" అవతల వసంత్ స్వరం విన్న వకుళ శరీరంలో సన్నని ప్రకంప

## అలవాటు

తెలుగు లెక్చరర్ శర్మగారికి ఏంచెప్పాలన్నా 'వెధవది' అనే ఊతపదం లేందే మాట సాగేదికాదు.. వెధవది ఏ ఊరు వెళ్లివస్తున్నావురా భడవా? ఇలా ఉండేది ఆయన తీరు.

కుమార్తె పెళ్లికి వారంరోజులు సెలవుపెట్టి తిరిగి క్లాసుకు హాజరైన ఆయన తన సహజ ధోరణిలో 'వెధవది మా అమ్మాయి పెళ్లికి లక్షనుకుంటే రెండులక్షలు వదిలాయిరా!' అన్నారు. అంతే అంతా ఫక్కుమన్నారు. తన ఊతపదం ఎంత చేటుతెచ్చిందో ఆయనకూ అర్థంకావడంతో ఏమనలేక చిరునవ్వుతో తలాంచారాయన.




నలు.

"వకుళని"

"చెప్పు"

"మీతో మాట్లాడాలి... ఎక్కడ కలుద్దాం?"

అతను హోటల్ పేరు చెప్పాడు.

హోటల్ కెందుకూ మన ఇంటికి వస్తాను.

"హోటలయితేనే బాగుంటుంది. మనం మళ్ళీ పెళ్ళి చేసుకునే వరకు లవర్స్‌మే" అతను చిలిపిగా అన్న మాటలకి వకుళ చెంపలలో గులాబీలు పూసాయి.

"సరే! ఎన్ని గంటలకి?"

"సాయంత్రం ఆరు గంటలకి"

"ఓకే" వకుళ ఫోన్ పెట్టేసింది. ఆ రోజంతా గంట గంటకి గడియారం చూస్తూ ఎంతకీ గడవని టైముని తిట్టుకుంటూ గడిపింది.

సాయంకాలం అయిదు గంటలకే స్నానం చేసి ముస్తాబవడం మొదలుపెట్టింది. ప్రత్యేకంగా శ్రద్ధగా అలంకరించుకుని టింకూని చూసుకోమని తల్లికి చెప్పి బయలుదేరింది.

వసంత్ చెప్పిన హోటల్‌కి వెళ్ళేసరికి అతను రిసెప్షన్‌లో కూర్చుని వున్నాడు.

"లేట్ చేసానా, సారీ!" అంది.

"నిరీక్షణలోని తియ్యదనం అర్థమయ్యింది" అన్నాడు. ఇద్దరూ రెస్టారెంట్‌లోకి నడిచి ఒక కార్నర్ టేబుల్ దగ్గర కూర్చున్నారు.

బేరర్ వచ్చాడు.

"ఏం తింటావ్?' అడిగేడు.

"మీ ఇష్టం"

"నీ ఇష్టమే నా ఇష్టం. అన్నట్టు నీకు మసాలా దోశ ఇష్టం కదూ? అదే తిందాం" అతను ఆర్డరిచ్చాడు.

అతను ఇంతకాలం వియోగం తర్వాత కూడా తన ఇష్టాలని గుర్తుంచుకున్నందుకు వకుళ మనసు సంతోషంతో మూగబోయింది. అతనితో ఎన్నో మాట్లాడాలనుకుంది. కాని మాటలే కరువయ్యాయి.

"నాతో ఏదో మాట్లాడాలన్నావ్?"

"అదే... అది అంకుల్‌తో మీరు మన గురించి..." తడబాటుగా ఆగిపోయింది.

"మనం కలిసి బతకాలనుకోవడం నా దురాశా వకుళా?" ఆర్తి నిండిన స్వరంతో అడిగాడు.

"కాదు. అది నా అదృష్టం. మీరు గతంలో నా ప్రవర్తనని క్షమించి నిండు మనసుతో తిరిగి నన్ను మీ జీవితంలోకి ఆహ్వానించాలనుకున్నారు" భావోద్వేగంతో వణికిందామె స్వరం.

"తప్పులు నేను మాత్రం చెయ్యలేదా? మగవాడిననే అహంకారం నాది. ఎప్పుడూ నాదే పైచెయ్యి కావాలనుకునే వాడిని. నీ వ్యక్తిత్వాన్ని కించపరుస్తూ నీకంటూ ఒక గుర్తింపు లేకుండా నా ఇష్టాన్ని బలవంతంగా నీపై రుద్దేవాడిని. అవన్నీ తలచు

కుంటే సిగ్గుతో నా ప్రాణం పోతున్నట్టుంది"

వకుళ కళ్ళలో నీళ్ళూరాయి.

"మీరు నా భర్త అనే కనీస గౌరవం లేకుండా నోటికొచ్చినట్టు మాట్లాడేదాన్ని. జీవితమంటే రాజీ అని తెలుసుకోకుండా మూర్ఖంగా విడాకులకోసం కోర్టుకి ఎక్కాను. నాకేమనిపిస్తోందో తెలుసా? చచ్చిపోయి మళ్ళీ పుట్టి జీవితాన్ని ఫ్రెష్‌గా మొదలు పెట్టాలని"

"జీవితాన్ని ఫ్రెష్‌గా మొదలుపెట్టడానికి చచ్చి మళ్ళీ పుట్టక్కర్లేదు. నిన్న చేసిన తప్పులని మళ్ళీ చెయ్యకుండా వుంటే చాలు" ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుంటూ అన్నాడు. అతని లాలనాపూరితమైన మాటలతో ఆమె మనసుకి సాంత్వన లభించింది. కొన్నాళ్ళుగా తననుభవిస్తున్న సంఘర్షణ, వేదన మటుమాయమైంది. మండుతున్న ఆమె మనసుకి అతని మాటలు చందన లేపనంలా వున్నాయి.

బేరర్ టిఫిన్ తెచ్చి వాళ్ళ ముందుంచాడు. ఇద్దరూ తినడం మొదలుపెట్టారు. వున్నట్టుండి తల ఎత్తి అడిగింది.

"ఈ విషయం మీ అమ్మగారికి చెప్పి ఆవిడ అనుమతి తీసుకున్నారా? "

"చెప్పాను. మొదట ఆవిడ ఒప్పుకోలేదు. నువ్వు విడాకులకోసం కోర్టుకి వెళ్ళావని ఆవిడకి నీపై చాలా కోపంగా వుంది. ఆవిడకి ఎన్నో విధాల నచ్చచెప్పి నీచేత ఆవిడకి క్షమాపణ చెప్పిస్తానని బతిమాలాక చివరికి అంగీకరించింది"

"అత్తయ్యగారిని క్షమాపణ అడగడానికి నేను సిగ్గుపడను" అంది మ్లానమైన ముఖాన్ని కిందకి దించుకుంటూ.

"నువ్వాపని ఎంత త్వరగా చేస్తే అంత మంచిది"

"మన పెళ్ళికి రిజిస్టర్ ఆఫీసులో అప్లికేషన్ పెట్టాలి. వచ్చేది కార్తీకమాసం. మంచి ముహూర్తాలున్నాయిట అమ్మ చెప్పింది."

తింటున్న అతనికి పొలమారింది. అతని తలపై చిన్నగా తట్టి మంచినీళ్ళ గ్లాసు అందించింది.

"ఎవరో మిమ్మల్ని తలచుకుంటున్నారు"

"నన్ను అనుక్షణం తలచుకునే నువ్వు నాకెదురుగా వుండగా ఇంకెవరు తలచుకుంటారు"

"నిజం. మనం కొత్త జీవితాన్ని మొదలు పెట్టడానికి మీరు అంగీకరించిన క్షణం నుంచి మిమ్మల్ని తలచుకోని క్షణంలేదు"

"నిజం చెప్పు. మనం లీగల్‌గా విడిపోయినప్పుడు నీకేమనిపించింది? "

హఠాత్తుగా అతనలా అడిగేసరికి ఆమె తొట్రుపడింది.

"చెప్పు. ఫర్వాలేదు. నేనేమీ అనుకోను"

"ఏదో స్వేచ్ఛ లభించినట్టు... జైలులో నుంచి బయటపడిన ఫీలింగ్. మీరు నాపై విధించిన ఆంక్షలని, కట్టుబాట్లని భరించలేకపోయాను"

"ఇప్పుడు మళ్ళీ నాతో కలిసి బతకాలనుకుంటున్నావ్! అవే ఆంక్షలని, అంతకుమించిన కట్టుబాట్లని నేను నీపై విధిస్తే..."

"రాజీ పడతాను. జీవితమంటే రాజీ. పెళ్ళంటే ఇంకా పెద్ద రాజీ. అని తెలుసుకోలేక ఒకసారి తప్పు చేశాను. మళ్ళీ ఆ తప్పు చెయ్యను"

"నాకు వాగ్దానమిస్తున్నావా? నిన్ను నువ్వు సరిదిద్దుకుంటున్నావా? "

"రెండూను"

"నేనూ నీకు వాగ్దానమిస్తున్నాను. భవిష్యత్తులో నువ్వు నాతో గడపబోయే ప్రతీ క్షణం నీకు జన్మ జన్మలకీ గుర్తుండిపోతుంది"

"థ్యాంక్ యూ" మెరిసే కళ్ళతో అంది.

"ఇంక వెళ్దామా? " బేరర్ తెచ్చిన బిల్, టిప్పు కలిసి ప్లేటులో పెడుతూ లేచాడు.

వకుళకి గాలిలో తేలిపోతున్నట్టుంది. ఆమె మనసు మధురోహలతో పులకరిస్తోంది. వసంత్‌తో తను గడపబోయే భవిష్యత్తు సుందరంగా కనిపిస్తోంది.

వకుళ ఇంకా ఇంటికి రాలేదేమా అని ఆతృతగా ఎదురు చూస్తున్న సూర్యకాంతమ్మ రాత్రి ఎనిమిది గంటలకి ఇంటి ముందు ఆటో దిగిన కూతుర్ని చూసి గుండె తేలికపడింది.

"ఎక్కడికెళ్ళావే? " ఆతృతగా అడిగింది.

"వసంత్ దగ్గరికి"

"అతని ఇంటికా? " విభ్రాంతిగా అడిగింది.

"కాదు హోటల్‌కి రమ్మన్నాడు"

"ఎందుకూ? "

"రెస్టారెంట్‌లో కూర్చుని టిఫిన్ తిని కాస్సేపు కబుర్లు చెప్పుకున్నాం"

"ఏం మాట్లాడుకున్నారు? "

"అబ్బ ఏమిటమ్మా? భార్యా భర్తలం. లక్ష విషయాలు మాట్లాడుకుంటాం. అవన్నీ చెప్పాలా? "

"హమ్మయ్య! నువ్వొచ్చావ్! బస్సు కోసం వెయిట్ చేసే బాధ తప్పింది" అంది ప్రమీల. "నువ్వు రమ్మంటే రోజూ మీ ఇంటినుంచి ఆఫీసుకి లిఫ్ట్ ఇస్తుంటాను కదా! కాకపోతే పెట్రోల్ ఖర్చు మాత్రం నీదే"

"అది కాదే! శశిభూషణంగారు మీ పెళ్లికి రిజిస్ట్రార్ ఆఫీసులో అప్లికేషన్ పెట్టుకోమన్నారు. ఆ విషయం అతనితో చెప్పావా? "

"చెప్పాను. ఇంతలో సంభాషణ మరో దారికి మళ్ళింది. తర్వాత ఆ విషయం మరచిపోయాను"

"ఏడ్చినట్టుంది. ముఖ్యమైన విషయం వదిలేసి ఏదేదో మాట్లాడావన్నమాట. ఈసారి అతని దగ్గరకి వెళ్ళినప్పుడు పెళ్లి విషయం మాట్లాడు. మాట్లాడి వూరుకోడం కాదు. రిజిస్ట్రార్ ఆఫీసులో అప్లికేషన్ పెట్టేదాకా వూరుకోకు. ఈలోగా కార్తీకమాసం వస్తుంది. పెళ్లయ్యాక చెప్పుకోండి ఆ కబుర్లేవో!"

"పోమ్మా!" వకుళ కొత్త పెళ్లి కూతురిలా సిగ్గు పడింది.

★ ★ ★

ప్రమీల, సరిత బస్ స్టాపులో నిలబడి వున్నారు. ఇంతలో వాళ్ల ముందు ఒక మోటార్ బైక్ ఆగింది.

"హాయ్!" బైక్ మీదున్న యువకుడిని ఆనందంతో విప్పారిన ముఖంతో ప్రమీల పలకరించింది.

"హలో!" అతను ఆమెని చూసి నవ్వేడు.

"హమ్మయ్యా! నువ్వొచ్చావ్! బస్సు కోసం వెయిట్ చేసే బాధ తప్పింది" అంది ప్రమీల.

"నువ్వు రమ్మంటే రోజూ మీ ఇంటినుంచి ఆఫీసుకి లిఫ్ట్ ఇస్తుంటాను కదా! కాకపోతే పెట్రోల్ ఖర్చు మాత్రం నీదే"

"ఓకే! రోజూ నాకు ఐస్ క్రీమ్ ఇప్పిస్తానంటే అలాగే!"

"బాబోయ్! నిన్ను ఐస్‌క్రీమ్ పార్లర్‌కా? కసాటా తప్ప తినవ్! దానికంటే నా బండి పెట్రోల్ బిల్ నేను పెట్టుకోడమే సేఫ్"

ఇద్దరూ గల గల నవ్వుకున్నారు.

"ఓ.కె సరితా! నాకు లిఫ్ట్ ఇవ్వడానికి ఒక బకరా దొరికాడు. నువ్వు బస్ కోసం వెయిట్ చెయ్యి. నిన్ను వదిలి వెళ్తున్నందుకు ఏమీ అనుకోకేం? "

"ఇట్సాల్ రైట్!" అంది సరిత చిరునవ్వుతో.

"బైదిబై! వినయ్.. తను సరిత. అకౌంట్స్ అసిస్టెంట్‌గా మా ఆఫీసులోనే పనిచేస్తోంది. ఇతను నా ఫ్రెండ్!" పరస్పరం పరిచయం చేసింది.

"నమస్తే!" అంది సరిత.

"గ్లాడ్ టు మీట్ యు" అదోలా చూస్తూ అన్నాడతను. సరితకి ఆ చూపులు కంప రాన్ని కలిగించగా ముఖం తిప్పుకుంది.

"సీయూ! బై" ప్రమీల అతని బైక్ ఎక్కింది. బైక్ ముందుకి కదిలాక కాని సరిత స్థిమితపడలేకపోయింది. తనని నఖశిఖ పర్యంతం చూసిన ఆ చూపులలో ఏదో తేడా వుందనిపించిందామెకి. ఆశ్చ ర్యమా? చులకనా? ఆమె శరీరం జుగు ప్సతో జలదరిస్తుంటే ప్రమీలతో మరోసారి ఎక్కడకీ, చివరికి బస్ స్టాపుకి కూడా వెళ్ళ కూడదనుకుంది.

ఐస్‌క్రీమ్ పార్లర్‌లో... ఐస్‌క్రీమ్ ఆర్డరి చ్చాక "ఇప్పుడు చెప్పు" అన్నాడు వినయ్.

"ఏం చెప్పను" అంది ప్రమీల నవ్వుతూ.

"నీ కొలీగ్ పేరేమిటన్నావ్! సరితా? పెళ్ళయిందా ఆమెకి?"

"ఏం నువ్వు చేసుకుంటావా? నో ఛాన్స్! ఆమె భర్త అమెరికాలో వున్నాడు. ఆమెకి నాలుగేళ్ళ బాబు కూడా ఉన్నాడు"

"అలా అని ఆమె చెప్పిందా? అదే ఆమెకి పెళ్ళయిందని, ఆమె భర్త అమెరి కాలో వున్నాడని..."

"ఆమె మెడలోని మంగళసూత్రం, నల్ల పూసలు పెళ్ళయిందని చెబుతాయి. ఆమె భర్త అమెరికాలో వున్నాడని ఆమె చెప్పింది"

"అమెరికాలోను లేదు, ఆస్ట్రేలియాలోను లేదు"

"యు మీన్! సరితకి అసలు పెళ్ళే కాలేదా? ఎవరినైనా ప్రేమించి మోసపో యిన బాపతా?"

"కాదు... పెళ్ళయింది కాని, భర్త నుంచి విడాకులు తీసుకుంది"

"నువ్వు చెప్పేది..." అపనమ్మకంగా చూస్తూ అడిగింది.

"నిజం. ఆమె విడాకుల కేసుని వాదిం చింది మా నాన్నగారే!"

"రియల్లీ? మరి తనభర్త అమెరికాలో వున్నాడని ఎందుకు చెబుతున్నట్టు? తను కట్టుకునే చీరలు, హ్యాండ్‌బ్యాగ్ ఇవన్నీ వాళ్ళాయన అమెరికా నుంచి తెచ్చాడని చెబుతుందే!" ప్రమీల ఇంకా దిగ్భ్రమనుంచి తేరుకోలేదు.

"ఎవరో స్నేహితులో, బంధువులో నిజంగా వాటిని అమెరికా నుంచి తెచ్చి వుండచ్చు" క్షణం ఆగి అన్నాడు.

"ఆమె ఆడుతున్నది నాటకమని మనం ఆమె నోటితోనే చెప్పిద్దామా?"

"ఎలా?" ఉత్సాహంగా అడిగింది ప్రమీల.

"ఇలా" వినయ్ తన ప్రణాళిక చెప్పాడు.

ప్రమీల అతను చెప్పిందంతా విని "సరిత తన భర్త అమెరికాలో వున్నాడని అబద్ధం చెప్పడం వెనుక ఏవో కారణాలు వుండే వుంటాయి. మనకెందుకు లెద్దూ లేనిపోని రిస్క్" అంది.

"రిస్కా! నేనేదైనా ప్లాన్ చేస్తే అవతలి వాళ్ళు రిస్క్‌లో పడాలి తప్ప నేనెప్పుడూ దొరకలేదు. తెలుసా" గొప్పగా చెప్పాడు.

"నేను టెన్త్ క్లాసు చదివే రోజులలో నా క్లాస్‌మేట్ రజని అని చాలా అందంగా వుండేదిలే. ఆమె ఒంటరిగా వున్న సమయం చూసి 'ఐ లవ్ యు' అన్నాను. ఆమె నా చెంప పగిలేలా కొట్టింది. కసితో ఆమె పేరు నా పేరు కలిపి స్కూలు గోడ లనిండా రాసాను. ఆ దెబ్బకి రజని స్కూలు మానేసింది. ఇంటర్మీడియెట్ చదువుతున్న రోజులలో ఫ్రెండ్స్‌తో పందెం కాసి ప్రవీణ అనే అమ్మాయిని బల వంతంగా ముద్దు పెట్టుకున్నాను. మూడు రోజుల తరువాత అది కాలేజీ బిల్డింగ్ పైఅంతస్తు నుంచి దూకి ఆత్మహత్య చేసు కుంది. రెండేళ్ళ కిందటి సంగతి. నా చెల్లెలు ఇంటర్మీడియెట్ చదువుతూవుం డేది. దాని క్లాస్‌మెట్ రూప అనే అమ్మా



యికి దానికంటే ఎక్కువ మార్కులొచ్చేవి. నా చెల్లెలు రూపతో పోటీ పడలేక కుమిలిపోయేది. నేనేం చేసానో తెలుసా? గొంతుమార్చి ఆమెతో ఫోన్‌లో అసభ్యంగా మాట్లాడేవాడిని. కొరియర్‌లో ఆమెకి ప్యాంటీలు, బ్రాలు పంపుతూ బూతులతో ఆమెకి ఉత్తరాలు వ్రాసేవాడిని. ఆమె భయపడి క్లాసులకి హాజరవడం మానుకుంది. చదువు మీద మనసు లగ్నం చెయ్యలేకపోయేది. ఆమె పేరెంట్స్ ఆమెని కాలేజీ మానిపించి వేరే ఊరికి ట్రాన్స్‌ఫర్ చేయించుకునేదాకా దాన్ని కనీసం వీధిలోకి పంపడానికే భయపడ్డారు. స్టేట్ ఫస్టు రావలసిన ఆ అమ్మాయి అత్తెసరు మార్కులతో గట్టెక్కింది"

తనేదో ఘనకార్యం చేసినట్టు చెబుతున్నాడు వినయ్. ప్రమీల వెన్నులో సన్నని జలదరింపు. అందంగా ఆకర్షణీయంగా వుండి నవ్వుతూ నవ్విస్తూ మాట్లాడే వినయ్ అసలు స్వరూపం ఇదా?

"సరితనేం చెయ్యబోతున్నావ్?" ఆమె గుండె గొంతులోకి వచ్చింది.

"ఆమె భర్తలా నేనే ఆమెకి ఫోన్‌చేస్తుంటాను. చూస్తూ వుండు. తనే నిజం కక్కుతుంది"

"యు ఆర్ సో క్లెవర్!" ఏడవ లేక నవ్వుతూ అంది ప్రమీల. పాములాంటి వినయ్‌తో స్నేహం చెయ్యడం

తన తప్పు. ఇప్పుడు అతని స్నేహాన్ని కట్ చేస్తే తనకే ప్రమాదం. అందుకే మౌనం వహించింది.

★ ★ ★

ఫోన్ మోగింది. సరిత లిఫ్ట్ చేసి 'హలో' అనగానే అవతలి స్వరం "హలో సరితా ఎలా వున్నావ్!" అనడిగింది. 'ఎవరు?' అవతలి పురుష స్వరం ఎవరిదో తెలుసుకోలేకపోయింది. అన్నయ్య కాదు. మరెవరు?

"అమెరికా నుంచి. నీ మొగుడిని మాట్లా డుతున్నాను"

సరిత శరీరంలోని రక్తం చల్లబడిపో యింది. ఒక క్షణం ఊపిరి పీల్చుకోడం మరచిపోయింది.

"ఎలా వున్నావ్? రాహుల్ ఎలా వున్నాడు?"

ఆమె మెదడు మొద్దుబారిపోయింది. అవతల మాట్లాడేది ఎవరని ఆమె ఆలో చించడం లేదు. తన భర్త అమెరికాలో వున్నాడని తను అబద్ధం చెబుతోందని ఎవరికో తెలిసిపోయింది. ఆమె ఎంత షాక్‌లో వుండిపోయిందంటే ఫోన్ డిస్‌క నెక్ట్ చెయ్యాలని కూడా స్ఫురించలేదు.

"ఏమిటి సరితా? మాట్లాడవ్? నాపై కోపమా? నిన్ను అక్కడ ఒంటరిగా వదిలి నేనూ ఇక్కడ ఒంటరిగా వుండలేకపోతు న్నాను. నువ్వు లేని రాత్రులు ఎంత నర కంలా వున్నాయో తెలుసా? ఐ మిస్ యు డార్లింగ్! అవును. పోయిన నెలలో నేను పంపిన లెమన్ ఎల్లో చీర నీకు నచ్చిందా? ఆ చీర నువ్వు కట్టుకుంటే చూడాలనివుంది. నువ్వు కట్టుకున్నాక ఆ చీర విప్పేసి ఆ చీర చుట్టుకున్నట్టు నన్ను చుట్టుకో.." ఠపీమని ఫోన్ పెట్టేసింది.

జుగుప్సతో, అవమానంతో జలదరి స్తోంది ఆమె శరీరం.

తనకి ఫోన్ చేసింది ఎవరు? తన రహ స్యాన్ని తెలుసుకున్నది ఎవరు? ఫోన్‌లో ఆ వ్యక్తి మాట్లాడిన ప్రతి వాక్యం గుర్తుకొ స్తుంటే అవమానంతో ఆమె మనశ్శరీరాలు దహించుకుపోతున్నాయి.

నిస్సహాయతతో దుఃఖం పెల్లుబికింది. బాత్‌రూమ్‌లోకి వెళ్ళి కరువు తీరా ఏడ్చింది. కొద్దిసేపటి తర్వాత ముఖం కడుక్కుని ఇవతలకి వస్తుంటే మళ్ళీ ఫోన్ మోగింది.

సరిత గుండె వేగం అమాంతం పెరిగి పోగా, "అమ్మా! ఫోన్ చూడు" అంది.

శాంతమ్మ వంట గదిలో నుంచి ఇవత లకి వచ్చి ఫోన్ లిఫ్ట్ చేసింది.

"అమెరికా నుంచా? ఎలా వున్నావ్ రా? మేము బాగానే వున్నాం. సరిత ఏదో కాలక్షేపం చేస్తోంది. పర్వాలేదు, ఆс! ఒక్క క్షణం.. సరితా! అన్నయ్య నీతో మాట్లాడతాడట" అంది.

"హాలో!"

"ఏమ్మా! ఎలా వున్నావ్?" అవతల గిరి ధర్ స్వరం వినగానే ఆమెకి ఉప్పెనలా దుఃఖం ముంచుకొచ్చింది.

"బాగానే వున్నాను" అంది తనని తాను సంబాళించుకుంటూ.

"రాహుల్ ఎలా వున్నాడు?"

"బాగున్నాడు"

"నీ ఉద్యోగమెలా వుంది?"

"బాగానే వుంది. వదిన, పిల్లలు ఎలా వున్నారు?"

"మీ వదిన ఇంకా ఆఫీసు నుంచి రాలేదు. బాగానే వుంది. పిల్లలు రాహు ల్‌ని అడుగుతున్నారు. ఆс! సరితా! నా ఫ్రెండ్ కృష్ణ. ఈ నెలాఖరుకి ఇండియాకి వస్తున్నాడు. వాడిచేత నీకు చీరలు, రాహు ల్‌కి బట్టలు పంపుతున్నాను. ఓకే నీకు ఏమైనా కావాలంటే అడుగు. మొహమాట పడకు"

"అలాగే!"

## ఆకాశంలో

హాజరుపట్టీలో పేర్లు రోల్‌నెంబర్లు చెబుతూ అందరి హాజరు తీసుకుంటున్నారు క్లాస్‌టీచర్. ఆ క్రమంలో-

నెంబరు సిక్స్ - అరుంధతి... వేరీజ్ షీ' అన్నారాయన సీరియస్‌గా.

'ఇన్‌ద స్కై' అని విన్పించింది వెనక బెంచీలనుంచి.

అంతా గొల్లున నవ్వారు.




చెల్లెలి స్వరంలోని మార్పుని పసిగట్టాడు గిరిధర్. "ఏమయిందమ్మా? ఎనీథింగ్ రాంగ్? " అడిగాడు.

"జీవితంలో చాలా పెద్ద తప్పు చేసానన్నయ్యా! అందుకు ఫలితాన్ని ఇప్పుడనుభవిస్తున్నాను" అని భోరున ఏడవాలనిపించిందామెకి. చెప్తే అన్న మాత్రమేం చేస్తాడు. అమెరికా నుంచి వచ్చి తన కళ్ళు తుడిచి తన సమస్యని పరిష్కరించలేడు కదా! అది ఇది మాట్లాడి ఫోన్ పెట్టేసింది.

★ ★ ★

"వకుళా!" ఫోన్‌లో శశిభూషణం స్వరం వినగానే ఆమె ఉత్సాహంగా అంది.

"చెప్పండంకుల్"

"ఏమంటున్నాడు వసంత్? "

వకుళ తామిద్దరూ హోటల్లో కలుసుకున్న విషయం చెప్పింది.

"గుడ్! ఇంకెందుకు ఆలస్యం? రిజిస్ట్రార్ ఆఫీస్‌కి వెళ్ళి పెళ్ళికి అప్లికేషన్ పెట్టుకోండి. విష్ యు ఆల్ ది బెస్ట్"

"థ్యాంక్ యు అంకుల్!" అంటూ ఫోన్ పెట్టేసింది.

"ఏమంటారాయన? " సూర్యకాంతమ్మ అడిగింది.

వకుళ చెప్పింది.

"ఈసారి వసంత్‌ని కలిసినప్పుడు పెళ్ళి విషయం తప్ప మరేమీ మాట్లాడకు"

"ఇప్పుడే ఆయనకి ఫోన్ చేస్తాను" అంటూ వసంత్ సెల్‌కి రింగ్ చేసింది.

"చెప్పు వకుళా!"

"మీతో మాట్లాడాలి"

"ఎక్కడ కలుద్దాం? "

"మెన్నటి హోటల్ అయితే బాగుంటుందేమో!"

"ఒ. కె. సాయంకాలం ఆరుగంటలకి కలుద్దాం" అతను ఫోన్ పెట్టేసాడు.

ఆ సాయంత్రం హోటల్‌లో "మనం రిజిస్టర్ మేరేజ్ చేసుకుంటే మంచిదంటున్నారు మా అంకుల్" అంది వకుళ.

"నాకో నిజం చెబుతావా? " ఆమె చెప్పిన దానికి అవునని కాదని జవాబివ్వకుండా వసంత్ అడిగాడు.

"ఏమిటి? "

"మనం తిరిగి కలిసి జీవిస్తే బాగుంటుందని మీ లాయర్ అంకుల్ నా దగ్గరకి వచ్చారు. ఆయన్ని నువ్వే పంపావా? "

"అవును" నిజాయితీగా అంగీకరించింది. "నిజమే కదూ? నేను ఊహించింది నిజం! నేను తప్పు చేసానని, ఆ తప్పులని సరిదిద్దుకుని మీతో కలిసి వుండాలని ఎప్పుడు నిర్ణయించుకున్నానో అప్పుడే అంకుల్‌ని మీ దగ్గరకి పంపాను. అంతే కాదు. మీకు మరో విషయం కూడా తెలియదు" ముసిముసిగా నవ్వుతూ అంది.

"ఏ విషయం? "

"కొన్ని నెలల క్రిందట మీకు పిల్లనిస్తా

నని ఫోన్ చేసిన వ్యక్తిని కూడా నేనే. ఆ రకంగా మీకు పెళ్ళి చేసుకునే ఉద్దేశం వుందో లేదో తెలుసుకున్నానన్నమాట" అతను విభ్రాంతిగా ఒక క్షణం ఆమె ముఖంలోకి చూస్తూండిపోయాడు. తర్వాత నవ్వేస్తూ "అమ్మ దొంగా!" అన్నాడు. "నువ్వు చాలా తెలివైనదానివి కాని నేను నీకంటే తెలివైనవాడిని. అది ఒప్పుకోవు. నన్నెప్పుడూ తక్కువగా అంచనా వేస్తుంటావు" చిరుకోపంగా ఆమె వైపు చూస్తూ అన్నాడు.

"మహానుభావా! మీరే నాకంటే తెలివైన వారు. ఒప్పుకుంటున్నాను" అంది చేతులు జోడిస్తూ తమాషాగా. బేరర్ టిఫిన్ తెచ్చి వాళ్ళ ముందు సర్దాడు. టిఫిన్ తింటుం డంగా అడిగింది.

"రేపు ఆఫీసుకి సెలవు పెట్టగలరా? "

"ఏం? "

"రేపు పంచమి మంచిరోజు. మనం రిజి స్ట్రార్ ఆఫీసుకి వెళ్ళి పెళ్ళికి అప్లికేషన్ పెడదాం"

"నాకు అప్పుడే పెళ్ళి చేసుకోవాలని లేదు వకుళా! మనమిలా ప్రేమించు కుంటూ కొన్నాళ్ళు జాలీగా గడిపి తర్వాత పెళ్ళి చేసుకుంటే బాగుంటుంది"

"పెళ్ళి చేసుకున్నాక ప్రేమించుకోకూ డదా? " గోముగా అడిగింది.

"మనం ఒకసారి పెళ్ళి చేసుకుని. విడా కులు తీసుకున్నాం. ఇప్పుడు మళ్ళీ పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాం. మనం మళ్ళీ పెళ్ళి అనే బంధతో ముడిపడినందుకు పశ్చాత్తాప పడేరోజు ఎప్పటికీ రాకూడదు. అలా జరగాలంటే మనం ఒకళ్ళ నొకళ్ళం బాగా అర్థం చేసుకోవాలి. అందుకే కొన్నాళ్ళు ఆగమంటున్నాను"

"అమ్మ కార్తీకమాసంలో మన పెళ్ళి జర గాలంటోంది"

"కార్తీకమాసమా!" అయిష్టంగా అన్నాడు. "మనకి విడాకులు కార్తీకమాసం లోనే మంజూరయ్యాయి. మరిచిపో యావా ? "

వకుళ ముఖం క్షణకాలం నల్లబడింది. "అవును" అంది తలదించుకుంటూ.

"మన జీవితాలలో చేదుజ్ఞాపకాన్ని మిగి ల్చిన ఆ నెల అంటే నాకసహ్యం! కార్తీకం వెళ్ళాక మార్గశిర మాసం వస్తుంది. అసలే చలికాలం. పక్కన నువ్వుంటే..." అతను చిలిపిగా అన్న మాటలకి వకుళ చెంపలలో కెంజాయ కాంతులు ప్రతిఫలించాయి.




కార్తీకమాసం. ఆ ఆదివారం ఆఫీసు వాళ్ళు ఏర్పాటు చేసిన గార్డెన్ పార్టీకి అందరూ కుటుంబాలతో సహా రావాలని సూచించింది మాధవి. రాహుల్‌ని కూడా బయటకి తీసుకెళ్ళినట్టుంటుందని వెంటనే అంగీకరించింది సరిత. ఊరి పొలిమేర లలో వున్న ఒక పెద్ద తోటలో వనభో జనం ఏర్పాటు చేసారు.

సరిత రాహుల్ కోసం పళ్లు, బిస్కెట్లు, వాటర్ బాటిల్, మార్చడానికి వేరే బట్టలు తదితర సామాగ్రి సర్దుకుని బయలుదే రింది. పిక్నిక్ అనగానే వాడికీ సరదా పుట్టింది. ఆ తోటలో మామిడి, నారింజ, బత్తాయి తదితర ఫలవృక్షాలున్నాయి. అప్పటికే చాలామంది వచ్చివున్నారక్కడ. రంగు రంగుల దుస్తులతో పిల్లలు ఆ

తోటలో విరిసిన పూలలా వున్నారు. అంత మంది పిల్లలని అక్కడ చూసేప్పటికీ రాహుల్ ఉత్సాహం రెట్టింపయింది.

"అమ్మా! వాళ్ళతో ఆడుకోనా? " అడిగేడు. "ఆడుకో" అంది చిరునవ్వుతో. రాహుల్ వాళ్ళతో ఒకడుగా కలిసిపోయాడు.

"హలో! సరితా! ఏమిటి ఒక్కదానివే నిలబడ్డావ్? కంపెనీ ఎవరూ లేరా? " హడావుడిగా వచ్చి పలకరించింది మాధవి.

" పిల్లలు ఆడుకుంటుంటే చూస్తున్నాను. మేడమ్!" అంది చిరునవ్వుతో.

"హలో! ఆనంద్! వాటే ప్లెజంట్ సర్ప్రైజ్!" సంభ్రమాశ్చర్యాలు నిండిన మాధవి స్వరం విని చివ్వున తల ఎత్తి అటు చూసింది.

ఆనంద్! అతను అసంకల్పితంగానే సరిత వైపు చూసాడు. ఆమె చివాలున తల తిప్పుకుని ఎటో చూడసాగింది.

"ఏమిటి, మా పార్టీకి గెస్ట్‌గా వచ్చావా? "

"కాదు. ఈ తోట నా ఫ్రెండ్ కార్తీక్‌ది. చూడ్డానికి రమ్మంటే వచ్చాను. ఇక్కడ మీరు పార్టీ చేసుకుంటున్నారని తెలియదు"

"బైదిబై సరితా! ఇతను ఆనంద్. మా ఫ్యామిలీ ఫ్రెండ్. యు.ఎస్.లో సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గా పనిచేస్తున్నాడు. ఆనంద్ తను సరిత, నా కొలీగ్" పరస్పరం పరిచయం చేసింది మాధవి.

ఆనంద్‌ని కావాలనే పార్టీకి పిలిచి ఎలా నాటకమాడుతోంది? తను అతన్ని చూసి మురిసి ముక్కలై పెళ్ళికి ఒప్పుకుంటుందని కాబోలు! సరితకి మాధవిపై పట్టరాని ఆగ్రహం కలిగినా మర్యాద కోసం అతనికి సమస్కరించి పనుందని పక్కకు నడిచింది.

ఆనంద్‌తో మాట్లాడి, అక్కడకి వచ్చిన మాధవి తననే తీక్షణంగా చూస్తున్న సరిత ని నిస్సహాయంగా చూసింది.

ఆనంద్ ఇక్కడికి రావడం యాదృచ్ఛికం అని సరితని ఎలా నమ్మించగలదు తను. అయినా మెల్లగా ఆమె వద్దకు వచ్చి "ఆనంద్ ఇక్కడికి వస్తాడని నాకు తెలియదు సరితా! అతన్ని నేను ఆహ్వానించ లేదు" సంజాయిషీ ఇస్తున్న ధోరణిలో ఇంకా ఏదో అనబోతున్న మాధవికి సరిత అడ్డుపడింది.

"అతన్ని మీరు కావాలని పిలిచారని నేను అనలేదు మేడమ్! ఒకవేళ కావాలని పిలిస్తే మాత్రం నాకేమిటి? " ఆమె స్వరంలో ఆనంద్ కాదు సాక్షాత్తు ఆ దేముడు దిగివచ్చినా తన నిర్ణయం మారదనే స్థిరత్వం ధ్వనించింది.

పిల్లలు దాగుడుమూతలు ఆడుతున్నారు. రాహుల్‌కి ఉత్సాహంగా వుంది. వాడు గుబురుగా వున్న మామిడి చెట్టు వెనుక దాక్కోవాలని వచ్చాడు. అక్కడ ఎదురుగా తననే చిరునవ్వుతో చూస్తున్న అతన్ని చూస్తూ ఆగిపోయాడు. అతను ఆనందే! అప్రయత్నంగానే రాహుల్ పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి.

"ఇక్కడేం చేస్తున్నావ్? " ఆనంద్ నవ్వుతూ అడిగేడు.

"మేమందరం హైడ్ అండ్ సీక్ ఆడుతున్నాం. మీకు తెలుసా? నేను ఒక్కసారి కూడా అవుటవలేదు"

"నిజంగానా వెరీగుడ్!" ప్రశంసించాడు ఆనంద్. రాహుల్ అతని దగ్గరగా వెళ్ళాడు.

"మిమ్మల్ని ఒకవిషయం అడగవచ్చా? "

"అడుగు" ఆనంద్ కాస్త శుభ్రంగా వున్న నేలపై కూర్చుని వాడిని తన దగ్గర కూర్చోబెట్టుకున్నాడు.

"మీరు... మీరు... మా డాడీ కాదా? "

అతనికేం జవాబివ్వాలో అర్థం కాలేదు.

క్షణం మౌనం తర్వాత అడిగేడు.

"నువ్వెప్పుడూ మీ డాడీని చూడలేదా? "

"లేదు"

"పోనీ మీ డాడీ ఫొటో అయినా చూసావా? "

"లేదు"

"మీ డాడీ అమెరికాలో వున్నారని నీ కెవరు చెప్పారు? "

"అమ్మ చెప్పింది"

తల్లి నిజం, తండ్రి నమ్మకం అంటారు. రాహుల్ తల్లి తన భర్త నుంచి విడిపోయిన విషయం ఈ పసివాడితో చెప్పలేక అతను అమెరికాలో వున్నాడని వీడిని నమ్మిస్తోంది. ఆ పసివాడిపై జాలి, సానుభూతి అంతకు మించిన అనురాగంతో ఆనంద్ మనసు ఉప్పొంగిపోతోంది.

"మా డాడీ పేరు ఆనంద్ అని మా అమ్మమ్మ చెప్పింది. నిజం చెప్పండి. మీరు మా డాడీ కాదా? ..." వాడి కళ్ళలోని ఆశ, ఆ అడిగిన తీరులోని ఆర్ద్రత అతని మనసుని కదిలించివేసాయి. అంతలో-

"రాహుల్! ఎక్కడున్నావ్? " సమీపంలో సరిత స్వరం వినిపించింది.

"అదుగో అమ్మ పిలుస్తోంది. నన్ను మీ దగ్గర చూస్తే ఏడుస్తుంది. ఆ రోజు మిమ్మల్ని డాడీ అని పిలిచానని ఎంత ఏడ్చిందో"

"మీ అమ్మ ఏడ్చిందా? " ఆనంద్ మనసులో అస్పష్టమైన వేదన.

"అవును. అమ్మ ఇక్కడికి వచ్చేలోగా చెప్పండి. మీరు మా డాడీ కాదా? "

ఆనంద్ పెదవి విప్పి ఏదో అనబోయాడు. ఇంతలో సరిత అక్కడికి వచ్చి వారిద్దరినీ చూసింది.

"రాహుల్! అక్కడేం చేస్తున్నావ్? ఇలా రా!" సీరియస్‌గా ధ్వనించిందామె స్వరం.

రాహుల్ ఆశాభంగం నిండిన చూపులతో ఆనంద్‌నొకసారి చూసి మౌనంగా తల్లి వెంట నడిచాడు.

మాధవి పిలవగానే అక్కడికి వచ్చినందుకు తనని తాను మనసులో నిందించుకుంది సరిత.

★ ★ ★

ఆ రాత్రి పదకొండు గంటలకి ఫోన్ మోగింది. నిద్రమాత్ర ప్రభావంతో శాంతమ్మ గాఢ నిద్రలో వుంది. సరిత వెళ్ళి ఫోన్ తీసి "హలో!" అంది.

**ఈ రాత్రి నీకో మధురమైన రాత్రిని గుర్తుచేద్దామని ఫోన్ చేశాను సరితా! నీకు గుర్తుందా? మన మొదటి రాత్రి నువ్వు తెల్లనిచీర, జాకెట్టు ధరించి, తలలో మల్లెలతో వెన్నెల కన్నెలా గదిలోకి వచ్చావు.**

"నేనే సరితా!" అదే పురుష స్వరం. "ఇప్పుడు మీకు ఇండియాలో రాత్రి పదకొండు గంటలయి వుంటుంది. అవునా? ఈ రాత్రి నీకో మధురమైన రాత్రిని గుర్తుచేద్దామని ఫోన్ చేశాను సరితా! నీకు గుర్తుందా? మన మొదటి రాత్రి నువ్వు తెల్లనిచీర, జాకెట్టు ధరించి, తలలో మల్లెలతో వెన్నెల కన్నెలా గదిలోకి వచ్చావు. చేతిలోని పాలగ్లాసుని నావైపు జాపిన నీ గోరింట పండిన చెయ్యెందుకమ్మా అంత వణికిపోయింది? నీ చేతిలోని గ్లాసందుకుని టేబిల్ మీద పెట్టి నిన్ను దగ్గరకి తీసుకుని నీ పెదవులపై నేను పెట్టిన తొలిముద్దు ఇప్పటికీ గుర్తుందా నీకు? " ఆగకుండా మాట్లాడుతున్నాడతను.

"షటప్!" అరిచింది. "రాస్కెల్! ఎవర్రా నువ్వు? "

"అదేమిటి సరితా? కట్టుకున్న మొగు

డిని 'రా' అంటున్నావ్? నువ్వెలా పిలిచినా ఇష్టమే అనుకో"

"స్కౌండ్రల్! నువ్వు నా భర్తవా? ధైర్యం వుంటే ఎదురుగా వచ్చి మాట్లాడు"

"నిజం, నేను నీ మొగుడినే. వాషింగ్టన్ నుంచి మాట్లాడుతున్నాను. మొన్నటి దాకా డెట్రాయిట్... ఇప్పుడు వాషింగ్టన్... ఏ స్టేట్ అయితేనేం అమెరికాలో వున్నాను" ఆ స్వరంలో మెత్తదనం తాచు పాము బుసలా వినిపిస్తోంది.

"సరితా! ఇక్కడ చలి వణికిస్తోంది. పక్కన నువ్వుంటే ఇద్దరం ఒకే దుప్పటిలో, గాలి కూడా మన శరీరాల మధ్య చొరబడలేనంత దగ్గరగా వుంటే ప్చ్! అంతవరకు ఒక ముద్దుతో సరిపెట్టుకుంటాను. ఏం? ప్చ్ ప్చ్!" అతను ఫోన్‌లో ముద్దు పెడుతున్నాడని అర్థమైన సరిత శరీరం జుగుప్సతో అసహ్యంగా వణికిపోతుంటే ఫోన్ పెట్టేసింది. మరు నిమిషం రిసీవర్ తీసి పక్కన పడేసింది.

**అంతవరకు ఒక ముద్దుతో సరిపెట్టుకుంటాను. ఏం? ప్చ్ ప్చ్! అతను ఫోన్‌లో ముద్దు పెడుతున్నాడని అర్థమైన సరిత శరీరం జుగుప్సతో అసహ్యంగా వణికిపోతుంటే ఫోన్ పెట్టేసింది. మరు నిమిషం రిసీవర్ తీసి పక్కన పడేసింది.**

ఆమె మనసులో ఏదో తెలియని అశాంతి! భయం ! వాడెవడు? ఎవరికి తెలుసు తన విడాకుల విషయం? తన భర్త అమెరికాలో వున్నాడని అబద్ధం చెబుతోందని ఎవరికి తెలిసిపోయింది? ఆలోచిస్తోంది. కణతలు బద్దలయిపోతున్నాయి.

హఠాత్తుగా స్ఫురించింది మాధవి. అవును. మాధవికి మాత్రమే తెలుసు. ఆమె ఎవరి చేతయినా ఫోన్లు చేయిస్తోందా? లేక ఆనందే చేస్తున్నాడా? ఆనంద్‌ని పెళ్ళిచేసుకోనన్నానని తనని భయపెట్టి అతనితో పెళ్ళికి ఒప్పించడానికి ఇది మార్గమనుకుందా? ఛ! కాదేమో! మాధవి అలా చెయ్యదు. కాని తన విడాకుల విషయం ఆమెకి తప్ప ఎవరికీ తెలియదే? సరితకి నిద్ర పట్టడం లేదు. మాధవిమీద అనుమానం... తన అనుమానం సరైనది కాదేమోననే అపనమ్మకం...

★ ★ ★

వర్ధనమ్మ మనసు వేదనాపూరితంగా వుంది. ఆవిడకి ఆనంద్‌ని మళ్ళీ పెళ్ళి చేసుకోమని అడగడానికే భయం వేస్తోంది. 'వాడు జీవితాంతం ఒంటరిగా ఏ సుఖానికీ నోచుకోకుండా బతకవలసిందేనా?' ఆవిడ మనసు ఆక్రోశిస్తోంది.

"ఆంటీ!" మాధవి పిలుపు వినిపించి, ఆవిడ కంగారుగా కళ్ళు తుడుచుకుంది.

"ఏమయిందాంటీ?" అని మాధవి ఆదరంగా అడిగేసరికి తన మనసులోని బాధని వెళ్ళగక్కింది.

మాధవి నివ్వెరపోయింది. "ఆనంద్ ఎప్పటికీ తండ్రి కాలేడా...ఇది నిజమా?"

"శిల్ప బతికి వున్నప్పటిమాట. పెళ్ళయి మూడేళ్ళయినా పిల్లలు పుట్టకపోవడంతో అమెరికాలో డాక్టరు అన్ని పరీక్షలూ చేసి లోపం ఆనంద్‌లోనే వుందని నిర్ధారించారుట. ఈ నిజం తెలిసీ వాడిని పెళ్ళి చేసుకోమని అడగడానికి నాకు నోరు రావడం లేదు" సాలోచనగా ఆమె భుజంపై చెయ్యి వేసి లోపలికి నడిపించింది మాధవి.

★ ★ ★

"అమ్మా!" రాహుల్ సరిత దగ్గరికి వచ్చి పిలిచాడు.

"ఏమిటి నాన్నా?"

"డాడీ అమెరికా నుంచి ఎప్పుడు వస్తారని అడగను. డాడీకి ఫోన్ చేసి మాట్లా

డతానని పేచీ పెట్టను. కాని..."

వాడేం అడుగుతాడో అని వేగంగా కొట్టుకునే గుండెతో ఎదురుచూస్తోందామె.

"డాడీ ఫొటో ఒకసారి చూపించమ్మా!"

సరిత ఉలిక్కిపడింది. అప్పటికే ఆమె ముఖం పాలిపోయింది.

"అమ్మా ప్లీజ్, డాడీ ఫొటో ఒకసారి చూపించవూ" సరితకి భర్త గుర్తుకొచ్చాడు. ఎంత అందమైనవాడు మోహన్! కాని, అతని అందమైన చర్మం కింద ప్రవహిస్తున్నది విషం. ఆ విషం తన జీవితంలో విషాదాన్ని నింపింది. వేదనగా నిట్టూర్చింది. మోహన్ నుంచి లీగల్‌గా విడిపోగానే కసితో తన పెళ్ళి ఫొటోలని కాల్చేసింది. ఇప్పుడు తండ్రి ఫొటో చూపించమని రాహుల్ అడుగుతున్నాడు. ఒకవేళ మోహన్ ఫొటో తన దగ్గర వుంటే మాత్రం అతనే నీ తండ్రి అని రాహుల్‌కి చూపించగలదా?

మరుక్షణం తట్టిన సమాధానాన్ని చెప్పింది. "డాడీ ఫొటో నా దగ్గర లేదు. ఆయనకి ఫొటో తీయించుకోడం ఇష్టం లేదు"

ఆ క్షణంలో రాహుల్ ముఖంలో వ్యక్తమయిన ఆశాభంగం ఆమె గుండె పిండినట్టయింది. వాడు తల వంచుకుని బయటకి వెళ్ళి వీధి మెట్లమీద కూర్చున్నాడు.

ఎదురుగా పిల్లలు ఆడుకుంటున్నారు. రాము, శ్రీధర్, సాయి, ఆదిత్య అందరూ హుషారుగా ఆడుకుంటున్నారు. ఆటల్లో గొడవపడి సాయి ఆదిత్యని కొట్టాడు. వాడు పెద్దగా ఏడవడం మొదలుపెట్టాడు. ఇంట్లోంచి ఆదిత్య తండ్రి వచ్చి వాడిని ఎత్తుకుని ఓదార్చసాగాడు. పిల్లలతో అతనూ ఆడడం మొదలుపెట్టాడు.

'అందరికీ నాన్న వున్నాడు. తనకి నాన్న వున్నా తనని చూడ్డానికి ఎప్పుడూ ఎందుకు రాడు' వాడి లేత మనసు అల్లకల్లోలంగా వుంది.

★ ★ ★

వకుళ చెప్పింది విన్న సూర్యకాంతమ్మ మురిసిపోయింది. "పోన్లే తల్లీ! అతనిలో మార్పు వచ్చింది. అది చాలు. పెళ్ళిదేముంది? కార్తీకమాసంలో కాకపోతే మార్గశిరమాసంలో చేసుకుందురుగాని" అని అంతలోనే ఏదో గుర్తుకొచ్చినట్టు అంది. "అవునూ రిజిస్టర్ పెళ్ళికి నెలరోజుల ముందర అప్లికేషన్ పెట్టుకోవాలి కదుటే... మార్గశిర మాసంలో పెళ్ళి అంటే ఈ నెలలో అప్లికేషన్ పెట్టుకోవద్దూ"

"ఆయనకి సెంటిమెంటు. ఈ నెలలో పెళ్ళి ప్రయత్నమే వద్దన్నారు."

"అయితే మాత్రం వచ్చేనెలలో పెళ్ళికి అప్లికేషన్ పెడితే జనవరిలో పెళ్ళెలా చేసుకుంటారు? పుష్యమాసం శూన్యమాసం కదుటే? మళ్ళీ మాఘమాసం వచ్చేదాకా ఆగాలి"

అంతలో ఫోన్ మోగింది. పక్కనే వున్న సూర్యకాంతమ్మ ఫోన్ ఎత్తబోతుంటే వకుళ ఒక్క గెంతులో వెళ్ళి ఫోన్ తీసింది. "వకుళా!" అవతల వసంత్ స్వరం వినగానే ఆమె ముఖం సంతోషంతో దీప్తివంతమయింది.

"ఏం చేస్తున్నావ్?"

"మిమ్మల్నే తలచుకుంటున్నాను"

"అవునా?" నవ్వేడు. "ఈ సాయంకాలం మనం షాపింగ్‌కి వెళ్ళాలి"

"ఏం కొనాలి?"

"నీకు నచ్చిన చీర"

"నాకు చీర ఎందుకు?"

"రేపు సాయంకాలం మనకో ప్రోగ్రామ్ వుంది. అప్పుడు నువ్వు కట్టుకుని రాడానికి"

"ఏమిటది?"

"ఇప్పుడు చెప్పను. సాయంకాలం చెబుతాను. నువ్వు మాత్రం సాయంకాలం

అయిదున్నరకి బజారుకి వచ్చెయ్యి. ఎక్కడికి రావాలంటే.." అతను షాపు పేరు చెప్పాడు. "నేను ఆఫీసునుంచి నేరుగా అక్కడికి వస్తాను ఒ.కె? బై!" అతను ఫోన్ పెట్టేసాడు.

వకుళ మనసు రెక్కలు సాచి ఎగురుతున్న విహంగంలా వుంది. ఆమె ఫోన్ పెట్టేసి విషయం తల్లికి చెప్పింది.

"అంతా బాగానే వుంది పెళ్ళి వాయిదా వెయ్యడం తప్ప"

"నువ్వాయన్ని అనుమానిస్తున్నావా?" ఛర్రుమంది.

"మీ ఆయనపై అనుమానం కాదు. మీ అత్తగారిపై అపనమ్మకం. మీరిద్దరూ కలిసి బతకాలనే నిర్ణయానికి వచ్చారు. ఆవిడ ఒక్కసారైనా నీకుగాని, నాకు గాని ఫోన్ చేసిందా? ఆవిడ మనసులో ఏం వుందో?"

"మనం మాత్రం ఆవిడకి ఫోన్ చేసామా? మనం ఆవిడతో మాట్లాడలేదని తనూ అనుకోవచ్చుగా?"

సూర్యకాంతమ్మ మాట్లాడలేకపోయింది. "వసంత్ మా అత్తగారిని క్షమాపణ అడగమన్నాడు. అడుగుతానన్నాను. మేమిద్దరం మళ్ళీ కలిసి బతకడానికి ఆవిడ సమ్మతించిందని చెప్పాడు."

"ఆ క్షమాపణేదో త్వరగా చెప్పి ఆవిడ మనసులో నువ్వు మంచి స్థానాన్ని సంపాదిస్తే బాగుంటుంది!"

"రేపు వసంత్ ఏదో ప్రోగ్రామ్ పెట్టాడు. అది కాగానే ఎల్లుండి నేనే స్వయంగా మా ఇంటికి వెళ్ళి ఆవిడని క్షమాపణ అడుగుతాను. సరేనా? అమ్మా! నువ్వులేని పోని భయాలేవీ పెట్టుకోకు. ఆయనలో చాలా మార్పు వచ్చింది. నా ఇష్టాలను, అభిప్రాయాలను గౌరవిస్తున్నాడు. అది చాలు. అతను గతంలో తను చేసిన తప్పులని మళ్ళీ చెయ్యడని నమ్మకం కలగడానికి" సూర్యకాంతమ్మ మనసు తేలిక పడింది.

★ ★ ★

"ఆ చీర... పేరట్ గ్రీన్ కలర్ చీర... ఎస్. అదే..." వసంత్ చెప్పాడు. సేల్స్ మేన్ తన ముందుంచిన ఆ చీరని వకుళ నోట మాట రానట్టు చూస్తోంది. తనకెంతో ఇష్టమైన కలర్. తన దగ్గర ఆ చీర వుంది. ఒకసారి సినిమాకి వెళ్తున్నప్పుడు తను ఆ చీర కట్టుకుంటే అతనెంత గొడవ చేసాడు? ఇప్పుడదే చీరని తన కోసం సెలెక్ట్ చేస్తుంటే ఆమె ఆశ్చర్యంగా, అయోమయంగా అతని వైపు చూస్తోంది.

"ఈ కలర్ నీకిష్టం కదూ?"

"మీకు ఇష్టం లేదుగా?"

"క్షమించు వకుళా! అప్పట్లో మూర్ఖంగా ప్రవర్తించాను. నా ఇష్టాలను బలవంతంగా నీపై రుద్దేవాడిని ఇంక నుంచి నీ ఇష్టమే నా ఇష్టం"

వకుళ కళ్ళలో నీళ్ళు. "ఆరోజు మనం సినిమాకి బయలుదేరాం. నేను ఇదే రంగు చీర కట్టుకున్నాను. మీకు ఆ చీర ఇష్టంలేదని మార్చుకోమన్నారు. నేను మీతో వాదించడమే కాదు, ఆడదానిలా ప్రవర్తించలేదు. చాలా ఛండాలంగా బిహేవ్ చేసాను" తనూ పశ్చాత్తాపం వ్యక్తం చేసింది డగ్గుత్తికతో.

"ష్! షాపులో అందరూ చూస్తారు. కళ్ళు తుడుచుకో" వసంత్ చిన్నగా అన్నాడు.

వకుళ చప్పున కళ్ళొత్తుకుంది. "ఈ చీర నీకు నచ్చిందా?"

"నచ్చింది. మీకు నచ్చింది కాబట్టి ఇంకా నచ్చింది" అతను బిల్ పే చేసాడు. ఇద్దరూ బయటకు వచ్చారు.

"రేపు సాయంకాలం ఏదో ప్రోగ్రామ్ అన్నారుగా? ఏమిటది?" కుతూహలంగా అడిగింది.

"రేపు సాయంకాలం నువ్వీ చీర కట్టు

కుని మన ఇంటికిరా"

"అతను మన ఇంటికి" అనడం ఆమెకి నచ్చింది. "పెళ్ళయ్యాక ఎలాగా వస్తానుగా"

"పెళ్ళయ్యేవరకు మనమిద్దరం లవర్స్ మని చెప్పానుగా? ప్రియుడు ఎక్కడకి రమ్మన్నా 'నో' అనకూడదు"

"అయితే 'ఎస్' అంటాను"

"దట్స్ గుడ్!" అన్నాడతను హుషారుగా.

★ ★ ★

"నీ చీర చాలా బాగుంది సరితా!" అంది విరజ.

"ఎక్కడ కొన్నావ్?"

"సరితనా ఆ ప్రశ్న అడుగుతున్నావ్? తను కట్టుకునే ప్రతిచీర, మెడలోని పూసలు, హేండ్‌బేగ్, చివరికి నెయిల్ పాలిష్ అన్నీ అమెరికా నుంచి వాళ్ళాయన పంపినవే కదూ సరితా?" అంది ప్రమీల.

'అమెరికా' అనే మాట వినగానే సరిత ముఖంలో రంగులు మారాయి. ఆమె బలవంతాన నవ్వుతూ అంది "అవును".

"ఈ క్రీమ్ కలర్ షిఫాన్ చీర నీ ఒంటికి బాగా నప్పింది" అంది ప్రమీల మెచ్చుకోలుగా.

"థాంక్‌యూ" అని లంచ్ తిన్నానని పించి అక్కడ నుంచి, తన కేబిన్‌లోకి వెళ్ళిపోయింది. మాధవి అప్పుడే లంచ్ ముగించి చేతులు నేప్‌కిన్‌తో తుడుచుకుంటోంది. సరితని చూసి నవ్వుతూ అడిగింది.

"లంచ్ తిన్నావా? ఇంత త్వరగానా?"

"తిన్నాను మేడమ్" ముక్తసరిగా అని ఫైలు ఓపెన్ చేసింది.

"నేను నీతో కొంచెం మాట్లాడాలి సరితా!"

"మీరు నాతో ఏం మాట్లాడాలనుకుంటున్నారో నాకు తెలుసు. నా సమాధానం కూడా ఇదివరకే చెప్పాను. దయవుంచి ఆ ప్రస్తావన ఇంకెప్పుడూ తేవద్దు" ఖచ్చితమైన స్వరంతో అంది.

"నేను నీతో మాట్లాడాలనుకుంటున్నది ఆనంద్ విషయం కాదు. మీ అమ్మగారి విషయం" సరిత ఆశ్చర్యంగా చూసింది.

"అవును. నువ్వు గమనించావో లేదో గాని ఆవిడ ఈమధ్య నీరసించిపోతున్నారు. మొన్న నువ్వు మార్కెట్‌కి వెళ్ళినప్పుడు నేను మీ ఇంటికి వచ్చాను. ఆవిడ కళ్ళు తిరుగుతున్నాయని పడుకుని వున్నారు. ఆంటీకి షుగర్‌గాని, బి.పి. గాని వున్నాయా?"

ఆమెకి సిగ్గేసింది. కన్నకూతురై వుండీ తను తల్లిలోని మార్పుని కనిపెట్టలేక పోయింది. మాధవి ఆ మార్పుని గమనించింది. తనకీ మధ్య టెన్షన్స్ పెరిగిపోతున్నాయి.

"బి.పి. వుంది. షుగర్ వుందో లేదో మరి" అంది.

ఆమెకి సిగ్గేసింది. కన్నకూతురై వుండీ తను తల్లిలోని మార్పుని కనిపెట్టలేక పోయింది. మాధవి ఆ మార్పుని గమనించింది. తనకీ మధ్య టెన్షన్స్ పెరిగిపోతున్నాయి. రాహుల్ పదే పదే తండ్రి గురించి అడగడం వాడికేం సమాధానం చెప్పాలో తెలియక తను అంతర్మథనానికి లోనవడం, అపరిచిత వ్యక్తి ఫోన్ కాల్స్... సరితకి ఆ ఫోన్ కాల్స్ గుర్తు రాగానే చప్పున తలెత్తి మాధవి ముఖంలోకి చూసింది. ఆ ఫోన్ కాల్స్ మాధవే ఆనంద్ చేత చేయిస్తోందా? అని మరోసారి అనిపించిందామెకి. కాని నిష్కల్మషమైన మాధవి ముఖం చూస్తే తను అనవసరంగా అనుమానిస్తోందనిపించింది.

"నా ఉద్యోగం... ఇంటిపనితో బిజీగా వుండి నేనీవిషయం గమనించలేదు మేడమ్! అమ్మ కూడా తనకి ఒంట్లో బాగా లేదని చెప్పలేదు. రేపు అమ్మని డాక్టర్ దగ్గరికి తీసుకెళ్తాను. నాకు లీవ్ ఇవ్వగ లరా? "

"ఒ. కె." అంది.

ఆ సాయంకాలం ఆఫీసు నుంచి ఇంటికి రాగానే తల్లి అందిస్తున్న కాఫీని అందుకో కుండా ఆవిడని పరిశీలనగా చూసింది.

"ఏమిటి, అలా చూస్తున్నావ్? "

"నీకు కళ్ళు తిరిగినట్టనిపిస్తోందా? "

"ఎందుకలా అడుగుతున్నావ్? "

"ముందు జవాబియ్యి".

"ఆమధ్య కొంచెం"

"నాకెందుకు చెప్పలేదు నువ్వు? నాకంటే మాధవి ఎక్కువయి పోయింది కదూ నీకు? "

"మాధవి చెప్పిందా? " తేలిగ్గా నవ్వింది. "ఒకరోజు నువ్వు రాహుల్‌ని తీసుకుని మార్కెట్టుకి వెళ్లావు చూడు. అప్పుడు ఆ అమ్మాయి వచ్చింది. కొంచెం కళ్లు తిరుగు తున్నాయని పడుకునే వున్నాను. తనే డాక్టర్ దగ్గరికి తీసుకెళ్తాను రమ్మని బల వంత పెట్టింది. నీకిష్టం వుండదని వద్ద న్నాను"

"నువ్వివాళ్టినుంచి ఏపనీ చెయ్యద్దు. అంతేకాదు. రేపు మనం డాక్టర్ దగ్గరకి వెళ్తున్నాం. టెస్ట్‌లన్నీ చేయించి అవి, నార్మ ల్‌గా వున్నాయని డాక్టర్ చెప్పేవరకు, నువ్వసలు వంటగదిలోకి రావడానికి వీల్లేదు" సరిత కాఫీ ఒక్క గుక్కలో తాగి పైటకొంగు దోపి వంటగదిలోకి జొరబ డింది.

"నాకేమిటే దుక్కలా వున్నాను. మూడు పూటలా సుష్టుగా తింటున్నాను. మనిష న్నాక కాళ్లనెప్పులు రావా? తల తిరగదా? కాస్త దానికి ఇంత హడావుడి చేస్తున్నావ్? పగలంతా ఆఫీసులో పనిచేసి మళ్లీ ఇంటి కొచ్చి వంట చేస్తావా? నేను వంట ఒక్క టేగా చేస్తున్నాను. మిగతా పనంతా నువ్వే చేస్తున్నావ్‌గా? నామాట విను. వంట ఒక్కటయినా నన్ను చెయ్యనియ్యి. అదీ చెయ్యకపోతే పిచ్చెక్కుతుంది" అని లబ లబ లాడుతున్నా ఆవిడ మాట వినిపించు కోలేదు.

వంట పూర్తవగానే రాహుల్‌కి అన్నం తినిపించింది. తను స్నానం చేసి వచ్చి తల్లికి, అన్నం పెట్టి తను తింది. తర్వాత వంటిల్లు సర్ది, పడుకుంది. పగలంతా ఆఫీ సులో ఇంటికి వచ్చాక సాయంకాలం ఆరు గంటల నుంచి రాత్రి తొమ్మిది గంటలవ రకు ఇంట్లోను నిర్విరామంగా పనిచేసిన ఆమె పక్కమీదకి చేరగానే నిజానికి నిద్ర ముంచుకురావాలి. కల్లోల కడలిలా వున్న ఆమె మనసు నిద్రని దరికి రానివ్వడం లేదు.

ఫోన్ మోగింది. ఉలిక్కి పడింది. ఫోన్ ఆగకుండా మోగుతూనే ఉంది. శాంతమ్మ నిద్ర మత్తులో అటు నుంచి ఇటు కదిలి అంది.

"సరితా! ఫోన్ చూడు"

సరిత తడబడే అడుగులతో ఫోన్ దగ్గ రకి నడిచింది. కంపిస్తున్న చేతులతో ఫోన్ లిఫ్ట్ చేసిందీ.

"హలో"

"హాయ్ సరితా! అదే స్వరం"

సరిత పెదవులు బిగపట్టింది.

"నేను అమెరికా నుంచి పంపిన క్రీమ్ కలర్ చీర నీకు నచ్చిందా? "

షాకయిపోయింది. "ఎవడు వీడు? నిజంగా తనే అమెరికా నుంచి చీర పంపి నట్టు చీర రంగుతో సహా చెబుతున్నాడు? తనీ రోజు ఆ చీర కట్టుకున్న సంగతి వీడి కెలా తెలిసింది? "

"ఎవరు నువ్వు? " పదునుగా అడిగింది.

"కట్టుకున్న భర్తనే గుర్తించలేని స్థితిలో వున్నావా? "

"అబద్ధం! నువ్వు నా భర్తవి కావు"

"నిజం సరితా! నేను నీ భర్తనే? "

"ఒ. కె. నువ్వు నాభర్తవే అయితే నీపేరే మిటో చెప్పు"

"శ్రీకృష్ణుడు ఏపేరుతో పిలిచినా పలికే వాడుట. అలా నువ్వు ఏ పేరుతో పిలిచినా పలుకుతాను."

"షటప్ స్కాండ్రల్!" ఆమె ఫోన్ పెట్టేసింది. ఫోన్ మళ్లీ మోగింది. ఆమె రిసీవర్ పక్కన పడేసింది. వచ్చి మంచం మీద పడుకుంది.

"సందేహం లేదు. మాధవే ఇదంతా చేస్తోంది. పొద్దుట తను క్రీమ్ కలర్ షిఫాన్ చీర కట్టుకునే ఆఫీసుకి వెళ్లినప్పుడు ఆమె ప్రశంసాపూర్వకంగా చీరవైపు చూడటం తను గమనించింది. ఇలాంటి పరిస్థితులలో తను ఇంక మాధవి దగ్గర ఉద్యోగం చెయ్యలేదు. చెయ్యకూడదు" స్థిరంగా అనుకుంది.




శాంతమ్మని పరీక్షించిన డాక్టర్ ఆవిడకీ బ్లడ్ టెస్టులు వ్రాసిచ్చారు. టెస్ట్ రిపోర్టులు వచ్చాక డాక్టరు చెప్పింది విన్న సరిత ప్రాన్పడిపోయింది. ఆవిడకి బి.పి. రెయిజయిందని, బ్లడ్‌లో షుగర్ కొద్దిగా పెరిగిందని, ఆహార నియమాలు పాటిస్తూ, మందులు వాడితే సరిపోతుందని చెప్పారు డాక్టరు. తల్లికి ఇదివరకు వున్న బి.పి.కి ఇప్పుడు షుగర్ తోడయింది. ఆవిడ వయసురీత్యా అవి రెండు అనారోగ్య కారకాలేనని ఆమెకి తెలుసు. తల్లి ఆరోగ్యం క్షీణిస్తోంది. తన కాపురం ముక్కలయిందని తెలిసి తండ్రి హార్ట్ ఎటాక్‌తో మరణించాడు. తల్లి నిరంతరం తన గురించి ఆలోచిస్తూ టెన్షన్‌తో ఆరోగ్యాన్ని పాడుచేసుకుంది. తల్లి లేకుండా ఈ ప్రపంచంలో ఒంటరిగా ఎలా బతకగలదు? ఆమెకి దుఃఖం వచ్చింది.

ఆ రాత్రి నిద్రమాత్ర వేసుకున్నా శాంతమ్మకి నిద్ర పట్టలేదు. తన ఆరోగ్యం క్షీణిస్తోంది. మీద పడుతున్న వయసు తన అయుర్దాయం తగ్గిపోతోందని హెచ్చరిస్తోంది. తనకేమయినా అయితే సరిత ఒంటరిగా ఎలా బ్రతుకుతుంది? మళ్లీ పెళ్లి చేస్తే? అయినా తన పిచ్చిగాని, ఒకసారి పెళ్లయి బిడ్డ తల్లయిన ఆడదాన్ని ఎవరు పెళ్లి చేసుకోడానికి ముందుకొస్తారు. పసివాడితో ఒంటరిగా ఈ కుళ్లు ప్రపంచంలో ఎలా బతుకుతుంది? క్షణక్షణానికీ గుండె బరువు పెరిగిపోతోంది.

ఫోన్ మోగింది. సరిత ఉలిక్కి పడింది. శాంతమ్మకి ఇంత రాత్రివేళ ఎవరు ఫోన్ చేసారో అర్థం కాలేదు. గత రాత్రి కూడా ఫోన్ మోగడం సరిత మాట్లాడ్డం గుర్తుకొచ్చింది. 'ఎవరు చేసారు? గిరిధరా? ఈసారి కొడుకు ఫోన్ చేస్తే సరిత విషయం మాట్లాడాలి' ఆవిడ ఆలోచిస్తోంది.

సరిత ముందు గదిలోకి వెళ్ళి ఫోన్ లిఫ్ట్ చేసింది. ఏం మాట్లాడాలో ముందే ఆలోచించుకుందేమో ధైర్యంగానే వుంది.

"హలో!"

"హలో డియర్ ఎలా వున్నావ్? " అదే స్వరం.

"షటప్ రాస్కెల్! టెలిఫోన్స్ డిపార్ట్‌మెంట్ నా ఫోన్‌ని టాప్‌చేస్తోంది" తెల్లారేసరికల్లా నీ ఇంటికి పోలీసులు వచ్చి నిన్ను అరెస్ట్ చేస్తారు. రెడీగా వుండు" బెదిరింపుగా అంది.

"అదేమిటి సరితా! కట్టుకున్న భర్తనే అరెస్ట్ చేయిస్తావా? నీ కౌగిలిలో బందీ చేస్తాననను. సంతోషిస్తాను. నిజం డియర్! ఇంక నీకు దూరంగా వుండడం నా వల్ల కాదు. అందుకే ఎల్లుండి ఈ పాటికి ఇండియాలో... మీ వూళ్లో... మీ ఇంట్లో.. నీ కౌగిలిలో కరిగిపోతూ ఇన్నాళ్ళ విరహానికి నీ నుంచి వడ్డీతో సహా వసూలు చేసుకుంటాను. ఎల్లుండి సాయంకాలం అయిదు గంటలకు మీ ఇంటికి వస్తాను. ఒ.కె? గుడ్‌నైట్ డియర్!" ఫోన్ పెట్టేసాడతను.

సరితలో రక్తప్రసరణ ఆగినట్టయింది. ఎల్లుండి సాయంకాలం నిజంగానే ఆ వ్యక్తి, తన ఇంటికి వస్తాడా? వస్తే ఏం చెయ్యాలి? భగవంతుడా! ఎలాంటి విషమ పరిస్థితిలోకి నెట్టేసావు నన్ను!"

ఆమె వెక్కి వెక్కి ఏడుస్తోంది.

హఠాత్తుగా ఆమె భుజంపై ఎవరిదో చెయ్యిపడింది. ఉలిక్కిపడి తల ఎత్తి చూసిన సరిత తల్లిని చూసి కలవరపడింది.

"ఎవరు సరితా? "

సరిత ఏడుస్తూ గత కొద్ది రోజులుగా తనకి ఎవరో ఫోన్ చేసి అసభ్యంగా మాట్లాడుతున్నాడని చెప్పింది తర్వాత.

"ఇదంతా ఎవరు చేస్తున్నారో నాకు తెలుసు" కళ్ళు తుడుచుకుంటూ అంది.

"ఎవరు? " గుండె దడదడలాడుతుండగా తల్లి అడిగింది.

"మాధవి" సరిత స్వరంలో ఏహ్యత.

"మాధవా? " తెల్లబోయిందావిడ. "ఛ! నువ్వు పొరపాటు పడుతున్నావ్ సరితా!"

"నాకు విడాకులయిన విషయం మాధవికి ఒక్కర్తికే తెలుసు. నన్నేదో ఉద్ధరించాలని తన ఫ్రెండ్ ఆనంద్‌ని పెళ్ళి చేసుకోమని అడిగింది. అదే... ఆ రోజు రాహుల్ డాడీ అని పిలిచాడే అతన్నే... నాకిష్టం లేదన్నాను. అతన్నే కాదు. ఈ జన్మలో ఎవరినీ పెళ్ళి చేసుకునే ఉద్దేశం లేదన్నాను. అదుగో అప్పటినుంచి ఈ ఫోన్‌కాల్స్ మొదలయ్యాయి. నేను ఎలాగైనా ఆనంద్‌ని పెళ్ళి చేసుకోవాలని నన్ను బెదిరించో, భయపెట్టో ఒప్పించాలని చూస్తోంది"

"నువ్వు పొరపాటు పడుతున్నావమ్మా! మాధవి అలాంటిది కాదు"

"ఛ! ఆవిడ పేరెత్తకు. రేపే ఆ ఉద్యోగానికి రిజైన్ చేస్తాను. అంతేకాదు ఇక్కడ నుంచి దూరంగా ఎక్కడికైనా వెళ్ళిపోతే తప్ప నన్ను పట్టి పీడిస్తున్న పీడ వదలదు' ' అని సరిత విసురుగా గదిలోకి వెళ్ళిపోయింది.

శాంతమ్మకి సరిత మాటలలో 'పీడ' ఎవరో అర్థమైనా మాధవిని మాత్రం అనుమానించలేకపోతోంది.

★ ★ ★

వకుళ అద్దంలో తననితాను పరిశీలించుకుని హేండ్‌బ్యాగ్ చేతిలోకి తీసుకుంది.

"అమ్మా! వెళ్ళొస్తాను"

"జాగ్రత్త! మీ అత్తగారు పాత విషయాలని మనసులో పెట్టుకుని కోపంలో ఏదైనా అన్నా ఎదురు చెప్పకు. పెద్దవాళ్ళు చెడ్డవాళ్ళు కారు"

"అలాగే" వకుళ చెప్పులు తొడుక్కుంది. ఇంతలో ఫోన్ మోగింది. "అమ్మా! ఫోన్ చూడు. నేను వెళ్తున్నాను" హడావుడిగా మెట్లు దిగింది.

సూర్యకాంతమ్మ ఫోనెత్తింది.

"ఎవరు? "

"నేను వసంత్‌నండి, వకుళ వుందా? "

"మీ ఇంటికే బయలుదేరింది బాబూ!



పిలవమంటారా? "

"పిలవండి"

ఆవిడ మౌత్‌పీస్ చేత్తో మూసి బిగ్గరగా కూతుర్ని పిలిచింది. గేటు దాటబోతున్న ఆమె విసుగ్గా చూసింది.

"ఫోన్ నీకే! మీ ఆయన."

వకుళలోని విసుగు ఎగిరిపోయింది. సంభ్రమంగా వెనక్కి వచ్చి ఫోన్ అందుకుంది.

"ఏమిటి వకుళా? బయలు దేరావా? "

"అవును"

"నువ్వీవేళ మా ఇంటికి రావద్దు. ఇవాళ మంచిరోజు కాదుట. అమ్మ చెప్పింది. ఆదివారం సాయంకాలం రమ్మంది. మరిచి పోకేం? బై!"

అతను ఫోన్ పెట్టేసాడు.

"ఏమంటాడే? " సూర్యకాంతమ్మ అడిగింది.

చెప్పింది నిరాశగా వకుళ.

"పోన్లే అదివారం ఎంతలో వస్తుంది? " అంది సూర్యకాంతమ్మ కూతురిలోని ఆశా భంగానికి ఓదార్పుగా. వకుళ చీర మార్చు

కోడానికి లోపలకి వెళ్ళింది.

★ ★ ★

తన కేబిన్‌లోకి వస్తున్న సరితని చూసి మాధవి చిరునవ్వుతో అంది.

"గుడ్ మార్నింగ్ సరితా!"

"నిజం. ఇంక నాకు ప్రతీ రోజూ శుభోదయమే"

మాధవి తెల్లబోయింది.

సరిత తన చేతిలోని కవరుని ఆమెకిస్తూ "ఇది నా రాజీనామా!" అంది.

మాధవి షాకయిపోయింది. "ఎందుకు రాజీనామా చేస్తున్నావ్ సరితా? " ఆశ్చర్యంగా అడిగింది.

"వ్యక్తిగత కారణాల వల్ల. ఆ విషయమే వ్రాసాను. నిజానికి మీ వేధింపులకి తట్టుకోలేక ఉద్యోగం మానేస్తున్నానని వ్రాయాలి"

"ఎందుకు రాజీనామా చేస్తున్నావ్ సరితా?" ఆశ్చర్యంగా అడిగింది. "వ్యక్తిగత కారణాల వల్ల. ఆ విషయమే వ్రాసాను. నిజానికి మీ వేధింపులకి తట్టుకోలేక ఉద్యోగం మానేస్తున్నానని వ్రాయాలి"

"నేను నిన్ను వేధిస్తున్నానా? నువ్వేదో అపార్థంలో వున్నావు? "

"అవును వేధిస్తున్నారు. నా మాజీ భర్తతో మీకున్న బంధుత్వం కారణంగా నేను భర్తనుంచి విడిపోయి వేరేగా బతుకుతున్నానని మీకు తెలుసు. మీ ఒక్కరికే తెలుసు. నొక్కి పలుకుతూ అంది. అంతే కాదు. మీకు నా బలహీనతలు కూడా తెలుసు. నా భర్త అమెరికాలో వున్నాడని లోకాన్ని నమ్మిస్తున్నానని తెలుసు. మీరు నన్ను ఉద్ధరించాలని మీ ఫ్రెండ్ ఆనంద్‌ని పెళ్లి చేసుకోమని అడిగారు. నేను కాదన్నాను. అతన్ని ఎలాగైనా నేను పెళ్లి చేసుకోవాలని మీరు ఎన్ని ఎత్తులు వేసారు? అమెరికా నుంచి నా భర్త ఫోన్ చేస్తున్నట్టు ఆనంద్‌తో చేయిస్తున్నారు. మరోసారి చెబుతున్నాను. మీరు మీ ఆనంద్ కలిసి ఎన్ని కుయుక్తులు పన్నినా నన్నేమీ చెయ్యలేరు. మీరు స్త్రీ! స్త్రీలా బిహేవ్ చెయ్యండి. డోంట్ బిహేవ్ లైక్ ఎ వేంప్! గుడ్‌బై!" సరిత డోర్ తీసుకుని చరచర బయటకి వచ్చింది. వీలైనంత త్వరలో ఈ ఊరొదిలి వెళ్లాలని అప్పుడే నిర్ణయించింది.

ఆ సాయంకాలం సరిత రాహుల్‌ని తీసుకుని బయటికి వెళ్లడం చూసి మాధవి శాంతమ్మ దగ్గరికి వచ్చింది.

"రామ్మా! మాధవీ!" శాంతమ్మ అదే ఆదర స్వరంతో ఆహ్వానించింది.

"మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలని వచ్చాను పిన్నిగారూ!" మాధవి నేరుగా విషయంలోకి వచ్చింది.

"ఏమిటమ్మా? "

"సరిత ఉద్యోగానికి రిజైన్ చేసింది" అంటూ సరిత తనని అన్న ప్రతి మాటనీ చెప్పింది. "ఆమె నన్ను అపార్థం చేసుకుంది"

శాంతమ్మ ముఖం మ్లానమైంది. "అమ్మాయి తరఫున నేను నిన్ను క్షమాపణ అడుగుతున్నాను మాధవీ!"

"పెద్దవారు. మీరు నన్ను క్షమించమని అడగకూడదు. అయినా నేనా విషయం చెబుతున్నది సరితపై మీకు ఫిర్యాదు చేయడానికి కాదు. ఆమె మనసులో నాపై ఎందుకు అపార్థం ఏర్పడిందని. నేనామెని నా ఫ్రెండ్ ఆనంద్‌ని పెళ్ళి చేసుకోమని అడిగిన మాట నిజం. ఆమె కాదన్నది. మోహన్ వల్ల మోడువారిపోయిన ఆమె జీవితంలో ఆనంద్ మళ్ళీ వసంతాన్ని నింపగలడని నా నమ్మకం"

"మోహన్ నీకెలా తెలుసు? " శాంతమ్మ

దిగ్భ్రమగా అడిగింది.

"మోహన్ నా పిన్ని కొడుకు."

శాంతమ్మ భయంగా చూసింది. ఇన్నాళ్ళూ తను ఆదరించిన మాధవి, తన అల్లుడి బంధువని తెలియగానే ఆవిడ కల వరపడింది.

"మీరు నన్ను నమ్మవచ్చు పిన్నిగారూ! మోహన్ లాంటి క్రూరుడు, శాడిస్టు సరిత లాంటి మంచి అమ్మాయికి ఏవిధంగానూ సరిజోడు కాడు. కొంతలో కొంత అతను విడాకులకి అంగీకరించి మీ అమ్మాయికి మేలే చేశాడు"

"నువ్వు మోహన్ బంధువనే విషయం సరితకి తెలుసా? "

"తెలుసు. చెప్పాను. పెళ్ళి పీటలమీద సరితని చూసిన నేను మళ్ళీ ఆమె ఆఫీసులో ఉద్యోగానికి వచ్చినప్పుడు చూశాను. సరిత మోహన్ భార్య అవునా కాదా అని నిర్ధారించుకోవడానికే పదేపదే ఆమె భర్త గురించి అడిగేదాన్ని. అందుకు కూడా సరితకి నాపై కోపం వుంది" క్షణం ఆగి అంది.

"నేను ఆనంద్ చేత ఆమె భర్త అమెరికా నుంచి చేస్తున్నట్టు ఫోన్ చేయిస్తున్నానని నాపై నింద మోపింది. అసలు ఏమిటీ ఫోన్ కాల్స్? ఎవరు చేస్తున్నారు? "

శాంతమ్మ కన్నీళ్ళతో ఆ వ్యక్తి ఫోన్‌లో సరితనెలా వేధిస్తున్నదీ చెప్పింది.

"రేపు సాయంకాలం ఆ వ్యక్తి మా ఇంటికి వస్తాడటమ్మా? ఏదో గుట్టుగా బతుకుతున్నాం. మగదిక్కు లేనివాళ్లం. ఆడపిల్లని ఆ దుర్మార్గుడు ఏం యాగీ చేస్తాడోనని భయంగా ఉంది."

మాధవి నిటారుగా అయింది. "రేప తను వస్తాడా? నిజంగానా? "

"నిజమో, బెదిరింపో తెలియదు. నిజంగా వస్తే ఏం చెయ్యాలో అర్థం కాకుండా ఉంది"

"మీరేం భయపడకండి. నేను చూసుకుంటాను. మీరీ విషయాలన్నీ నాతో చెప్పినట్టు సరితకి తెలియకూడదు"

"చెప్పను" అందావిడ.

★ ★ ★

రాహుల్ స్కూల్‌కి, శాంతమ్మ గుడికి వెళ్ళారు. సరిత ఒక్కర్తీ ఇంట్లో ఉంది. నిన్న ఉద్యోగానికి రాజీనామా ఇచ్చాకే ఇవాళ ఆఫీసుకి వెళ్లక్కర్లేదని తెలిసీ అలవాటు ప్రకారం త్వరగా లేచింది. తల్లిని వంటగదిలోకి రానివ్వకుండా వంట తనే చేసింది. అయినా ఆ పని కూడా త్వరగా అయిపోయి ఖాళీగా వుండి ఏం చెయ్యాలో దిక్కుతోచక గదులన్నీ బూజులు దులిపి శుభ్రం చెయ్యడం మొదలుపెట్టింది. "ఎలాగో ఈ ఊరి నుంచి వెళ్ళిపోదామంటున్నావ్‌గా? ఈ ఇల్లు మనకు శాశ్వతమా? ఎందుకీ సింగారాలన్నీ? " అంది శాంతమ్మ.

"ఉన్నన్నాళ్ళైనా శుభ్రం చేసుకోమా? " అంది.

శాంతమ్మ నిట్టూర్చింది. ఊరొదిలి పోవడం ఈ సమస్యకి పరిష్కారం కాదని ఆవిడకి తెలుసు. మగతోడులేని వయసులో వున్న ఆడపిల్లంటే అందరికీ చులకనే. సరిత స్నానంచేసి వచ్చాక అందావిడ.

"నేను సూర్యకాంతమ్మగారితో కలిసి గుడికి వెళ్ళొస్తాను"

"సరే" అంది సరిత జుట్టు చిక్కుతీసుకుంటూ. తల్లి వెళ్ళాక తలుపులు మూసి ఆలోచనలో పడింది.

మాధవికి, ఆనంద్‌కి భయపడి ఈ ఊరి నుంచి వెళ్ళిపోవాలనుకోడం సబబేనా? అలవాటయిన ఊరు... అంతకంటే అలవాటయిన పరిసరాలు... అది కాదు అసలు సమస్య. పరీక్షలు నాలుగు నెలల్లో వుండగా ఇప్పుడు రాహుల్‌ని స్కూలు

మార్చాలి. పెద్దవయసులో తల్లిని కూడా ఇబ్బంది పెట్టాలి. దీనికంతటికీ కారకురాలు మాధవి కదూ! తన మానాన ఉద్యోగం చేసుకుంటూ ఎవరి జోలికి వెళ్ళని తనపై ఆనంద్‌ని ఉసిగొల్పుతుందా? అన్నట్టు ఇవాళ సాయంకాలమే కదూ ఆనంద్ వస్తానన్నది? నిజంగా వస్తాడా? రానియ్. పళ్ళు రాలగొట్టి పంపు తాను ఉద్రేకంతో వణుకుతుండగా గదంతా పచార్లు చేస్తోంది.

కాలింగ్‌బెల్ మోగింది. పాలవాడో, కూరలబ్బాయో అనుకుంటూ తలుపు తెరిచింది.

ఎదురుగా నిలబడివున్న వ్యక్తిని చూసి అప్రయత్నంగా ఒక అడుగు వెనక్కి వేసింది.

ఆనంద్!

"హలో!" అతను నవ్వేడు.

సరిత తేరుకుని తలుపు మూసేసేలోగా అతను బలంగా నెట్టుకుని లోపలికి వచ్చాడు.

"ఓ మై డార్లింగ్ సరితా! ఎలా వున్నావ్?"

"షటప్ అండ్ గెటవుట్!" అరిచింది తలుపుని చూపిస్తూ.

"కోపంలో మరింత అందంగా వున్నావు డార్లింగ్!" అతను కాంక్షగా ఆమెవైపు చూస్తూ అన్నాడు.

"ఇంట్లో ఎవరూ లేనట్టున్నారే! మనకి మంచి ఛాన్స్ కదా! రాత్రిదాకా ఆగడమెందుకు ఇప్పుడే" కన్నుగీటి నవ్వేడు.

"మర్యాదగా బయటికి నడుస్తావా? లేకపోతే అరిచి అల్లరి చేస్తాను" బెదిరింపుగా అంది.

"అరుస్తావా? అరు. భార్యాభర్తల గొడవలలో ఎవరైనా కలుగచేసుకుంటారేమో చూద్దాం"

"నువ్వు నా భర్తవా? ఛీ!" చీత్కరించింది.

"అదేమిటి సరితా? నీ మొగుడు అమెరికాలో వున్నాడని అందరికీ చెబుతున్న దానివి నువ్వు! తన అల్లుడి పేరు ఆనంద్ అని చెబుతున్నది మీ అమ్మ. నేను ఆనంద్‌ని. అమెరికా నుంచే వచ్చాను. నేను ఇంటికొస్తే చేసే మర్యాద ఇదేనా?" అంటూ అతను చటుక్కున వీధి తలుపు వేసేసాడు.

సరిత అరవబోయింది. కాని, భయంతో గొంతు పెగలలేదు. అతను ఆమెని ఒక బొమ్మని ఎత్తినట్టు రెండు చేతుల మధ్య ఎత్తి బెడ్ రూమ్‌లోకి నడిచాడు. ఆమె ప్రతిఘటన అతని పశుబలం ముందు ఓడిపోయింది.

★ ★ ★

కెవ్వుమంటూ లేచి కూర్చుంది సరిత. ఆమె శరీరం స్వేదమయమయింది. తన గుండె కొట్టుకుంటున్న శబ్దం తనకే వినిపిస్తుండగా మోకాళ్ళ మధ్య తలానించి కళ్ళు మూసుకుంది. జరిగినదంతా నిజం కాదని కలేనని తెలిసినా ఆమె గుండె వేగం తగ్గలేదు.

సాయంకాలం అయిదు గంటలయింది. రాహుల్ స్కూల్ నుంచి వచ్చి హోమ్‌వర్క్ చేసుకుంటున్నాడు. శాంతమ్మ, సరిత ఇద్దరూ వాడి దగ్గరలోనే చెరో కుర్చీలో కూర్చున్నారు. ఆ ఇద్దరూ వీధి గేటు తీసుకుని రాబోయే వ్యక్తి కోసం నిరీక్షిస్తున్నారు. సరితని ఫోన్‌లో వేధిస్తున్న వ్యక్తి ఆనంద్ కాదని శాంతమ్మకి తెలుసు. అయితే ఆమెని వేధించే వ్యక్తి ఎవరు? అతను నిజంగానే ఇక్కడికి వస్తాడా? వస్తే ఏం చెయ్యాలి?

ఆనంద్ ఇప్పుడు తన ఇంటికొస్తాడని సరిత మనసు చెబుతోంది. అతను వస్తే ఏం చెయ్యాలో ముందే ఆలోచించుకుంది. గేటు తీసిన శబ్దమయింది. ఆ శబ్దం




## నెత్తిన పూలగుత్తి

తలమీద పూలగుత్తి పెట్టుకున్నట్లున్న ఈ పక్షి మహరాణిలా ఎంత అందంగా ఉందో కదూ? ఉత్తర న్యూగినియాలో కన్పించే విక్టోరియా క్రౌన్డ్ పిజియన్ అనే అరుదైన పావురాయి ఇది. మనుషుల ఆకలిధాటికి గురవుతూ, అనేక ప్రతికూల పరిస్థితుల్లోనూ వలసపోకుండా ఒకేచోట ఉండిపోయే ఈ పక్షులు ప్రపంచవ్యాప్తంగా అంతరించిపోతున్న జాతుల్లో చేరాయట!

కోసం ఒళ్ళంతా కళ్ళు చేసుకుని ఎదురు చూస్తున్న సరిత అటు చూడగానే నిటారుగా అయింది. ఆనంద్ గేటు తీసుకుని లోపలికి వచ్చాడు. సరిత పాదానికి వున్న చెప్పు విప్పి చేత్తో పట్టుకుంది. చార్జ్ చెయ్యబోయే పులిలా ఎదురు చూస్తోందామె. ఆనంద్‌ని చూసిన రాహుల్ కళ్ళతోనే నవ్వేడు.

తల్లి తనని గమనిస్తోందేమోనని ఆమె వైపు ఓరగా చూసిన వాడు, ఆమె కళ్ళలోని ఎర్రజీరని చూసి భయపడి తిరిగి పుస్తకంలో తలదూర్చాడు.

'ఆనంద్ లోపలికి వస్తాడు. తనతో అసభ్యంగా మాట్లాడతాడు. చెంప అదిరిపోయేలా కొట్టాలి' సరిత ఊపిరి బిగపట్టి ఎదురుచూస్తోంది. ఆనంద్ ఆ ఇంటి గుమ్మం ముందు ఒక్క నిముషం నిలబడి ఏమనుకున్నాడో ఏమో మేడ మెట్లెక్కడం మొదలుపెట్టాడు.

'ఆనంద్ లోపలికి వస్తాడు. తనతో అసభ్యంగా మాట్లాడతాడు. చెంప అదిరిపోయేలా కొట్టాలి' సరిత ఊపిరి బిగపట్టి ఎదురుచూస్తోంది. ఆనంద్ ఆ ఇంటి గుమ్మం ముందు ఒక్క నిముషం నిలబడ్డాడు.

'ఇదంతా మాధవి ప్లాన్ కదూ? బహుశా ఆవిడతో మరోసారి చర్చించి, పథకంలో రెండో మెట్టు ఎక్కుతాడు కాబోలు' సరిత ఊపిరి బిగపట్టి క్రోధంగా ఎదురు చూస్తోంది. అయిదు నిముషాలు గడిచాయి. ఆనంద్ కిందికి రాలేదు. సరితలో ఉత్కంఠ పెరిగిపోతోంది. శాంతమ్మ కూతురిలోని ఆందోళనని, ఆగ్రహాన్ని గమనిస్తోంది. కూతురి మనసులో ఆనంద్, మాధవిల పట్ల ఏర్పడిన దురభిప్రాయాన్ని ఎలా తొలగించాలి? '

మళ్ళీ గేటు తీసిన శబ్దమయింది. సరితతోబాటు శాంతమ్మ కూడా ఉలిక్కిపడింది. లోపలికి వస్తున్న ఆ వ్యక్తి వినయ్! ప్రమీల బాయ్‌ఫ్రెండ్!

ఇతను ఇక్కడికి వచ్చాడేమిటా అని సరిత, కూతుర్ని వేధించేది ఇతనేనేమో అనే ఆందోళనతో శాంతమ్మ నిశ్చేష్టులై చూస్తుండగా అతను లోపలికి వచ్చాడు. ఆ తల్లీ కూతుళ్ళిద్దరూ అప్రయత్నంగా లేచి నిలబడ్డారు.

"హాయ్ సరితా!" అన్నాడతను.

సరిత ముడివడిన భ్రుకుటితో తీక్షణంగా అతన్నే చూస్తోంది. రాహుల్ లేచి "కూర్చోండి అంకుల్!' అన్నాడు.

ఎవరైనా ఇంటికి వస్తే కూర్చోమని చెప్పాలని సరిత వాడికి చాలా చిన్నప్పటినుంచే నేర్పించింది.

"అంకులా? అంకుల్ కాదు బాబూ! నేను మీ డాడీని" అన్నాడు తను ప్రేమగా చూస్తూ.

"డాడీయా? " రాహుల్ విచిత్రంగా చూసాడు. "నో! మీరు మా డేడీ కాదు. మా డాడీఅమెరికాలో వున్నారు"

"అని మీ అమ్మ చెప్పిందా? " ఓరగా సరిత వైపు చూస్తూ అన్నాడు వంకరగా నవ్వుతూ. అంతలోనే రాహుల్‌వైపు ఆప్యాయంగా చూస్తూ అన్నాడు.

"నేను మీ డాడీనే బాబూ!"

"మీ పేరు ఆనందా!" రాహుల్ కళ్ళు పెద్దవి చేసి అతన్ని చూస్తూ అడిగాడు.

"మీ డాడీ పేరు ఆనంద్ అని మీ అమ్మ చెప్పిందా? పోనీ అలాగే అనుకుందాం" మళ్ళీ ఓరగా సరితవైపు చూసాడు.

సరిత ముఖం ఆగ్రహావేశాలతో ఎర్రబడిపోతోంది. "ఏం సరితా? ఇందాకటినుంచి చూస్తున్నాను. నువ్వేమీ మాట్లాడవేమిటి? ఇన్ని ఏళ్ళ తర్వాత అమెరికా నుంచి వచ్చిన మొగుడికి ఇలాగేనా స్వాగతమి

చ్చేది? ముందు నీ చేత్తో కాసిని మంచి నీళ్ళు, ఆ తర్వాత మంచి కాఫీ ఇవ్వవా? "

"మీరెవరో నాకు తెలియదు. మీరు రాంగ్ ఎడ్రస్‌కి వచ్చారనుకుంటాను. మర్యాదగా వచ్చిన దారినే వెళ్ళండి" ఆగ్ర హాన్ని అణుచుకుంటూ, సహనాన్ని కూడదీసుకుంటూ అంది.

"వ్వాట్! నేనెవరినో నీకు తెలియదా? వేదమంత్రాల మధ్య అగ్నిసాక్షిగా నీ మెడలో మూడు ముళ్ళు వేసింది నేను. మన ప్రేమ ఫలితంగా పుట్టిన రాహుల్ సాక్షిగా చెబుతున్నాను. నేను నీ భర్తని. నిన్ను వదిలేసి ఇన్నాళ్ళు అమెరికాలో వున్నానని నాపై కోపం వచ్చిందా? అందుకు శిక్షగా, నీ బిగి కౌగిలిలో నన్ను బంధించి నాకు ఊపిరాడకుండా చెయ్యి"

సరిత తల గిరగిర తిరిగి పోతోంది. తనని వేధిస్తున్నది ఆనంద్ కాదు. వినయ్ అని తెలిసాక ఆమెలో అనుమానం మరో కోణం నుంచి మొదలయింది.

ఈ నాటకంలో ఆనంద్, మాధవిలతో బాటు ప్రమీల, వినయ్‌లు కూడా భాగస్వాములేనా? శాంతమ్మ చేష్టలుడిగిన దానిలా చూస్తోంది. ఈ పరిస్థితి ఆవిడ ఊహించనిది.

"షటప్! రాస్కెల్!" సరిత నిప్పులు కక్కుతూ చూస్తూ చెయ్యెత్తింది. అంతలోనే వినయ్ ఏదో శక్తి బలంగా విసిరేసినట్టు గుమ్మం అవతల పడ్డాడు. సరిత, శాంతమ్మ అటు చూసి ఆశ్చర్యంగా నోరు తెరిచారు. ఆనంద్, మాధవి ఎప్పుడొచ్చారో తెలియదు. కింద పడిన వినయ్‌ని కాలర్ పట్టుకుని లేపి ఇంట్లోకి లాక్కొచ్చాడు ఆనంద్.

"చెప్పరా రాస్కెల్! ఆమెనెందుకు వేధిస్తున్నావ్!" ఆనంద్ అతని షర్టు పట్టుకుని నిలదీశాడు.

"నువ్వామె భర్తవా? ఆమె నీ భార్యా" ఆనంద్ బలిష్ఠమైన పిడికిలి అతని కడుపులో బలంగా తగిలింది. "చెప్పు, ఎవరు నువ్వు? "

మరో రెండు దెబ్బలకి నోరు విప్పాడతను. "సరిత విడాకుల కేసు వాదించిన లాయర్‌గారబ్బాయిని నేను. సరిత కొలీగ్ ప్రమీల నా గర్ల్‌ఫ్రెండ్. సరిత తన భర్త అమెరికాలో వున్నాడని చెబుతోందని ప్రమీల ద్వారా తెలుసుకుని అమెని ఏడిపించాలనుకున్నా. ఆమె భర్తలా ఫోన్ కాల్స్ చేసిందీ నేనే!"

"నన్ను క్షమించండి సార్! ఆవిడని టీజ్ చెయ్యాలని తప్ప ఆమెపై నాకు దురభిప్రాయం లేదు"

"ఆమెని క్షమాపణ అడుగు" ఆనంద్ అతన్ని సరితవైపు నెట్టాడు.

"నన్ను క్షమించండి మేడమ్" అంటూ సరితకి చెప్పాడు. సరిత ముఖం పాలిపోయింది. సిగ్గు అవమానంతో చితికిపోతున్న ఆమెకి హఠాత్తుగా దుఃఖం ముంచుకురాగా పరుగులాంటి నడకతో గదిలోకి వెళ్ళి తలుపు మూసుకుంది. ఆమె ఏ అఘాయిత్యానికైనా పాల్పడుతుందేమోననే భయంతో మాధవి, శాంతమ్మ ఆదుర్దాగా ఆ గది తలుపు తట్టారు.

"సరితా! తలుపు తియ్యి" మాధవి నాలుగుసార్లు పిలిచాక తలుపు తీసింది సరిత.

"భయపడకండి మేడమ్! నేను ఆత్మహత్య చేసుకునేంత పిరికిదాన్ని కాదు. దయవుంచి నన్ను కాస్సేపు ఒంటరిగా వదిలెయ్యండి ప్లీజ్!"

"ఓకే సరితా! మనం స్థిమితంగా మాట్లాడుకుందాం" అంది మాధవి. సరిత తిరిగి తలుపు మూసుకుంది. ఈ సందడిలో వినయ్ చల్లగా జారుకున్నాడు. జరిగినదంతా బిక్కచచ్చిపోయి చూస్తున్న రాహుల్‌ని ఆప్యాయంగా ఎత్తుకున్నాడు ఆనంద్.

ఆ స్పర్శలోని ప్రేమానురాగాలు వాడి నరనరాలలో ప్రవహించి వాడి ముఖంలో సంతోషం తాండవించింది.

"ఇప్పుడొచ్చిన అంకుల్ మా డాడీ కాదు కదా!" అడిగాడు రాహుల్.

"కాదు" అంది మాధవి.

"మరి మా డాడీ ఎవరు? "

తన భర్త అమెరికాలో వున్నాడని కూతురు చెప్పిన అబద్ధం వల్ల ఎలాంటి పర్యవసానం ఎదుర్కొందో ప్రత్యక్షంగా చూసిన శాంతమ్మకి దుఃఖం ముంచుకొస్తోంది. ఆ అబద్ధం బయట పడితే రాహుల్ పసిమనసు తట్టుకోగలదా?

మాధవి ఓదార్పుగా ఆవిడ భుజంపై చెయ్యివేసింది.

"నన్ను క్షమించండి" అంది సరిత తల దించుకుని. ఆమె మాధవి ముందు తల ఎత్తుకోలేకపోతోంది.

"ఆ ఫోన్‌కాల్స్ మీరు ఆనంద్ చేత చేయిస్తున్నారనుకున్నాను. అతనికి నా క్షమాపణలు తెలియచెయ్యండి. ఇదంతా నేను చేసుకున్నది. అందుకే ఇంక ఈ ఊళ్ళో వుండదలచుకోలేదు. ఇక్కడనుంచి దూరంగా వెళ్ళి పోవాలనుకుంటున్నాను."

"ఏ ఊళ్ళోనైనా ఇదే మనుషులు. ఇవే మనస్తత్వాలు. అయినా సరితా! లోకాన్ని అబద్ధంతో ఎన్నాళ్ళు ఏమార్చగలవు? రాహుల్‌ని ఎన్నాళ్ళు అబద్ధంతో మభ్యపెట్టగలవు? "

సమాధానంగా సరిత కళ్ళలో నీళ్ళొచ్చాయి. "దీనికి పరిష్కారం ఒక్కటే! నువ్వు పెళ్ళి చేసుకో. నీ బిడ్డని తన బిడ్డగా ప్రేమించగలిగే వ్యక్తిని జీవితంలోకి ఆహ్వానించు. రాహుల్‌కి తండ్రి ప్రేమని అందించు"

"క్షమించండి మేడమ్!" అని సరిత అక్కడి నుంచి వెళ్ళిపోయింది.




సుపరిచితమైన ఆ ఇంటిని, పరిసరాలని చూస్తూ వకుళ ఉద్వేగంతో కదిలిపోయింది. ఆమె డోర్‌బెల్ నొక్కిన నిముషం తర్వాత తలుపు తెరుచుకుంది. తలుపు తెరిచిన వసంత్ "సుస్వాగతం" అన్నాడు చిరునవ్వుతో.

"సారీ? లేట్ చేసానా? " అంది వకుళ వాచ్ చూసుకుంటూ.

"కొంచెం... అయినా ఇంత ముస్తాబవడానికి ఆ మాత్రం టైమ్ పట్టదా? " అన్నాడు నవ్వుతూ.

"మీరు కొన్న చీరే కట్టుకున్నాను. ఎలా వుంది? "

"ముందు లోపలికి రా... చూసి చెబుతాను"

వకుళ నవ్వుతూ లోపలికి అడుగు పెట్టబోయింది.

"ఆగాగు. కుడికాలు ముందు పెట్టిరా? " కంగారుగా వారించాడు.

వకుళ ముసిముసిగా నవ్వుతూ అతను చెప్పినట్టు చేసింది.

"కూర్చో, మంచినీళ్ళు కావాలా? "

"ఈ ఇల్లేమీ నాకు తెలియనిది, పరాయిది కాదు. మంచి నీళ్ళు నేను తెచ్చుకోగలను" చనువుగా ఫ్రిజ్‌లో నుంచి నీళ్ళు తీసుకుని తాగుతూ సోఫాలో కూర్చుంది.

"అత్తయ్యగారు ఇంట్లో వున్నారా? "

"ఊరికి వెళ్ళింది" అతను డైనింగ్ టేబిల్ మీదవున్న కేసరోల్ లోనుంచి వేడి వేడిగా టిఫిన్ తీసి ప్లేట్లలో సర్దాడు.

"అరె! ఇప్పుడెందుకివన్నీ?"

"నాకు ఆకలేస్తోంది. అయినా నువ్వు ఇంటికి కాస్త ఆలస్యంగా వెళ్ళినా నీకు ఆకలి వెయ్యకుండా. కాఫీ మాత్రం నువ్వే కలుపు. నీ చేతి కాఫీ అద్భుతంగా వుంటుంది"

ఇద్దరూ టిఫిన్ తిన్నాక ఆమె కిచెన్‌లోకి వెళ్ళి కాఫీ కలిపింది.

"ఇంటికి రంగులు వేయించినట్టున్నారే" ఇల్లంతా కలియ చూస్తూ అడిగింది.

"అవును మన పెళ్ళికదా! మనలా ఇలా రెండోసారి పెళ్ళి చేసుకునే అవకాశం ఎవరికీ వచ్చివుండదు"

మనసారా నవ్వింది.

"నువ్విలా కాఫీ కలిపి ఇస్తే పాతరోజులు గుర్తుకొస్తున్నాయి. మనిద్దరికీ పెళ్ళయి ఒకే ఇంట్లో వున్నట్టుంది" పెళ్ళి అనే మాట అతని నోటి వెంట రెండోసారి వినగానే ఆమెకి ఉత్సాహం వచ్చింది.

"మనం వెంటనే రిజిస్ట్రార్ ఆఫీసుకి వెళ్ళి మన పెళ్ళికి అప్లికేషన్ పెట్టుకోవాలి. మార్గశిర మాసంలో పెళ్ళి చేసుకోవాలంటే నెలరోజులే టైమ్ వుంది"

"అలాగే తప్పకుండా మంచి రోజు చూసుకుని వెళ్దాం"

వకుళ సంతృప్తిగా నిటూర్చింది. ఇద్దరూ పెళ్ళయిన తొలిరోజులలో లాగా కబుర్లు చెప్పుకున్నారు. జోక్స్ చెప్పుకుని నవ్వుకున్నారు. మధ్యలో ఎందుకో తల ఎత్తిన ఆమెకి తననే తదేకంగా చూస్తున్న వసంత్ కనిపించాడు.

"ఏమిటలా తినేసేలా చూస్తున్నారు?" దబాయింపుగా అడిగింది.

"తినేద్దామనే. నిజం వకుళా! నువ్విప్పుడు మరింత అందంగా వున్నావు. మన పెళ్ళినాటి కంటే మరింత బాగున్నావు"

ఆమె చెంపలు రాగరంజితమవుతుంటే తల దించుకుంది. అతను ఆమెని దగ్గరకి తీసుకుని ముద్దు పెట్టుకున్నాడు. చాలా నెలల తర్వాత భర్త స్పర్శతో ఆమెలోని అణువణువు రేకులు విప్పుకున్న పువ్వయింది. అతనామె ముఖాన్ని చేతులలోకి తీసుకున్నాడు.

"నువ్వు నాకు కావాలి వకుళా! మన పెళ్ళయిన తొలి రోజులలోలాగా... ఒక్కసారి" అతని స్వరం నిషాగా వుంది. ఆమె వివశ అయింది. అతనామెని బెడ్‌రూమ్‌లోకి నడిపించాడు.

★ ★ ★

రాహుల్ స్కూల్ నుంచి ఆటోలో ఇంటికి వస్తుండగా ట్రాఫిక్ సిగ్నల్ దగ్గర రెడ్ లైటు పడి ఆటో ఆగింది.

"మా డేడీ హాలిడేస్‌కి నన్ను హైదరాబాద్ తీసుకెళ్తానన్నారు" అన్నాడు ఆదిత్య.

"నేను ఎప్పుడో హైదరాబాద్ చూసేశాను. ఈసారి సెలవులకి మా డేడీ మమ్మల్ని సింగపూర్ తీసుకెళ్తానన్నారు" గొప్పగా చెప్పాడు వరుణ్.

చిన్నబోయిన ముఖంతో వాళ్ళ సంభాషణని వింటున్నాడు రాహుల్. వాళ్ళు గొప్పగా మా డేడీ అక్కడికి తీసుకెళ్తారు, ఇక్కడికి తీసుకెళ్తారని చెబుతుంటే వాడికి ఉక్రోషంగా ఉంది. తల తిప్పి పేవ్‌మెంటు మీద నడుస్తున్న మనుషులని చూడసాగాడు. దూరంగా ఒక షాపులోనుంచి బయటికి వస్తున్న ఆనంద్‌పై వాడి దృష్టి పడింది.

"మీ డాడీ ఫొటో చూశావా?" అని అతను అడిగిన సంగతి గుర్తుకొచ్చింది. డాడీకి ఫొటో తీయించుకోడం ఇష్టం లేదని అతనితో చెప్పాలి.

"డ్రైవరంకుల్! నేనిప్పుడే వస్తాను" అని అతని సమాధానం కోసం ఆశించకుండా ఆటో దిగేసి ఆగి ఉన్న వాహనాలని దాటుకుంటూ రోడ్ క్రాస్ చెయ్యడం మొదలు పెట్టాడు.

అంతలో గ్రీన్ లైటు వెలిగి అంతవరకు ఆగి ఉన్న వాహనాలన్నీ కదలడం మొదలుపెట్టాయి.

ఒక్కసారిగా అన్ని వాహనాలు కదలడంతో ఎలా తప్పుకోవాలో అర్థం కాక కంగారుపడ్డాడు వాడు. తన స్కూటర్‌కి అడ్డంగా వచ్చిన ఆ బాబుని చూసి హఠాత్తుగా ఓ వ్యక్తి కంగారుపడి వాడిని ఢీకొట్టేశాడు.

★ ★ ★

హాస్పిటల్‌లో సరిత కన్నీళ్ళు తుడుచుకుంటూ రాహుల్ బెడ్ దగ్గర కూర్చుంది.

శాంతమ్మ ఆనంద్‌ని చూస్తూ కృతజ్ఞతాపూర్వకంగా అంది.

"మీరు దేముడిలా వాడిని సమయానికి రక్షించారు కాబట్టి బతికాడు. వాడిమీదే ప్రాణాలు పెట్టుకుని బతుకుతున్నాం. మిమ్మల్ని దేముడు చల్లగా చూస్తాడు"

"అసలు నువ్వు ఆటో ఎందుకు దిగావు రాహుల్? " ఆనంద్ వాడి తల నిమురుతూ అడిగాడు.

"ఆరోజు పిక్నిక్‌కి వెళ్ళినప్పుడు మీరు నన్ను మీ డాడీ ఫొటో చూశావా? అని అడిగారుకదా! మా అమ్మని అడిగితే మా డాడీకి ఫొటో తీయించుకోడం ఇష్టం లేదని చెప్పింది. అది మీకు చెప్పాలని..."

సరిత కన్నీళ్ళు తుడుచుకోడం మరచిపోయి దిగ్భ్రాంతిగా చూస్తోంది.

ఆనంద్ తన తండ్రి అనుకుని రాహుల్ అతనికి దగ్గరవ్వాలని ప్రయత్నించాడని తెలుసు కాని, అతనికి ఇంత దగ్గరయ్యాడని ఆమె ఊహించలేదు. అప్రయత్నంగానే తల్లివైపు చూసింది. అదే క్షణంలో ఆవిడ కూతురివైపు చూసింది. ఆ ఇద్దరి కళ్లలో కదులుతున్న అస్పష్టమైన వేదన ఆనంద్ దృష్టిని దాటిపోలేదు.

డాక్టరు వచ్చి రాహుల్‌ని చూసి ఆ మధ్యాహ్నం డిశ్చార్జి చేస్తానని చెప్పారు.

సరిత హాస్పిటల్ బిల్ కట్టడానికి వెళ్ళింది.

"అంకుల్! మీరు మళ్లీ అమెరికా వెళ్లిపోతున్నారా? " ఉన్నట్టుండి రాహుల్ అడిగాడు.

"వెళ్ళాలమ్మా"

"ఎప్పుడు? "

"వచ్చే వారం" చెప్పాడు ఆనంద్.

"అమ్మమ్మా! మా డాడీ అమెరికా నుంచి ఎప్పుడొస్తారు? "

ఆవిడ ఏం జవాబివ్వాలో తెలియక తడబడింది.

ఎలాగో గొంతు పెగల్చుకుని 'త్వరలోనే' అంది.

"త్వరలో అంటే ఎప్పుడు? "

"డాడీ అమెరికా నుంచి ఇక్కడికి రారు రాహుల్" మనమే అక్కడికి వెళ్ళాలి. హఠాత్తుగా సరిత స్వరం వినిపించింది. ఆనంద్, రాహుల్, శాంతమ్మ ఒక్కసారే తలలు తిప్పి చూశారు.

సరిత లోపలికి వచ్చింది. ఆనంద్‌కి ఆమె ముఖంలోని చిరునవ్వు తెచ్చిపెట్టుకున్నదని అర్థమైంది.

"అయితే మనం అమెరికా ఎప్పుడు వెళ్తాం" సరిత వాడికి సమాధానం చెప్పకుండా ఆనంద్‌వైపు తిరిగింది.

"బాబుని కాపాడినందుకు మీకు నా కృతజ్ఞతలు" అంది చేతులు జోడిస్తూ. తనని అక్కడి నుంచి వెళ్లమని చెబుతోందని అర్థమవడంతో "ఓకే రాహుల్! టేక్ కేరాఫ్ యువర్ సెల్ఫ్! బై" అంటూ లేచాడతను.

'బై!' రాహుల్ పెదవులు అతనికి వీడ్కోలు పలికినా కళ్ళు మాత్రం అతన్ని వీడి రానంటున్నాయి. కనురెప్ప వాలిస్తే మళ్ళీ అతను కనబడడేమో అన్నంత ఆర్తిగా అతన్ని చూస్తున్నాడు.

ఆనంద్ ఉద్వేగంతో కదిలిపోయిన క్షణా లవి. వెనక్కి వచ్చి వాడిని గుండెలకి హత్తుకోవాలనిపించింది. బలీయమైన ఆ కోరికని అదుపులో పెట్టుకోవడానికి అతను చాలా కష్టపడవలసి వచ్చింది. అతను త్వరత్వరగా నడుస్తూ కనుమరుగయ్యాడు.

★ ★ ★

ఆనంద్ అమెరికా ప్రయాణం దగ్గర పడిందని అతన్ని ఒకసారి చూసిపోదా మని వచ్చింది మాధవి.

తనేం అడిగినా పరధ్యానంగా జవాబి స్తున్న అతన్ని అడిగింది.

"ఏమిటాలోచిస్తున్నావ్"

"రాహుల్ గురించి"

"రాహుల్ గురించా? ఓ... సరిత కొడుకు మాటా నువ్వు చెప్పేది"

"అవును. నాకు వాడు పరాయివాడిలా అనిపించడం లేదు మాధవీ! గత జన్మని నువ్వు నమ్మితే మేమిద్దరం తండ్రీకొడుకు లమై వుంటాము. ఈ జన్మలో పూర్వజన్మ బంధాన్ని గుర్తుచేస్తూ వాడు నన్ను డాడీ అని పిలుస్తున్నాడేమో అన్పిస్తోంది"

మాధవి నిట్టూర్చి అంది.

"తండ్రి ప్రేమ కోసం అల్లాడిపోతున్న దురదృష్టవంతుడు వాడు. తన భర్త అమె రికాలో ఉన్నాడని సరిత లోకాన్నే కాదు, ఆ పసివాడినీ నమ్మిస్తోంది. వాడు తన తండ్రి నిజంగానే అమెరికాలో వున్నాడను కుంటున్నాడు. కాని ఆమెకి తను చేస్తున్న తప్పేమిటో తెలియడంలేదు. తనకి తెలి యకుండానే వాడిలో తండ్రిపై ప్రేమ మొలకెత్తేలా చేస్తోంది. వాడు పెరిగి పెద్ద వాడయ్యాక వాడి తండ్రి ఎంత క్రూరుడో చెబుతుందిట. హఠాత్తుగా తండ్రి నిజస్వ రూపాన్ని తెలుసుకున్నవాడు ఏమయిపో తాడు? ఎందుకిలా వాడిని అబద్ధాలతో మభ్యపెడుతున్నావంటే ఇప్పుడు ఏం చెప్పినా వాడికి అర్థం కాదంటుంది. అంత కంటే ఆ పసివాడికి తండ్రి ప్రేమని పంచ డానికి సిద్ధంగా ఉన్న వ్యక్తికి తన జీవి తంలో స్థానమిస్తే బాగుండదూ"

"యు మీన్..."

"ఆమె మళ్ళీ పెళ్ళెందుకు చేసుకోకూ డదు? పెళ్లి విషయంలో ఒకసారి చేదు అనుభవాన్ని పొందిన మాట నిజమే. ఆమె కోరుకుంటే మంచివాడు, సంస్కార వంతుడు అయిన వ్యక్తి ఆమె చేతినందు కుని ఆమె జీవితంలో మధురిమని పండిం చడూ? ఎవరో ఎందుకు? రాహుల్ని నీ కొడుకు అని అనుకుంటున్న నువ్వు సరి తని పెళ్లి చేసుకోవూ? "

"నేనా? " అప్రయత్నంగాలేచి నిలబ డ్డాడు

"ఎందుకంత షాకయిపోతున్నావ్? సరిత నీకు భార్యగా తగదా? పెళ్ళయి భర్తతో ఒక ఏడాది కాపురం చేసిన ఆమె పెళ్ళికి అనర్హురాలా? "

"నాకూ పెళ్ళయిందిగా? నేనూ నా భార్యతో మూడేళ్ళు కాపురం చేసానుగా? అది కాదు నా సందేహం. ఆమె నాతో పెళ్ళికి అంగీకరిస్తుందా అని"

"నువ్వు అంగీకరిస్తే ఆమెని ఒప్పిస్తాను"

క్షణం ఆలోచించి అన్నాడు, "నాకు ఇష్టమే"

"రాహుల్ కోసం సరితని పెళ్ళి చేసు కుంటానంటున్నావా? "

"కాదు. ఆమెని ఇష్టపడే పెళ్ళి చేసుకుం టానంటున్నాను. నిజం మాధవీ! సరిత పట్ల నాకెందుకో తొలి చూపులోనే గౌరవం కలిగింది. ఆమె భర్త నుంచి విడిపోయా ననే నిజాన్ని దాచి రాహుల్ని, ఈ సమా జాన్ని కూడా మోసం చేస్తుండవచ్చు. కాని ఎంత మానసిక సంఘర్షణని అనుభవి స్తోందో ఊహించగలను. విడాకులు తీసు కున్న స్త్రీని మన సమాజం చులకనగా చూస్తుందనే భయంతోనే ఆమె ఇదంతా

చేస్తోంది. ఎప్పటికైనా రాహుల్‌కి నిజం తెలిస్తే వాడెలా రియాక్టవుతాడో అని ఎంత అంతర్మథనాన్ని అనుభవిస్తోందో నేనూహించగలను. నేను..సరిత వివాహం విషయంలో చెరో రకంగా దెబ్బతిన్న వాళ్ళమే. శిల్పని తియ్యని జ్ఞాపకంగా మిగుల్చుకున్న నేను సరిత సహచర్యంలో శిల్పని పూర్తిగా మరచిపోతానేమో!"

"సరితకి ఇదివరకే నీ గురించి చెప్పాను. ఆమె నిన్ను పెళ్ళి చేసుకోడానికి అంగీకరించలేదు. అసలు తనకి పునర్వివాహం చేసుకునే ఆలోచనే లేదు."

ఆనంద్ గుండె కలుక్కుమంది. సరిత తనని తిరస్కరించిందా? రాహుల్ తనకి ఏ రకంగానూ దగ్గర కాలేడా?

"ఆమెకి పెళ్ళి చేసుకునే ఆలోచన లేదని తెలిసీ నా దగ్గర ఆమె ప్రస్తావన ఎందుకు తెచ్చావ్"

"ఆమెని ఒప్పించగలననే నమ్మకంతో."

"ఆమె ఒప్పుకోడం, ఒప్పుకోకపోవడం అనేది ఆమె వ్యక్తిగత విషయం. నువ్వు బలవంత పెట్టడం అనవసరం"

"సరిత వైవాహిక జీవితంలో ఎదురైన చేదు అనుభవంతో పెళ్ళంటేనే భయపడుతోంది. రాహుల్‌ని నీ బిడ్డగా ప్రేమించగల నీతో పెళ్ళికి అంగీకరిస్తుందనే అనుకుంటున్నాను."

"ఆమెకి ఇష్టమైతే నేనామెని స్వీకరించడానికి మనస్ఫూర్తిగా ఇష్టపడుతున్నాను."

వాళ్ళ సంభాషణని మౌనంగా వింటున్న వర్ధనమ్మ కళ్ళలో ఆనందబాష్పాలు!

★ ★ ★

"ఆనంద్‌కి రాహుల్ అంటే చాలా ఇష్టం."

మాధవి అలా అనగానే సరిత ముఖం ఎర్రబడింది

"పదే పదే అతని ప్రస్తావన నా దగ్గర ఎందుకు తెస్తున్నారో అర్థంకావడం లేదు"

"నీ మనసులో అతనిపై ఎలాంటి అభిప్రాయం వుందో తెలుసుకోవాలి"

"ఒక అపరిచిత వ్యక్తిపై అభిప్రాయం ఏర్పరచుకోవలసిన అవసరం నాకేమిటి?"

"అతను నీకు అపరిచితుడే కావచ్చు కాని యాదృచ్ఛికంగా అయినా రాహుల్‌తో అనుబంధాన్ని పెంచుకుని వాడికి ఆత్మీయుడయ్యాడు"

"అందుకు నేను బాధ్యురాలిని కాను"

"ఒక్కొక్కసారి మన ప్రమేయం లేకుండా జరిగిన సంఘటనలకి కూడా మనమే బాధ్యత వహించవలసివస్తుంది"

"అంటే ఇంతకీ మీరనేదేమిటి?" అసహనంగా అడిగింది.

"ఆనంద్‌కి, రాహుల్‌కి మధ్య ఆత్మీయతాబంధం ఏర్పడింది. ఆనంద్ వాడిని తన బిడ్డగా స్వీకరించడానికి సిద్ధంగా వున్నాడు"

"రాహుల్‌ని నేను అతనికే కాదు ఎవరికీ ఇవ్వను. నేనే పెంచుకుంటాను"

"అతను రాహుల్‌ని దత్తత చేసుకుంటాననడంలేదు. వాడితోబాటు నిన్నూ తన జీవితంలోకి ఆహ్వానిస్తానంటున్నాడు".

సరిత ముఖం ఎర్రబడింది. "వాడిని వదులుకోలేక నాపై దయతలచి నన్ను పెళ్లి చేసుకుంటానంటున్నాడా?"

"నీపై అతనికి ఉన్నది జాలి కాదు. గౌరవం! ఆలోచించు సరితా! నీ భర్త నుంచి విడాకులు తీసుకున్నావని, లోకం నిన్ను హేళన చేస్తుందని భయపడి నీ భర్త అమెరికాలో వున్నాడని అబద్ధం చెప్పావు. అదే అబద్ధంతో రాహుల్‌నీ మభ్యపెడుతున్నావు. వాడు తన తండ్రిని చూడాలని, అతనితో మాట్లాడాలని తపించిపోతుంటే ఆ అబద్ధానికి మరిన్ని రంగులు పులిమి వాడిని ఏమార్చాలని చూస్తున్నావు. రాహుల్ పెద్దవాడవుతున్నాడు. వాడిని ఇంకెన్నాళ్ళో అబద్ధాలతో

మభ్యపెట్ట లేవు. ఒకవేళ నువ్వు నిజం చెప్పినా నువ్వు వాడిని ఇన్నాళ్ళు అబద్ధాలతో మభ్యపెట్టినందుకు నీపై అసహ్యం, కోపం కలుగుతాయి. తండ్రి నిజస్వరూపం తెలిసినా షాకే. అంతకు మించి తనకి తండ్రి లేడనే నిజం తెలిసి వాడేమవుతాడో ఊహించావా? "

సరిత వెడల్పాయిన కళ్ళలో బాధా వీచికలు స్పష్టమవుతున్నాయి. ఆ కళ్ళలో నీళ్ళు కమ్ముకుంటున్నాయి.

"జీవితంలో అదృష్టం ఒకేసారి తలుపు తడుతుంది. దురదృష్టం మాత్రం తలుపు తెరిచేవరకు తలుపు తడుతుందంటారు. దురదృష్టం మోహన్ రూపంలో నీ జీవితాన్ని చిన్నాభిన్నం చేసింది. అదృష్టం ఆనంద్ రూపంలో నిన్ను వెతుక్కుంటూ వచ్చి మోడువారిన నీ జీవితంలో వసంతాన్ని తెస్తానంటోంది. ఆలోచించు."

సరితకి కన్నీళ్ళు పొంగివస్తున్నాయి.

"ఆనంద్ మంచివాడు సరితా! అతన్ని పెళ్ళి చేసుకున్నందుకు ఎప్పటికీ పశ్చాత్తాప పడవని నేను హామీ ఇస్తున్నాను."

"నాకు అయోమయంగా వుంది. నన్ను కాస్త ఆలోచించుకోనివ్వండి" సరిత గభాల్న గదిలోకి వెళ్ళిపోయింది.

శాంతమ్మ అంతవరకు వాళ్ళ సంభాషణని వింటున్నదల్లా అంది.

"సరిత ఈ పెళ్ళికి ఒప్పుకుంటుందంటావా? "

"వేడిగా వున్నప్పుడే ఇనుముని వంచాలి. నా మాటలు ఆమెలో తీవ్ర సంచలనాన్ని కలిగించాయి. ఆమె తప్పకుండా ఆనంద్ గురించే ఆలోచిస్తూంటుంది. మీరు కూడా నచ్చచెప్పండి" అంది మాధవి.

"దాని జీవితం ఒక గాడిన పడితే తల్లిగా అంతకంటే నేను కోరుకునేది వేరే ఏం వుందమ్మా" అంది శాంతమ్మ కన్నీరు వత్తుకుంటూ.

★ ★ ★

రెండు రోజులపాటు వకుళ ఊహల పల్లకిలో విహరించింది. వసంత్‌తో ఆ సాయంకాలపు సాన్నిహిత్యం ఆమె మనసుపై చెరగని ముద్రవేసింది అతనికి దూరంగా వుండలేనను కుంది. ఆరోజు ఉదయమే అతనికి ఫోన్ చేసింది.

"చెప్పు" అన్నాడు వసంత్.

"మీరే చెప్పాలి. రిజిస్ట్రార్ ఆఫీసుకి ఎప్పుడు వెళ్దాం? "

"పెళ్ళికి అంత తొందరగా వుందా? పెళ్ళయితే నీకు నాపై ఇష్టం పోతుందేమో? నువ్విలా దూరంగా వుంటేనే నిన్ను ప్రేమించగలనేమో!"

"మీకు దూరంగా వుండడం ఇంక నావల్ల కాదు బాబూ!" గోముగా అంది. క్షణం ఆగి నచ్చచెబుతున్నట్టు అంది. "ఈ రెండు నెలలు గడిస్తే మంచిరోజులు కావుట. అమ్మ మన పెళ్ళికి తొందరపెడుతోంది"

"మా అమ్మ కూడా అంతే! పెళ్ళి చేసుకుని కోడలిని ఇంటికి తీసుకురమ్మని ఒకటే గొడవ"

"అత్తయ్యగారు ఊరినుంచి వచ్చారా? ఒక్కసారి ఫోన్ ఆవిడకు ఇవ్వండి మాట్లాడతాను" వసంత్‌తో తను కలసి జీవించడానికి ఆవిడ గ్రీన్‌సిగ్నల్ ఇచ్చిందని వకుళకి హఠాత్తుగా ఆవిడపై గౌరవం పెరిగిపోయింది.

"అత్తగారితో మాట్లాడాలని అంత

"వేడిగా వున్నప్పుడే ఇనుముని వంచాలి. నా మాటలు ఆమెలో తీవ్ర సంచలనాన్ని కలిగించాయి. ఆమె తప్పకుండా ఆనంద్ గురించే ఆలోచిస్తూంటుంది. మీరు కూడా నచ్చచెప్పండి" అంది మాధవి.

తొందరగా వుందా? అయినా అమ్మ ఇంట్లో లేదు. కోడలికి నగలు కొనడానికి బజారుకి వెళ్ళింది"

"ఇప్పుడు నాకు నగలెందుకు? " సంతోషంతో ఉక్కిరిబిక్కిరవుతూ అంది. "మన పెళ్ళికి అప్లికేషన్ ఎప్పుడు పెట్టుకుందాం? "

"రేపు"

"రేపేనా? మీరు వస్తారా? నేను మీ దగ్గరకి రానా? "

"నేనే వస్తాను. రేపు ఆఫీసుకి సెలవు పెడతాను"

"సరే", అతను ఫోన్ డిస్కనెక్ట్ చేసాక తను కూడా ఫోన్ పెట్టేసింది. చదువుకుంటున్న కొడుకుతో చెప్పింది.

"టింకూ! డాడీ రేపు మన ఇంటికి వస్తున్నారు"

"నిజంగానా? భలే! భలే!" వాడు పుస్త కాలు వదిలేసి సంతోషంతో చేతులు సాచి గిరగిర తిరిగాడు. అదే విషయం తల్లితో చెప్పి, 'సాయంకాలం బ్యూటీ పార్లర్‌కి వెళ్ళాలి. ఇంకా అతనికి ఇష్టమైన స్వీటు చెయ్యాలి.' మనసులోనే ప్లాన్ చేసుకుంటూ ఉత్సాహంగా తల్లితో మాట్లాడసాగింది.

★ ★ ★

"మాధవి చెప్పిన విషయం ఏం ఆలోచించావు? "

సరిత తల్లి ప్రశ్నకి ముభావంగా జవాబిచ్చింది "ఏం లేదు."

"నీ తల్లిగా నీ శ్రేయస్సుకోరి ఒక విషయం చెబుతాను విను. నువ్వు ఆనంద్‌ని పెళ్ళి చేసుకోడమే మంచిది. రాహుల్‌కి తండ్రి ప్రేమే కాదు నీకు జీవితంలో తోడు కూడా అవసరం"

"నాకు తోడుగా నువ్వున్నావు కదమ్మా!"


మా వినియోగదారులకు నూతన సంవత్సర శుభాకాంక్షలు

HANUMAN EMPORIUM'S

HANUMAN COLOUR LAB

Computerised & Manual
Digital Images

Narayan Reddy Market, NIRMAL
Adilabad Dist.

*Branch Office :*

Cinema Road, Opp.: Tata Tower,
ADILABAD.

POSHETTY UTTURWAR, Cell : 98492 74302

ఈనాడు, నిర్మల్, 9848921568

"పిచ్చిదానివి. నేను ఎన్నాళ్ళు బతికివుంటాను? నడివయసుతో వున్న నేను నీకు జీవితాంతం తోడు వుండగలనా? అంతే కాదు. నీ భర్త అమెరికాలో వున్నాడనే అబద్ధంతో ఈ లోకాన్ని ఎన్నాళ్ళు నమ్మించగలవ్? ఎప్పటికైనా నిజం బయటపడక తప్పదు. అప్పుడు మిగిలేది అవహేళనే కాని సానుభూతి కాదు"

సరిత కళ్ళలో నీళ్ళూరాయి.

"ఆలోచించుకోమ్మా! అదృష్టం నీ తలుపు తడుతోంది. జారవిడుచుకోకు"

సరిత కన్నీళ్ళు తుడుచుకుంది. "ఆనంద్‌తో ఒకసారి ముఖస్థంగా మాట్లాడితేనే గాని నేనేమీ చెప్పలేను."

"మాట్లాడు. నీ మనసులోని అనుమానాలు, సందేహాలు తీరాకే నిర్ణయం తీసుకో" అంది శాంతమ్మ కూతురు మెత్తబడినందుకు లోలోన సంతోషిస్తూ.

మర్నాడే సరిత ఆనంద్‌లు కలుసుకున్నారు.

"నేను మీ పట్ల జాలితోనో, సానుభూతితోనో ఈ నిర్ణయం తీసుకోలేదు. మిమ్మల్ని చూడగానే తొలిచూపులోనే మీపై ఇష్టం కలిగింది. ఆ ఇష్టం కేవలం మీ అందాన్ని చూసి కాదు. తండ్రి ప్రేమకి దూరమైన రాహుల్‌ని సమాధానపరచలేక మీరనుభవిస్తున్న మానసిక సంఘర్షణ అర్థమయింది. నాకు పిల్లలంటే ఇష్టం. కాని ఈ జన్మలో తండ్రిని కాలేను. రాహుల్‌కి తండ్రి కావాలి. నాకు 'నాన్నా' అని నోరారా పిలిచే బాబు కావాలి. అందుకే ఈ నిర్ణయాన్ని తీసుకున్నాను"

"మీ జీవితంలో నాకు స్థానమిస్తానంటున్నారు. కాని మిమ్మల్ని భర్తగా అంగీకరించడానికి నాకు కొంత కాలం పడుతుంది. అది రోజులా, నెలలా, సంవత్సరాలా అన్నది నాకు తెలియదు"

"మీరు మనస్ఫూర్తిగా నన్ను కోరుకుని నాకు చేరువయ్యేంతవరకు మనం స్నేహితుల్లా వుందాం. నా నుంచి మీకు ఎలాంటి ఇబ్బందీ ఎదురవదని హామీ ఇస్తున్నాను" వాగ్దానమిస్తున్నట్టు అన్నాడు.

## 12

"ఇవాళ డాడీ వస్తున్నారు" చెప్పింది సరిత.

"ఏమిటి, నిజంగానా?" ఆనందాతిరేకంతో అరిచాడు రాహుల్.

"అవును నిజం"

"డాడీ నిజంగా వస్తున్నారా? నీకెలా తెలుసు?"

"రాత్రి ఫోన్ చేసారు"

"నన్ను లేపలేదేం? డాడీతో మాట్లాడేవాడినిగా?"

"నువ్వు నిద్రపోతున్నావు"

"నన్ను లేపమని చెప్పానా లేదా?"

"మరచిపోయాను"

కాలింగ్ బెల్ మోగింది.

"అదుగో డాడీ వచ్చినట్టున్నారు. త్వరగా వెళ్ళి తలుపు తియ్యి" అన్నాడు రాహుల్. వాడి స్వరం ఉద్వేగంతో కంపిస్తోంది.

సరిత వెళ్ళి తలుపు తీసింది. ఎదురుగా చిరునవ్వుతో ఆనంద్. "లోపలికి రండి" అంది పక్కకి తొలగి దారి ఇస్తూ.

అతను లోపలికి వచ్చాడు.

సోఫాలో దిండుమీద ఆని పడుకుని వున్న రాహుల్ లేవడానికి ప్రయత్నిస్తుంటే ఆనంద్ వెళ్ళి పొదివి పట్టుకున్నాడు.

"మీరు... మీరు..." వాడి కళ్ళలో సంభ్రమం. 'డాడీ' తనని తాను వేలితో చూపించుకుంటూ అన్నాడు.

వాడు ఆశ్చర్యంగా, అపనమ్మకంగా తల్లి వైపు చూసాడు.

"అవును" డాడీయే చిరునవ్వుతో అంది.

"మరి... మరి... నేను అడిగితే

ఈయన మా డాడీ కాదన్నావు" ఉక్రో షంగా అన్నాడు.

సరితకి వాడికెలా చెప్పాలో తెలియ లేదు. ఆనంద్ చప్పున అన్నాడు. "మీ అమ్మకి నాపై బాగా కోపం వచ్చింది. అందుకని అలా చెప్పింది"

"ఎందుకు కోపమొచ్చింది? "

"నేను అమెరికా నుంచి రాగానే మీ దగ్గ రకి రాలేదని"

"అవును ఇన్నాళ్ళూ నువ్వు మా దగ్గరికి ఎందుకు రాలేదు? " దబాయిస్తున్నట్టు అడి గాడు.

"ఇప్పుడు వచ్చానుగా? " వాడిని ఎత్తు కుంటూ అన్నాడు.

"నువ్వు మళ్ళీ అమెరికా వెళ్ళద్దు డాడీ! మా దగ్గరే వుండు" అతని మెడ చుట్టూ చేతులు వేసి మారాం చేస్తున్నట్టు అన్నాడు.

"ఈసారి నేను ఒక్కడినే వెళ్ళను. నిన్ను, అమ్మని నాతో తీసుకెళ్తాను" అన్నాడు ఆనంద్.

రాహుల్ కళ్ళలోని ఆనందాన్ని, వాడిని చూస్తున్న ఆనంద్ కళ్ళలోని ఆత్మీయాను రాగాలని చూస్తున్న సరిత అతన్ని తన జీవితంలోకి ఆహ్వానించడంలో తప్పు చెయ్యలేదనుకుంది.

జంటగా తన పాదాలకి నమస్కరిస్తున్న ఆనంద్ సరితలని దీవిస్తున్న శాంతమ్మ కళ్ళలోని ఆనందబాష్పాలు వారి తలలపై అక్షింతలై కురిసాయి.

"మా డాడీ అమెరికా నుంచి వచ్చారు. నేను మా అమ్మ డాడీతో అమెరికా వెళ్ళి పోతున్నాం" అంటూ టింకూతో చెప్పాడు రాహుల్ ఆ సాయంత్రం.

"మా డాడీ రేపు వస్తున్నారు తెలుసా? మేము కొత్త ఇంటికి వెళ్తున్నాం. ఇంక అక్కడే వుంటాం" టింకూ కూడా గొప్పగా చెప్పాడు.

"రా మా డాడీని చూపిస్తాను" రాహుల్ టింకూ చెయ్యిపట్టుకుని ఇంట్లోకి తీసుకొ చ్చాడు. వాళ్ళ సంభాషణని వింటున్న సూర్యకాంతమ్మ సరిత భర్త ఎలా వుంటాడో చూడాలనే కుతూహలంతో కిటికీ దగ్గరికి చేరుకుంది.

"నీ ఫ్రెండా? నీ పేరేమిటి నాన్నా? " ఆనంద్ టింకూని దగ్గరికి తీసుకున్నాడు.

"టింకూ!"

"టింకూ నీ పెట్ నేమా? స్కూల్‌లో ఏమని పిలుస్తారు? "

"రామ్ నారాయణ"

"మా డాడీకి ఎన్ని ఆటలు వచ్చో! రా డేడీ! మాతో ఆడు. క్రికెట్ ఆడుదామా? " రాహుల్ స్వరంలో ఉత్సాహం పరవళ్ళు తొక్కుతోంది.

"బ్యాట్ పట్రా మరి"

వాడు లోనికి వెళ్ళి బ్యాట్, బాల్ తెచ్చాడు.

"నీ దెబ్బలింకా మానలేదు. అందుకని నువ్వు అంపైర్‌వి. నేను బౌలర్‌ని. టింకూ బ్యాటింగ్ చేస్తాడు. ఒ. కె.? " అన్నాడు ఆనంద్.

"సరే! నాకు బాగా తగ్గాక నేనే బ్యాటింగ్ చేస్తాను. ఒ. కె.? "

"ఒ. కె." ఆనంద్ గేటు అవతల ఖాళీ జాగాలోకి నడిచాడు. పిల్లలు అనుసరిం చారు. ఆనంద్‌ని చూసిన సూర్యకాంతమ్మ కళ్ళు పత్తికాయలయ్యాయి.

"వకుళా!" అని పిలుస్తూ లోపలికి వచ్చింది.

"ఏమిటమ్మా"

"ఈ విచిత్రం చూసావుటే! మాధవి ఫ్రెండ్ లేదూ. ఆ అబ్బాయి సరిత మొగు డట"

"ఏమిటీ! నిజంగానా? " ఆశ్చర్యపో యింది వకుళ.

"ఇదివరకోసారి సరిత భర్తనంటూ

ఎవడో వచ్చి నానా యాగీ చేసాడు. ఇప్పుడు ఇతగాడు. ఒకటో కృష్ణుడు, రెండో కృష్ణుడు లాగా దీనికి ఎంతమంది మొగుళ్ళో. అసలు మొగుడు అమెరికాలో వున్నాడో లేడో? ఇన్నాళ్ళబట్టి మాధవి దగ్గరకి రాకపోకలు సాగిస్తున్న అతడు సరిత మొగుడెలా అవుతాడు? ఈ పిల్ల వ్యవహారం చూస్తే నాకేదో అనుమానంగా వుంది. ఇలాంటి వాళ్ళు మన ఇంట్లో అద్దెకి వుంటే మన పరువు పోతుంది. వచ్చే నెలకల్లా ఇల్లు ఖాళీ చెయ్యమని చెబుతాను"

"అమ్మా!" వకుళ సైగతో ఆవిడ వాక్ప్రవాహం ఆగిపోయింది.

వెనుదిరిగి చూసిన సూర్యకాంతమ్మ గతుక్కుమని, తెచ్చిపెట్టుకున్న నవ్వుతో మాధవిని పలకరించింది. "ఏమ్మా మాధవీ? "

"అద్దె డబ్బు ఇద్దామని వచ్చానండి"

ఆమె ఇచ్చిన డబ్బు తీసుకుంటూ అడిగిందావిడ అదోలా నవ్వుతూ. "సరిత మొగుడు అమెరికా నుంచి వచ్చాడుటగా"

"అవునండి" అతి మామూలుగా చెప్పింది.

"నీ ఫ్రెండ్ ఆనంద్ వున్నట్టుండి సరిత మొగుడెలా అయ్యాడు? "

"పెళ్లి అనేది జన్మజన్మల బంధమని మీకు తెలుసు కదా పిన్నిగారూ! ఏడు జన్మల కిందటే వాళ్ళు భార్యాభర్తలు. ఆ బంధం ఇవాళ్టికి బయటపడి బలపడింది" చురుగ్గా చూస్తూ చెప్పిన మాధవి అక్కడ నుంచి వెళ్లిపోయింది.

"ఈవిడొక పతివ్రత! ఏడు జన్మల బంధమట! అసలు నిజంగా సరిత మొగుడు అమెరికాలో వుండి వుండడే! ఏ లేచొచ్చిన బాపతో! ఆ ఎడ్రస్‌లేని మాధవి తన స్నేహితుడికి దీన్ని అంటగట్టింది. ఎర్రగా, బుర్రగా వుందని వాడు పడిపోయాడు"

"నిజమే! లేకపోతే వయసులో వున్న ఆడది! ఒంటరిగా వుంటోంది. భర్త పోయాడంటుంది. అటు అత్తింటి వాళ్ళుగాని, ఇటు పుట్టింటి వాళ్ళుగాని ఒక్కసారైనా తొంగిచూసిన పాపాన పోలేదు. మాధవి వెనుక ఎన్ని కథలున్నాయో!" అంది నిరసనగా వకుళ.

"అందుకే నిన్ను చదివించమని, ఉద్యోగం చేయించమని ఎందరు చెప్పినా నేను వినలేదు. ఏదో గ్రహస్థితి బాగాలేక కొన్నాళ్ళు మీ ఆయనకి దూరమైనా దేముడు చల్లగా చూడబట్టి మళ్ళీ మంచి రోజులు వచ్చాయి నీకు" అంది.

"ఉద్యోగమంటూ ఎక్కడెక్కడ తిరిగి వస్తారో? ఎవరు ఎవరికి ఫ్రెండో? ఎవరికి మొగుడో? " సరితని, మాధవిని ఉద్దేశించి సూర్యకాంతమ్మ అన్న మాటకి వకుళ తాళం వేస్తూ ఎకసెక్కంగా నవ్వింది.




'పోస్ట్!' పోస్ట్‌మాన్ పిలుపుతో వసంత్‌కి ఇష్టమైన స్వీటు చేస్తున్న వకుళ స్టవ్‌మీద వున్న స్వీట్‌ని, తల్లిని చూస్తుండమని వెళ్ళి తలుపు తీసింది. వీధి వరండాకి వున్న గ్రిల్‌లో నుంచి ఒక కవరు పడేసి ఇంటి మెట్లు దిగుతున్నాడు పోస్ట్‌మేన్.

ఆమె వంగి ఆ కవరు తీసింది. కవరుకి నాలుగుమూలలా పసుపు రాసి ఉండడంతో అది శుభలేఖ అని తెలుస్తోంది. ఆమె

సహజమైన ఆసక్తితో కవరు తెరిచి శుభలేఖని బయటకు తీసింది.

చి॥ వసంత్‌కి చి॥సౌ॥ రూప నిచ్చి అని వుంది. ఆమె క్షణ కాలం వసంత్ అంటే ఎవరోలే అనుకుంది. మరోసారి ఆ శుభ లేఖని పూర్తిగా చదివింది. 'నా సోదరుడు లేటు రామ్‌నారాయణగారి పుత్రుడు వసంత్‌కి...' ఆమె కళ్ళు బైర్లు కమ్మాయి. 'ఇదేమిటి రామ్‌నారాయణ అంటే వసంత్ తండ్రి కదూ? వసంత్?'

'వసంత్ పెళ్ళా? ఈ రూప ఎవరు?'

'తాడేపల్లిగూడెం వాస్తవ్యులు శంకరం గారి....'

ఆమె కాళ్ళ కింద భూమి కంపించింది. 'రూప వసంత్ మేనమామ కూతురు... వసంత్ ఆమెని పెళ్ళి చేసుకోబోతున్నాడా?' కళ్ళలో నీళ్ళు కమ్ముకొస్తున్నాయి. హృదయ స్పందన క్షణం ఆగినట్టయింది.

"అమ్మా!" ఆర్తనాదంలా వుందా పిలుపు. వంట గదిలో వున్న సూర్యకాంతమ్మ గాభరాగా బయటకొచ్చింది.

"ఏమిటే, చేతిలో ఆ కవరేమిటి? ఎందుకు ఏడుస్తున్నావ్?" కీడు శంకిస్తున్న మనసుతో దడదడలాడే గుండెతో అడిగింది.

"ఆయన... వసంత్ పెళ్ళిటమ్మా!" బావురుమంది.



"వసంత్ పెళ్ళా... అతను నిన్నేగా పెళ్ళి చేసుకుంటానన్నది? "

"అతను నన్ను మోసం చేసాడమ్మా! నన్నే పెళ్ళి చేసుకుంటానని నమ్మించి, అతని మేనమామ కూతురిని పెళ్ళి చేసు కుంటున్నాడు"

ఆవిడ కూతురి చేతిలో నుంచి శుభలే ఖని అందుకుని చదివి కుప్పకూలిపో యింది.

"ఎంతపని చేసాడే! ఆ ముదనష్టపోడు. నీకెంత ద్రోహం చేసాడే తల్లీ!"

వకుళ ఆ నిజాన్ని జీర్ణించుకోలేకపో తోంది. కళ్ళముందు శుభలేఖ కనిపి స్తున్నా మనసులో చిన్న ఆశ.

"అది అబద్ధమేమో! తనని ఆటపట్టించ డానికి, అలా చేసాడేమో? " ఆమె తనకి తానే ధైర్యం చెప్పుకుని వసంత్‌కి ఫోన్ చేసింది.

"హలో! వకుళా! ఏమిటి నీ గొంతలా వుంది? నా పెళ్ళి శుభలేఖ అందిందా? " వసంత్ నవ్వేడు.

"అది... ఆ శుభలేఖ, మీ పెళ్ళి అబద్ధం కదూ? " జీరపోయిన గొంతుతో అడి గింది.

"నిజం. నా పెళ్ళి రూపతో జరుగు తోంది వకుళా! నీమీదొట్టు"

"అబద్ధం! మీ నాన్నగారు పోయి మూడు నెలలైనా అవకుండా మీరు పెళ్ళెలా చేసుకుంటున్నారు? "

"నేను పీటలమీద కూర్చుని శాస్త్రోక్తంగా పెళ్ళి చేసుకోడంలేదు. రూపని రిజిస్టర్ మేరేజి చేసుకుంటున్నాను. ఆ శుభలేఖ మరోసారి చదువు" వసంత్ ఫోన్ పెట్టే సాడు.

వకుళ పిచ్చిదానిలా ఆ శుభలేఖని మళ్ళీ మళ్ళీ చదివి అతను చెప్పింది యధార్థమని రూఢి చేసుకుని వెక్కివెక్కి ఏడుస్తూ కూల బడిపోయింది.

"ఏమంటాడే వాడు? " సూర్యకాంతమ్మ ఏడుస్తూ అడిగింది.

వకుళ ఏడుపు మధ్య చెప్పింది.

"వీడి అమ్మకడుపు కాల! నీకు ఆశలు పెట్టి నమ్మించి నీకింత ద్రోహం చేసాడా? నీ ఉసురు తగిలి వీడు నాశనమయి పోడా? " ఏడుస్తూ శాపనార్థాలు పెట్టింది.

వసంత్ తనపై చూపించిన ప్రేమ అంతా నటన అని ఆమె నమ్మలేకపో తోంది. అతను తనని నమ్మించి వంచించా డనే బాధ ఉక్రోషంగా, అవమానం ఆగ్ర హంగా మారి దుఃఖంలో నుంచి ప్రతీకార జ్వాల ఎగసిపడింది.

వంటింట్లోంచి స్వీటు మాడి పొగలు వస్తుంటే స్టవ్ కట్టడానికి వెళ్ళి తిరిగివచ్చిన సూర్యకాంతమ్మకి కూతురు కనిపించలేదు.

★ ★ ★

"నన్ను నమ్మించి ఎందుకు మోసం చేసావ్? " వకుళ పూనకం వచ్చినదానిలా ఊగిపోతూ ఆవేశంగా అరిచింది.

"నేను చేసింది మోసం కాదే! నీ పొగరు బోతుతనానికి తగిన ప్రాయశ్చిత్తం" హేళ నగా నవ్వేడు వసంత్. "ఆడదానివి అణిగి మణిగి పడి వుండక విడాకుల కోసం కోర్టు కెక్కి మా ఇంటి పరువు రచ్చకీడుస్తావా? మా నాన్నగారు నువ్వు చేసిన పనికి అను క్షణం ఎంత చిత్రవధని అనుభవించారో తెలుసా? ఆయన తీవ్ర అనారోగ్యానికి కారకురాలివి నువ్వు. ఆయన అర్థాంత రంగా మరణించడానికి కారకురాలివి నువ్వు. అలాంటి నీకు సరైన శిక్షే వేసాను. నువ్వు కాదని తెంచుకోడానికి, కావాలని ముడేసుకోడానికి ఇవి సంకెళ్ళు కాదు. పెళ్ళి!"

"నాతో జీవితాన్ని పంచుకునే ఉద్దేశం లేనివాడివి ఆ రోజు సాయంకాలం నాతో అనుభవాన్ని ఎందుకు పంచుకున్నావ్? "

"నిజం చెప్పనా? నీ అందం చూసి ఆగ



లేకపోయాను. నీకూ ఆ అనుభవం కావాలనిపించిందిగా? అయినా ఉచితంగా ఏదీ కోరుకోను నేను..." వెకిలిగా నవ్వి జేబులో నుంచి అయిదువందల నోటు తీసి ఆమె ముందుకి జాపాడు.

ఓటమి తాలూకు పరాభవంతో అవమానాగ్నిలో నిలువునా దహించుకుపోతూ వెనుదిరిగిందామె. ఆమె అక్కడ నుంచి వెళ్ళాక శాంభవి బయటకి వచ్చి అభినందిస్తున్నట్టు కొడుకు భుజం తట్టింది.

★ ★ ★

"ఆ దుర్మార్గుడు ఇంత మోసం చేస్తాడని కలలోనైనా ఊహించలేదమ్మా! నా బిడ్డ చెప్పాపెట్టకుండా ఎక్కడికి వెళ్ళిందో! ఏ అఘాయిత్యం చేసుకుందో" సూర్యకాంతమ్మ గుండెలవిసేలా ఏడుస్తోంది.

"మీరు ధైర్యంగా వుండండి. వకుళ పిరికిది కాదు. బహుశా మీ అల్లుడి దగ్గరకే వెళ్ళి వుంటుంది. శాంతమ్మ ఓదార్చింది.

"వాడు ఇంకా నా అల్లుడేమిటి? నా కూతురిని చేసిన మోసానికి పురుగులు పడి చస్తాడు? " ముక్కు చీదుతూ శాపనార్థాలు పెట్టసాగింది.

అంతలో ఇంటి ముందు ఆటో ఆగింది. ఇద్దరూ తలలు తిప్పి చూసారు. ఆటో దిగి లోపలకి వస్తున్న వకుళ ఆత్మీయులని దహనం చేసి మరుభూమి నుంచి వచ్చిన వ్యక్తిలా వుంది.

"ఎక్కడికెళ్లావే? నేనెంత గాభరాపడుతున్నానో తెలుసా? " ఆతృతగా కూతురికి ఎదురువెళ్తూ అడిగింది. ఆమె తల్లిని కౌగిలించుకుని భోరుమంది.

"దారుణంగా మోసపోయానమ్మా! నా జీవితంతో క్రూరంగా ఆడుకున్నాడు" అంటూ వసంతన్న ప్రతీమాట చెప్పింది.

"అయ్యో తల్లీ! నీ రాత ఇలా తగలబడిందామ్మా" సూర్యకాంతమ్మ పెడుతున్న శోకా

## కొత్తగాలి...

**పుత్తడి పుస్తెలొద్దు**
**బంగారంలాంటి**
**పెనిమిటి కావాలి**
**టిటిడీ, కొత్త స్కీం ప్లీజ్**

–కె.ఆర్.వి.వి.రత్న కుమారి

లకి ఇరుగు పొరుగు వాళ్లు, రోడ్డుమీద వెళ్లే వాళ్లు ఆ ఇంట్లోకి తొంగిచూడడం మొదలు పెట్టారు.

శాంతమ్మకి ఆ పరిస్థితి బాధగానే కాదు, ఇబ్బందిగా కూడా వుంది. వారిద్దరినీ అనునయించింది.

సూర్యకాంతమ్మ వసంత్‌ని, అతని తల్లిని తిట్టి తిట్టి అలసిపోయింది.

సాయంకాలం నాలుగున్నరయింది. టింకూ స్కూల్ నుంచి వచ్చాడు. ఏడ్చి ఏడ్చి అలసిపోయి గోడకి అనుకుని కూర్చున్న వకుళ దగ్గరకి వచ్చి "అమ్మా! డాడీ మన ఇంటికి వస్తారన్నావు ఏరి? " అనడిగేడు. వకుళ వాడిని కౌగిలించుకుని మరోసారి ఘొల్లుమంది.

"జరిగిందేదో జరిగింది. ఇప్పుడేం చేయాలనుకుంటున్నావు? " వకుళని అడిగింది మాధవి. ఆమె ఏమీ మాట్లాడకపోవడంతో "నా ఉద్దేశం ప్రకారం ఇప్పటికే నువ్వు చాలా టైము వేస్ట్ చేసేసావు వకుళా! విడాకులు తీసుకున్న తర్వాత నూటికి తొంభై మంది స్త్రీలు భర్తతో తిరిగి కలవాలని, తనని తన భర్త తిరిగి ఆదరిస్తాడని ఎదురు చూస్తూ వర్తమానాన్ని మరచిపోయి గతంలో బతుకుతూ భవిష్యత్తుని నిర్లక్ష్యం చేస్తారు. సరే, ఇప్పుడు నీకు కష్టం తెలియకుండా మీ అమ్మగారున్నారు. మీ నాన్నగారి పెన్షన్, ఇంటి అద్దెల తాలూకు డబ్బులతో నిన్ను, టింకూని చూసుకుంటున్నారు. భవిష్యత్‌లో టింకూని చదివించ

డానికి ఆ డబ్బు సరిపోతుందా? "
వకుళకళ్ళలో భయం రెపరెపలాడింది.
"అందుకే చదువుకో. నీ కాళ్ళ మీద నువ్వు నిలబడు. నేను చదువుకున్నాను. కాబట్టే నా పుట్టింటి వాళ్ళని, అత్తింటి వాళ్లని లెక్కచెయ్యకుండా నా కాళ్ళమీద నేను నిలబడగలిగాను. యాభై లక్షలు విలువచేసే ఆస్తిని దానం చేసినా నన్ను నేను పోషించుకోగలిగే స్థితిలో వున్నాను" అని సూర్యకాంతమ్మ వైపు చూసింది.
"భర్త పోయాడని నేనన్న మాట నిజం పిన్నిగారూ! అబద్ధం కాదు"
ఆవిడ ముఖం తెల్లబడింది.
"సంపన్నుల కుటుంబంలో పుట్టాను నేను. మరో సంపన్నుల కోడలినయ్యాను. భర్త వ్యసనపరుడనే నిజం పెళ్లయిన మూడో రోజునే తెలిసింది. మూడేళ్ళ వైవాహిక జీవితంలో ప్రతీక్షణం నరకాన్నే చవి చూసాను. విడాకులివ్వడానికి అధైర్యం! పరువు పోతుందేమో? జీవితమంతా నాకు ఎవరు తోడుంటారు. ఇలాంటి పిచ్చి భయాలు! భగవంతుడు కారు యాక్సిడెంటులో నా భర్తని చంపేసి నాకు విముక్తి కలిగించాడు. నాకు పిల్లలు పుట్టని కారణంగా నా పుట్టింటివాళ్ళు నాకు పసుపు కుంకుమల కింద ఇచ్చిన ఆస్తి, నా భర్త నుంచి సంక్రమించిన ఆస్తికి వారసులు లేకపోవడంతో తమ పిల్లలని దత్తత తీసుకోమని నా బావగార్లు, ఆడబడుచులు నాపై వత్తిడి తెచ్చారు. మా అత్తగారు ఉచ్ఛనీచాలను మరచిపోయి మా మరిదిని పెళ్లి చేసుకోమని నన్ను బలవంతపెట్టింది. రాత్రిళ్ళు మా మరిది నేను పడుకున్న గది తలుపు తట్టేవాడు. ఇలాంటి పరిస్థితులలో అక్కడ రక్షణ లేదని భావించిన నేను పుట్టిల్లు చేరాను. నా అన్నావదినెలు, అక్కాచెల్లెళ్ళు నన్నెంతో అభిమానించి నన్ను నెత్తిన పెట్టుకున్నారు. కొన్ని రోజులు గడిచాక వాళ్ళ ప్రేమ వెనుక వున్న స్వార్థం బయటపడింది. ఎవరికి వాళ్ళు తమ పిల్లలని దత్తత తీసుకోమని వత్తిడి చెయ్యడం మొదలు పెట్టారు. ఎనిమిది, పది సంవత్సరాల వయసున్న ఆ పిల్లలకి తమ తల్లిదండ్రులెవరో తెలుసు. అలాంటి పిల్లలని నేను దత్తత తీసుకుంటే వాళ్ళు నన్ను 'అమ్మా' అని పిలుస్తారా? నాకు చేరిక అవుతారా? అదే ప్రశ్నించాను. నా అత్తింటి తరఫు పిల్లలని దత్తత తీసుకోకపోడానికి కారణం కూడా అదేనని చెప్పాను. వాళ్ళు అర్థం చేసుకోలేదు. మూర్ఖంగా పట్టుపట్టారు. నాకు వాళ్ళ మనస్తత్వాలు చూసి అసహ్యం వేసింది. డబ్బు ఎంత పాపిష్టిదో అర్థమయింది. లక్షలు విలువచేసే నా ఆస్థి ఈ స్వార్థపరుల చేతికి ఇస్తే నిరర్థకమవుతుంది. అందుకే నా ఆస్తిలో ఒక్క రూపాయి కూడా మిగుల్చుకోకుండా మదర్ థెరిసా ఛారిటీస్‌కి విరాళంగా ఇచ్చేసాను. అది తెలిసి నా పుట్టింటివాళ్ళు నన్ను బైటకి గెంటేసారు. ఇంట్లో వాళ్లని కాదనుకుని ఆస్తిని ఎవరికో ధారాదత్తం చేసిన నేను తిండికి మొహం వాచి చస్తానన్నారు. నేను చలించలేదు. డబ్బు మనుషులని కలుపుతుంది. ఆ డబ్బే మనుషులని విడదీస్తుందనే నగ్నసత్యం రుజువయింది. నా బట్టలు, సర్టిఫికెట్లతో బయటకొచ్చి చిన్న ఉద్యోగం సంపాదించుకున్నాను. ఎం.కామ్ ప్రయివేటుగా చదివి ప్యాసయ్యాను. వర్ధనమ్మ ఆంటీ... ఆనంద్ వాళ్ళమ్మగారు నన్ను తమ ఇంట్లో వుండమని బతిమాలినా వినలేదు నేను. ఒంటరి పోరాటానికే నిశ్చయించుకున్నాను. సైడ్ఎఫెక్టుగా మొండితనం అబ్బింది. ముందు చిన్న ఉద్యోగంలో చేరిన నేను కష్టపడి ఈ పొజిషన్‌కి ఎదిగాను"
మాధవి చెబుతున్నది ఒక కథలా

వింటున్న వకుళ, సూర్యకాంతమ్మల కళ్ళలో పశ్చాత్తాపం కన్నీరై కురిసింది.

"నన్ను క్షమించమ్మా!" అని సూర్యకాంతమ్మ, "ఐయామ్ సారీ" అని వకుళ అంటూంటే మాధవి నవ్వింది.

"ఎన్ని కష్టాలు పడ్డావమ్మా మాధవీ! అందరూ వుండికూడా ఎవరూలేని దానిలా ఇలా..." శాంతమ్మ గాద్గదికంగా అంది.

"నన్నింతగా అభిమానించే మీరంతా వుండగా నేను ఒంటరిదాన్నెలా అవుతాను పిన్నిగారూ?" మళ్ళీ నవ్వింది.



సరిత కళ్ళలో నీళ్ళూరుతుండగా మాధవి చేతిని తన చేతిలోకి తీసుకుంది. భాష చెప్పలేని భావాన్ని స్పర్శచెబుతుంది. ఆ స్పర్శలో బాధ, దుఃఖం, సానుభూతి అన్నిటినీమించిన స్నేహం వున్నాయి.

"ఉద్యోగం చేసే ఆడవాళ్ళందరూ చెడిపోయిన వారు కాదు పిన్నిగారూ! కొందరు తాము చదివిన చదువుని సార్థకం చేసుకోడానికో, మరికొందరు ఇల్లు గడవకో ఉద్యోగం చేస్తున్నారు. ఆడవాళ్ళకి ఆర్థిక స్వాతంత్ర్యం తప్పనిసరి. అది చాలా సమస్యలని పరిష్కరిస్తుంది" అని మాధవి వకుళ వైపు తిరిగింది.

"వకుళా! భర్త లేకుండా బతకలేననే అధైర్యాన్ని విడిచిపెట్టు. చదువుపై ఇంట్రస్ట్ లేకపోతే స్వయం ఉపాధి కింద ఏదైనా చిన్న పరిశ్రమ పెట్టు. పదిమందికి ఉపాధి కల్పించు. నీకు నచ్చిన, ఆసక్తి వున్న రంగాన్ని ఎంచుకో"

వకుళలో ఆమె మాటలు ఆలోచనని రేకెత్తించాయి. స్ఫూర్తిని కలిగించాయి. ధైర్యాన్నిచ్చాయి.

"మీ సహాయ సహకారాలు నాకు వుంటే ఏదైనా సాధించగలను మేడమ్" అంది.

"తప్పకుండా వకుళా!" అంది మాధవి వాగ్దానమిస్తున్నట్టు.

రాహుల్ వచ్చాడు.

"అమ్మా! డాడీ బ్యాటింగ్ చేస్తున్నారు. నేను బౌలింగ్, టింకూ ఫీల్డింగ్.. అంపైర్ లేరు. డాడీ నిన్ను రమ్మంటున్నారు"

సరిత చిరునవ్వుతో లేచి వెళ్ళింది.

"నాకో సందేహం మాధవీ! సరిత భర్త నిజంగా అమెరికాలో లేడా? వున్నట్టుండి ఆనంద్ సరిత భర్త ఎలా అయ్యాడు?" సూర్యకాంతమ్మ మాధవి చెవి దగ్గర గుసగుస లాడింది.

"ఈ ప్రశ్న ఇదివరకోసారి అడిగారు. నా సమాధానమూ విన్నారు. మళ్ళీ చెబుతున్నాను. ఏడు జన్మల క్రిందటే వాళ్ళు భార్యాభర్తలు." అచ్చం ఆవిడలాగే తను కూడా ఆవిడ చెవి దగ్గర గుసగుసలాడుతూ ముసిముసిగా నవ్వింది మాధవి. Ⓒ



# కాలాతీతం




# 'అమ్మ'కు నూరేళ్ళు

భర్త మరణించినందుకు పెలగేయా సంతోషిస్తుండాలి అన్నారంతా. నిజమే! మిహయిల్ వ్లాసావ్ ముక్కోపి, తాగుబోతు. ఫ్యాక్టరీలో ఇచ్చిన కూలి తాగుడుకే తగలేస్తాడు. పైగా పెళ్లాన్ని రోజూ చావగొడతాడు. వారి కొడుకు పావెల్. తండ్రిమరణం తర్వాత ఫ్యాక్టరీలో చేరాడు. అందరిలాగే మొదటిరోజుల్లో తాగినా, కొత్త స్నేహితుల సాంగత్యంలో త్వరలోనే అతడిలో మార్పు వచ్చింది. రాత్రులు పుస్తకాలు చదవటం ప్రారంభించాడు. అదంతా నిషేధిత సాహిత్యం. అధికారులకు తెలిస్తే జైల్లో పెడతారు.

కార్మికుల జీవితాలు ఇంత కఠినంగా ఎందుకున్నాయో అవగాహన చేసుకోవాలి అనుకున్నాడు పావెల్. క్రమంగా రహస్య సమావేశాలకు వెళ్లటం మొదలైంది. మనలను నాశనంచేస్తోంది భయమే. అందుకే మనలనణగదొక్కి బెదిరిస్తున్నారు అన్పించింది.

అతడి కొత్త మిత్రులు, రాత్రివేళ వచ్చి సుదీర్ఘ చర్చలు చేసేవారు. పెలాగేయాకి ఇవేమీ అర్థంకావు. కొడుకుసహా అందరూ ప్రమాదాల్ని కొనితెచ్చుకుంటారేమోనని భయం. హొహోల్, ఆంద్రేయ్, నికొలాయ్, వెసావెశ్చికోవ్, మరోపిల్ల నతాషా తరచూ రాత్రంతా అక్కడే గడిపేవారు. రోజులు దొర్లిపోయాయి. ఇంట్లో సమావేశం జరగని రోజులేదు. ఈ యువతీ యువకులంతా సోషలిస్టులని తల్లికి తెలుసు.

ప్రపంచ కార్మికులంతా సోదరులనే విశ్వాసమే మా తల్లి మాయమ్మ అంటూ వాదించాడు హొహోల్.

'త్వరలో మనం ఒకపత్రిక ప్రారంభించాలి' అన్నాడు పావెల్ ఒకనాడు. కాని కొద్దిరోజుల్లోనే, రహస్య కార్యక్రమాల గురించి బైటికి పొక్కింది. నీలిసిరాతో రాసి పంచిపెడుతున్న కరపత్రాల గురించి కూలీల పేటలో మాట్లాడుకోవటం మొదలెట్టారు. ఈ కరపత్రాలు ఫ్యాక్టరీ యజమానులను ఘాటుగా విమర్శించాయి. కార్మికులంతా తమ హక్కులరక్షణ కోసం ఏకం కావాలని హెచ్చరించాయి.

పోలీసులు వచ్చి ఇల్లంతా చిందర వందరచేసి వెసావెశ్చికోవ్‌నూ, ఒనీసిమొవ్‌నూ అరెస్టుచేసి తీసుకుపోయారు. పెలగేయాకళ్లలో నీళ్లు తిరిగాయి.

'అంతగా కన్నీరు కార్చేయవద్దు. ముందు ముందు కార్చటానికి దాచుకో' అన్నాడు పోలీస్ ఆఫీసర్ వ్యంగ్యంగా.

'బిడ్డలను కన్న తల్లికి కన్నీటికి కొదవుం

## మక్సీమ్ గోర్కీ (1868-1936)

జీవితంలోని చేదునిజాలను మాత్రమే ఆవిష్కరిస్తాననటానికి సంకేతంగానేమో మక్సీమ్ గోర్కీ (గోర్కీ అంటే రష్యన్‌లో 'చేదు') అనే కలం పేరుతో రచనలు చేశాడు అలెక్సేయ్ మక్సీమొవిచ్ పేష్కొవ్. పుట్టింది నిజ్నీ నొవ్‌గొరాడ్‌లోని ఓ నిరుపేద కుటుంబంలో. మూడో ఏటనే కలరా సోకింది. అప్పుడే అదే జబ్బుతో తండ్రి పోయాడు. తల్లి పుట్టింటికి చేరడంతో మాతామహుల యింటనే అక్షరాభ్యాసం చేశాడు. తాతచెప్పిన కథలు విన్నప్పుడు కథలమీద ఆసక్తి కలిగింది. ఆ తర్వాత రెండేళ్లు బడికెళ్లాడు గాని, మశూచి సోకి మానేశాడు. పదేళ్ళప్పుడు హాన్స్ ఆండర్సన్ ఫెయిరీ టేల్స్ చదివి స్వప్న లోకాల్లో విహరించాడు. తల్లి మరో పెళ్లి చేసుకుంది. ఒకనాడు పెంపుడు తండ్రి తల్లిని కొట్టటం చూసి సహించలేక, అతడితో పోట్లాడి తాత వద్దకు పారిపోయాడు. మరో ఏడాదికి తల్లి మరణించింది. చెప్పులకొట్లో కొన్నాళ్లు, మెసెంజర్ బాయ్‌గా కొన్నాళ్ళు, బేకరీలోనూ పనిచేసి, చివరికి పాసెంజర్ షిప్‌లో చేరాడు. అక్కడ గొగోల్ కథలూ, హెన్రీ ఫీల్డింగ్ 'టామ్‌జోన్స్' చదివి సాహిత్యాభిరుచి పెంచుకున్నాడు.

తరచూ మారే వుద్యోగాలతో తిండికిలేని దుస్థితి. తాత కూడా మరణించారు. జీవితంపై విరక్తితో ఆత్మహత్యాయత్నం చేశాడు. ఆపరేషన్ చేసి బులెట్ తీశాక జీవిత దృక్పథం మారింది. రెండేళ్ళపాటు కాలినడకన రష్యామొత్తం పర్యటించి, పేదల స్థితిగతులను అధ్యయనం చేశాడు. 'ఎమ్.గోర్కీ' పేరుతో అచ్చయిన ఆయన

డదు. మీకు తల్లి అంటూ వుంటే ఆమెకు తెలుస్తుంది' అంది పెలగేయా. మరుసటి రోజు మరి కొందర్ని అరెస్టు చేశారు.

ఫ్యాక్టరీ యాజమాన్యం దుర్మార్గాలను ఎదిరించడానికి కార్మికులను సిద్ధం కమ్మన్నాడు పావెల్.

'వాళ్లతో సమ్మెచేయించటం మనవల్ల కాదు. ఆశాపరులే గాని పిరికిపందలు' అంటూ పెదవి విరిచాడొక కామ్రేడ్.

కార్మికులను రెచ్చగొట్టినందుకు పావెల్ అరెస్టయ్యాడు.

పేదకూలీల స్థితిగతులు మెరుగు పడటానికే పనిచేస్తున్నాడు తన కొడుకు. అతడి కార్యక్రమం కొనసాగించాలి. ఫ్యాక్టరీలో రహస్యంగా కరపత్రాలు పంచి పెట్టాల్సిందే. తనే ఆపని చేస్తానంది పెలగేయా. తినుబండారాలమ్మే నెపంతో కాగితాల కట్టలను గంపలో దాచుకుని లోపలికెళ్లింది. అయితే ఆమెకు చదువు రాదు. తను పంచిపెడుతున్న కరపత్రాల సమాచారం తెలుసుకోవాలంటే అక్షరాలు పోల్చుకోవడం తప్పనిసరి. కాని నలభై దాటాయి. ఇప్పుడు నేర్చుకోవటమా?

'మీరు చదవటం నేర్చుకోవాలి. కొత్తబాధ్యత నెత్తినేసుకోవాలంటే చదువు తప్పనిసరి' అంటూ ఆమెను ప్రోత్సహించాడు హొహోల్.

కొడుకును చూడాలని తల్లి మూడుసార్లు అధికారులను కోరింది. వారు తిరస్కరించారు. అనేక ప్రయత్నాల తర్వాత అతన్ని కలిసినప్పుడు ముందున్న కర్తవ్యం గురించే తల్లితో చర్చించాడు పావెల్. ఇంటికి వచ్చి, యితర కార్యకర్తలతో కలిసి మరింత చురుగ్గా పనిలో పాలుపంచుకుంది

తొలికథ 'మకర్ చుద్రా' (1892). మధ్య తరగతి పతనాన్ని చిత్రించిన 'ఫోమా గార్డెయేవ్' 1899లో సీరియల్‌గా అచ్చయింది. చెల్కాష్, ఒక శిశిరపురాత్రి, ఇజర్‌గిల్ వృద్ధురాలు ఈ దశలో రాసిన ముఖ్య కథలు. తర్వాత రాసిన నాటకం లోయర్ డెప్త్స్ (1902). మరుసటి ఏడాదే సోషల్ డెమోక్రటిక్ పార్టీతో సంబంధాలు మొదలయ్యాయి. 1905లో తొలివిప్లవం విఫలమయ్యాక బోల్షివిక్కులను సమర్థించినందుకు నిర్బంధం తప్పలేదు. విడుదల తర్వాత పార్టీ సభ్యత్వం తీసుకున్నాడు. గోర్కీ ఆత్మకథ 'బాల్యం, మై అప్రెంటిస్‌షిప్, మై యూనివర్సిటీస్', నవలలు 'లైఫ్ ఆఫ్ మాట్వేమ్ కోజెమ్యాకిన్' తదితరాలు ప్రపంచ ప్రసిద్ధాలు. లెనిన్, స్టాలిన్‌లకు సన్నిహితుడు గోర్కీ. తుదిదశలో పశ్చిమ దేశాల వాళ్లు అతనిపై వివాదాస్పద వ్యాఖ్యలు చేసినా అవేవీ ఆయన రచనల సార్వజనీనతను తగ్గించవు.

పెలగేయా.

★ ★ ★

పావెల్ విడుదలై వచ్చినకొద్ది రోజులకే, మే దినోత్సవం జరపటానికి ప్రయత్నాలు ప్రారంభమైనాయి. పేటలోనూ, ఫ్యాక్టరీలోనూ కరపత్రాలు పంచారు. ప్రకటనలు అతికించారు. పావెల్‌కూ, ఆన్‌ద్రేయ్‌కు దాదాపు నిద్ర లేదు. చెయ్యవలసిన పనులెంతవరకూ తెగవు.

మేడే నాడు- పెద్దవీధినుండి పోయే యిరుకు సందులో సమారు నూరుమంది సమావేశమైనారు. వాళ్ల మధ్య నిలబడి వెసొవెశ్చికోవ్ ఉపన్యసించాడు.

'మన రక్తాన్ని వాళ్లు నల్లులు పీల్చేసినట్టు పీల్చేస్తున్నారు...'

ఆ తర్వాత ఆన్‌ద్రేయ్ ప్రసంగించాడు. జనం పెరిగారు. కాలివేళ్ల మీద నిలబడి మెడలెత్తి చూస్తున్నారు.

## గోర్కీ గురించి మరికొంత..

**ని**జ్నీ నొవ్‌గొరాడ్ సమీపాన వున్న సార్మొవోలో 1902లో జరిగిన మేడే ప్రదర్శన, పోలీసు నిర్బంధకాండ, విప్లవ చైతన్యంతో కార్మికులు, కర్షకుల రహస్య కార్యకలాపాలు 'అమ్మ' నవలకు నేపథ్యం. 1904లోనే గోర్కీ దీనికి 'నోట్స్' తయారు చేసుకున్నాడు. బోల్షివిక్కులకు అనుకూలంగా ప్రజాభిప్రాయాన్ని సాధించడానికి, ధనసాయం అర్థించటానికీ గోర్కీ 1906 ఏప్రిల్ 10న అమెరికాలో కాలుమోపాడు. మార్క్‌ట్వేన్ ఆధ్వర్యంలో ఆహ్వాన సంఘం ఏర్పడింది. దేశ అధ్యక్షుడు రూజ్‌వెల్ట్ స్వాగత సన్నాహాలు చేశాడు. ప్రభుత్వ వ్యతిరేక ఉద్యమానికి యింత గౌరవం లభించటం జార్జ్ చక్రవర్తి జీర్ణించుకోలేకపోయాడు. 'గోర్కీ వెంటవచ్చింది భార్యకాదు. ఎవరో రంగస్థల నటి' అంటూ రష్యన్ రాయబార కార్యాలయం లీక్ చేసిన వార్తను ప్రకటించిందొక పత్రిక. అంతే. తక్షణం హోటల్‌గది ఖాళీ చేయించారు. అతడు రోడ్డున పడ్డాడు. తర్వాత మిత్రుల సహాయంతో ఆడిరాండాక్ పర్వతాల్లో లాగ్ కేబిన్ కట్టుకుని తన కార్యక్రమం కొనసాగించాడు. ఆ కోపం, కసితో రాసిందే అమ్మ. మొదటి భాగం అమెరికాలోనూ, రెండో భాగం ఇటలీలోనూ ముగించాడు.

ఈ రష్యన్ నవల మొదట ఇంగ్లీషు అనువాదంలో, ఆపిల్‌టన్ మేగజైన్ (న్యూయార్క్)లో 1906-1907లో సీరియల్‌గానూ, 1907 ఏప్రిల్‌లో పుస్తకంగానూ వచ్చింది. బ్రిటిష్ ప్రచురణకర్తలు దీన్ని 'కామ్రేడ్స్'గా విడుదల చేశారు. రష్యాలోనైతే ఇది విప్లవం తర్వాతగానీ పాఠకులకు చేరలేదు. 'అమ్మ' ఆధారంగా తీసిన పుడోవ్‌కిన్ సినిమా, బెర్టోల్ట్‌బ్రెక్ట్ నాటకం కూడా కళాఖండాలే.

'ఈ మే దినం నాడు....'

'పోలీసులు!' అంటూ ఒకడు కేకేశాడు. గుర్రాల మీద నలుగురు పోలీసులు వస్తూనే 'పొండి... పొండి' అంటూ కేకలేశారు.

'కామ్రేడ్స్, ఏది ఏమైనాసరే, ఈ రోజు మన పతాకం ఎగరవేయాల్సిందే. అదే మన దృఢనిశ్చయం...' అంటూ ప్రారంభించాడు పావెల్.

జెండా గాలిలో రెపరెపలాడింది. జనం ఎర్రజెండాకేసి తోసుకుంటూ ముందుకొచ్చారు.

'చక్రవర్తి మీద తిరుగుబాటా!' అన్నాడొక కీచుగొంతు మనిషి, ఊరేగింపును చెదరగొట్టటానికి ఒక సైనిక పటాలాన్ని స్కూలు దగ్గర, మరొక పటాలాన్ని ఫ్యాక్టరీ దగ్గర మోహరించారు.

'వాళ్లను అరెస్టు చెయ్యండి' అంటూ ఆజ్ఞ జారీ కాగానే సిపాయిలు ముందుకు పరిగెత్తారు.

తల్లి కెవ్వుమంది.

దానికి జవాబుగా సిపాయిల మధ్యనున్న పావెల్ నుంచి 'శలవు అమ్మా, శలవు' అన్న మాటలు వినబడ్డాయి.

## రెండోభాగం

సాయంత్రం పోలీసులొచ్చి యిల్లు సోదా చేశారు. ఈసారి భయపడలేదు తల్లి.

కొడుకు జైల్లో మగ్గుతున్నాడు.

'ఇప్పుడు చెయ్యవలసిందేమిటి? ' అని ప్రశ్నించుకుంది.

'పత్రిక అచ్చువేయమని కోరిన రైతుల చిరునామాలు పావెల్‌నడిగి మీరు తీసుకోవాలి" అంటూ సూచించాడు నికొలాయ్.

'వాళ్లను నేనెరుగుదును. నేను నిషిద్ధ పత్రాలను తీసుకెళుతున్నానని ఎవరూ ఊహించరు' అంటూ సంతోషంగా చెప్పింది తల్లి. 'నేనెక్కడికైనా పోగలను. అన్ని రాష్ట్రాలలోనూ, అన్ని రోడ్లవెంటా, దారి తెలుసుకుంటూ వెళ్లగలను. సమాధి చేరేదాకా యిలా తిరుగుతూనే వుంటాను, నాకింకేం గావాలి గనుక!'

అలా ప్రారంభమైంది ఆమె 'తీర్థయాత్ర'! పుణ్యక్షేత్రాలు దర్శించే పథికురాలి వేషంలో అనేక ఊళ్లు తిరిగి పేద రైతులతో, కార్మికులతో ముచ్చటించి, వాళ్ల కష్టాల్లో పాలుపంచుకుని పార్టీ సాహిత్యం అందచేసింది. పట్టుబడితే చిత్రహింసలు, సైబీరియాకు శాశ్వత ప్రవాసమూ తప్పవని తెలుసు. రహస్య జీవితమంటే దినదినగండమే. కాని అణగారిన ప్రజల యథార్థ స్థితి తెలుసుకునే మార్గమిదే.

'యంత్రం మనిషిని చంపేసినా, ఒక చేతిని నరికేసినా యజమానులు కార్మికుడిదే తప్పంటారు. వాళ్లనడిగేవాళ్లు లేరు' అంటూ తమ గోడు చెప్పుకున్నారు కార్మికులు.

రోజులు గడుస్తున్నాయి. నతాషా ఒక బట్టల మిల్లువారు నడిపే పాఠశాలలో ఉపాధ్యాయినిగా చేరింది. నిషిద్ధ పుస్తకాలను, ప్రకటనలను వార్తాపత్రికలను ఆమెకు చేర్చటం తల్లి డ్యూటీ.

అనేకసార్లు జైల్లోవున్న కొడుకును చూడాలనిపించింది. కాని అది కష్టసాధ్యం. అధికారులు ఓ పట్టాన అనుమతివ్వరు. పైగా తనకు చేతులనిండా పని.

ఉద్యమం వూపందుకుంది. పార్టీ సెల్స్ పెరిగాయి. కొడుకుగురించి ఆమె బెంగపడని రోజులేదు. కాని, ఇప్పుడు యువ కార్యకర్తలందరూ తన సంతానమే. అందరికీ తను 'అమ్మ'.

మరి కొన్నాళ్లకు పావెల్, యితర కామ్రేడ్ల మీద విచారణ జరిగేరోజు రానే వచ్చింది. కోర్టులో జడ్జి నిశ్చలంగా కూర్చున్నాడు.

ప్రభుత్వ ఆరోపణలకు జవాబుగా

పెళ్లంటే జరిగింది కానీ
పెద్దల పంతాలు పట్టింపుల వల్ల
ఆమె జీవితాంతం కన్నెగానే
మిగిలిపోయింది.
అయితేనేం? పలువురితో
అపురూపవ్యక్తిగా ఆమె ఎలా
మన్ననలు సాధించింది?
కాకాని చక్రపాణి
ప్రోత్సాహక బహుమతి
పొందిన నవల
శీల పరీక్ష
ఫిబ్రవరి చతుర లో మీకోసం

పావెల్ ప్రశాంతంగా తన ఉపన్యాసం ప్రారంభించాడు.

'మేం సోషలిస్టులం. అంటే మనుషులు స్వంత ఆస్తిని సంపాదించుకోవటానికి వ్యతిరేకులం... మేం విప్లవకారులం. జడ్జీలైన మీరు ఎవరి క్షేమలాభాలను సంరక్షించటానికి వున్నారో ఆ సంఘానికి మేం బద్ధ విరోధులం..'

సుదీర్ఘమైన వాద ప్రతివాదనల తర్వాత ముద్దాయిలకు ప్రవాస శిక్ష విధించారు.

కాని నిర్బంధకాండవల్ల ఉద్యమం ఆగదు. చేయవలసిన పని యింకా మిగిలున్నదని అమ్మకు తెలుసు. మాస్కోలో తన కార్యక్రమం కొనసాగించటానికి మారు వేషంలో బయల్దేరి రైలుకన్న ముందుగానే స్టేషన్‌కు చేరుకుంది. మూడో తరగతి ప్రయాణీకుల బోగీ ముందు పొట్టికోటు తొడుక్కున్న ఒక యువకుడు దారి కడ్డొచ్చాడు. అతడిని చూడగానే ఆమెలో సందేహం మొదలైంది.

'దొరికి పోయానా ఏమి?' అని తన్ను తానే ప్రశ్నించుకుంది. అంతలోనే గూఢచారి, స్టేషన్‌గార్డును పిలుచుకొచ్చి ఆమెను చూపించాడు.

'ఓసి దొంగా, ఈ వయస్సులో యిలాంటి వేషాలా?' అంటూ చిరచిరలాడాడు ముసలి గార్డు.

'నేను దొంగను కాను' అంటూ బిగ్గరగా అరిచింది అమ్మ. క్షణంలో పోలీసులొచ్చారు.

'ఓ సత్పురుషులారా! కలిసికట్టుగా నిలవండి. ఒకేఒక ప్రబలమైన శక్తిగా ఎదగండి' అంటూ గొంతెత్తి అందిరినీ కోరింది.

ఎవరో ఆమె గుండెలమీద బలంగా గుద్దేరు. ఆమె బెంచీమీద పడిపోయింది.

—వసంత

# నవంబరు నవల ఆకృతి పై పాఠకుల సమీక్షలు

## ఎడారిలో ఒయాసిస్సు

రూ. 100/- పొందిన సమీక్ష

మంచి కథలు, నవలలు కరువైపోతున్న ఈ కాలంలో ఎడారిలో ఒయాసిస్సులా "ఆకృతి" పాఠకుల దాహాన్ని తీర్చింది. చాలా రోజుల తర్వాత మంచి నవల చదివిన అనుభూతిని మిగిల్చింది. రచయిత్రి అనురాధ ఒక్కో పాత్రను మలిచిన తీరు అద్భుతం. నేటి సమాజంలో ఒక స్త్రీ ఎలా వుంటే నెగ్గుకు రాగ లదో అమృత పాత్ర ద్వారా, ఎలా వుండకూడదో ఆమె అక్క యమున పాత్ర ద్వారా తెలియజేశారు. రచయిత్రి మాటల్లోనే చెప్పాలంటే "బలమైన వ్యక్తిత్వం, స్పష్టమైన భావాలూ, ప్రశ్నించే స్వభావం పోరాడే మనస్తత్వం" ఇవన్నీ నేటి మహిళకుండవలసిన లక్షణాలు. అమృత పాత్ర ద్వారా ఇవన్నీ వ్యక్తమయ్యేటట్లు కథను నడిపిన తీరు అమోఘం.




అనుక్షణం అర్థం లేని భయాలతో చివరికి కెరీర్‌ను బుగ్గిపాలు చేసుకొని, జీవితాన్ని కూడా ఆ చట్రంలోనే బిగించి నడిపే యమున, సంప్రదాయ భావాలతో అనుక్షణం భయాలు నూరి పోసే సగటు తల్లిగా వసంత, భిన్న మనస్తత్వాలు ఉన్న ఇద్దరు కూతుళ్లు, ఒక పరిధికి మించి ఆలోచించకుండా ఒత్తిడిచేసే భార్య, ఎవరికీ నచ్చ చెప్పలేక ఒక దశలో కుటుంబ సభ్యుల ఒత్తిడికి తలొగ్గిపోయే తండ్రిగా విశ్వం పాత్రలను చిత్రించిన తీరు బాగుంది. తొలుత లండన్ వెళ్లి స్థిరపడాలనుకున్నా భారతదేశంలోని మానవ సంబంధాల గొప్పతనాన్ని గ్రహించి అక్షయ్ ఇక్కడే బిజినెస్‌లో స్థిరపడడం చక్కని మలుపు. బిజినెస్ మ్యాన్ ఎలా వుండాలో నిర్వచించే చంద్రశేఖర్ పాత్ర హుందాగా ఉంది. జీవితం చరమాంకంలో వృద్ధులు కోరుకునేదేమిటో అక్షయ్ నాన్నమ్మ పాత్ర ద్వారా రచయిత్రి అద్భుతంగా తెలియచెప్పారు. ఆఫీసులో అమ్మాయిలు ఎలా మసులుకుంటే రాణించగలరో చెప్పేందుకు అమృత పాత్ర ఉదాహరణ. ఇష్టమున్నా లేకపోయినా ఇచ్చిన పనికి నూరు శాతం న్యాయం చేకూర్చి పూర్తిచేసే వైనం, వృత్తి పట్ల ఆమె అంకితభావం యువతకు మార్గదర్శకం. కాలేజీలలో ర్యాగింగ్ రుగ్మత వల్ల స్టూడెంట్స్ భవిష్యత్తు ఎలా మసిబారిపోతుందో చూపించి సమకాలీన సమస్యను కూడా టచ్ చేశారు రచయిత్రి. పాత్రలు మలచడంలో ఎంతో శ్రద్ధ తీసుకున్న రచయిత్రి కథనాన్ని ఫ్లాష్ బ్యాక్‌లో నుండి మరో ఫ్లాష్ బ్యాక్‌లోకి తీసుకెళ్ళి పాఠకులను కాసింత కన్‌ఫ్యూజన్‌లోకి నెట్టారు. చంద్రునిలో మచ్చలాగా ఈ విషయాలు తప్పిస్తే ఈ నవల పాఠకులందరికీ తియ్యటి పాలకోవా తిన్నంత మధురానుభూతిని మిగుల్చుతుంది.

–ప్రియతమ్ యస్సెల్, హైదరాబాద్

## అభ్యుదయ మహిళకు సజీవ ఆకృతి

రూ. 75/- పొందిన సమీక్ష

నవంబరు నెల చతుర నవల 'ఆకృతి' నిజంగానే నేటి అభ్యుదయ మహిళా జీవితానికి సజీవ ఆకృతి. రచయిత్రి కథను నేర్పుగా సమకాలీన పరిస్థితులను ప్రతిబింబిస్తూనే పాజిటివ్‌గా నడిపించారు. కాలేజీలో ర్యాగింగ్‌కు భయపడి చదువే మానేసిన సగటు ఆడపిల్ల యమున. అక్కను ర్యాగింగ్ చేసిన వాళ్ళపై పోలీస్ రిపోర్ట్ ఇచ్చి వాళ్ళను కాలేజీ నుంచి డిబార్ చేయించగలిగిన ధీర అమృత. ఈ అక్కా చెల్లెళ్ళ పాత్ర చిత్రణ చాలా బాగుంది. ఆర్కిటెక్చర్ ఇంజనీరింగ్ చదివి కెరీర్ మంచిగా మలుచుకునే దశలో తన కారణంగా డిబార్ అయిన అక్షయ్‌ను బాస్‌గా చూసినపుడు కూడా అమృత దూరదృష్టితో చాలా సంయమనం పాటిస్తూ నలుగురిలో మంచి పేరు సంపాదించుకుంటుంది. అక్షయ్‌కు పూర్వజీవితపు జ్ఞాపకాలే కాదు, వాసనలు కూడా లేవని గ్రహించి అతనిని స్నేహితునిగా అంగీకరించే విశాల దృక్పథం గల

యువతి. నేటి సమాజంలో ఆడపిల్ల ఎలా వుండాలో, ఎలా వుంటే బాగుంటుందో అన్పించే పాత్ర అమృతది. పురుషాధిక్య సమాజంలో నెగ్గుకు రాగల నేర్పు, ధైర్యం, తెగింపు, తెలివితేటలు, తనకిష్టం లేనిచోట పనిచేయాల్సివచ్చినా తన ఎమోషన్స్, స్కిల్‌కు అడ్డురానీయని కార్యదక్షత, కుటుంబం పట్ల ప్రేమ, బాధ్యత అదేవిధంగా తన లక్ష్యం పట్ల స్పష్టమైన అవగాహన ఇన్ని మంచి లక్షణాల సజీవ ఆకృతి అమృత!

యమున విషయానికి వస్తే, పెళ్ళి చేసుకుని జీవితంలో సెటిల్ అయినా, తన చదువు పాడవడానికి కారణం రాగింగ్ చేసిన వాళ్ళేనని ఆవేశపడటం, తన చెల్లెలు అక్షయ్ కంపెనీలో చేస్తోందని తెలిసినపుడు చెల్లెల్ని దూషించడం, అతనితో స్నేహంగా వుంటే అపార్థం చేసుకోవడం, ఎంతసేపు తన పరిధిలో తన కోణం నుంచే ఆలోచించడం ఇవన్నీ యమున పరిణితి చెందని వ్యక్తిత్వానికి తార్కాణాలు. ఉక్రోషం, పంతం, తప్పులను పూర్తిగా ఎదుటి మనిషిపై తోసివేయడం యమున లక్షణాలు. ఈ రోజుల్లో ఆడపిల్లలు అలవోకగా పెద్ద పెద్ద చదువులు చదివి మంచి ఉద్యోగాలు సంపాదించుకొని, అవసరాన్ని బట్టి ఒంటరిగా విదేశాలకు కూడా వెళుతున్నారు. అయితే దీని వెనుక ఆడపిల్లల తల్లిదండ్రుల ఆలోచనా విధానం, చుట్టూ పరిస్థితులూ, ఆ అమ్మాయి ధైర్యం, సమర్థతా చాలా ప్రధాన పాత్ర వహిస్తాయి. ఇప్పటికీ చాలా కుటుంబాలలో వసంత, యమునల లాంటి వాళ్ళు వున్నారు. అవసరంలేని పిరికితనంతో ఎదుటివాళ్ళని నిరుత్సాహపరచి వారి భవిష్యత్తుకు అడ్డుకట్ట అవుతున్నారు. పెళ్ళి చేసేస్తే మన బాధ్యత అయిపోతుంది గదా అనే ఆలోచనలతో ఆడపిల్లల ఆశలను, ఆశయాలను ఈ అభద్రతా భావనలతో సమాధి చేసేస్తున్నాము. ఇలాంటి పరిస్థితి ఎదురయినప్పుడు తెగింపుగా అమృత ఆస్ట్రేలియాలో ఉద్యోగం సంపాదించి వెళ్ళిపోతుంది. తల్లిదండ్రులు, అక్క తనతో ఎలా ప్రవర్తించినా వారితో అనుబంధాన్ని అదేవిధంగా కొనసాగించి చివరకు వారందరి మెప్పు సాధిస్తుంది. తన కుటుంబ సభ్యులను నొప్పించకుండా, తాను జీవితంలో ఓడిపోకుండా వుండడానికి చేసిన తన ప్రయత్నాలు చక్కని ఆలోచనా ధోరణికి నిదర్శనాలు.

– ఆర్.ఎస్. మైత్రేయి, రాజమండ్రి

## యువతకు సందేశం

రూ. 50/- పొందిన సమీక్ష

అనురాధగారి నవల "ఆకృతి" ఆలోచనాత్మకంగానే కాక సందేశాన్నిచ్చేదిగా ఉంది. చివరివరకు వదిలిపెట్టకుండా చదివించింది.

ప్రతి పాత్ర సజీవంగా ఉంది. ర్యాగింగ్‌కు భయపడి చదువు మానేసిన యమున పిరికితనం- సగటు గృహిణి వసంత మధ్యతరగతి మనస్తత్వం, వ్యక్తిత్వాన్ని చక్కగా మల్చుకొన్న అమృత- జీవితాన్ని ఆడుతూ పాడుతూ అనుభవించాలనే అక్షయ్, సర్దుబాటు తత్వం గల దినేష్- ఇలా ప్రతి పాత్రనూ చక్కగా చిత్రీకరించారు.

ఏ శిల్పీ చెక్కకుండానే తన ఆకృతిని తనే మల్చుకొన్న అపురూపమైన శిల్పంతో అమృతను పోల్చడం చాలా బాగుంది.

ప్రతి చిన్న అంశాన్ని సునిశితంగా మలచారు. ర్యాగింగ్ సున్నిత మనస్తత్వం ఉన్న వారిని ఎలా కుంచించుకుపోయేలా చేస్తుందో దాన్ని స్పోర్టివ్‌గా తీసుకొంటే జీవితంలోని ఒడిదుడుకులని ఎలా ఎదుర్కోవచ్చో చక్కగా చూపించారు.

తల్లిదండ్రులను ఎదిరించడం ఇష్టంలేక కెరీర్‌ను నాశనం చేసుకోలేక అమృత అనుక్షణం పడిన ఆవేదన- తమ మాటే విన్పించుకొనేలా చేయాలని యమున చేసిన ప్రయత్నాలు, అమృత ఉన్నత వ్యక్తిత్వాన్ని జీర్ణించుకోలేక, పెద్దరికం నిల్పుకోవాలని ప్రయత్నించే తల్లిదండ్రులు మధ్యతరగతి మనస్తత్వానికి దర్పణం పట్టారు.

అమృతకు బాసటగా నిల్చిన అక్షయ్, ఆమె గొప్పదనాన్ని జీర్ణించుకోలేని అసూయాపరుడు దినేష్- ప్రోత్సహించే రామరాజు మన చుట్టూ ఉండే పాత్రలే.

ముగింపులో యమున- వసంత మారిపోవడం సహజంగా ఉంది. మనస్తత్వశాస్త్ర అనుగుణంగా ఉన్న ఈ నవల సామాజిక ప్రయోజనానుగుణంగా కూడా ఉంది.

రచయిత్రికి- చతుర సంపాదకవర్గానికి అభినందనలు. చతుర ప్రపంచం- కాలాతీతం శీర్షికలు వినూత్నంగా ఉన్నాయి.

– షణ్ముఖ్ ద్రోణ, మంచిర్యాల్



# చతుర ప్రవేశిక



## జనవరి 08

జనవరి 'చతుర' చదివారా? అయితే ఈ ప్రశ్నలకు ఒకేఒక్క మాటలో జవాబు రాయగలరేమో ప్రయత్నించండి. అన్నీ సరిగా రాసినవారికి ఆకర్షణీయమైన బహుమతులు లభిస్తాయి.. (ఎక్కువమంది సరైన సమాధానాలు రాస్తే డ్రాతీసి విజేతలను ఎంపికచేస్తాం. విజేతల ఎంపికలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. సంపాదకులదే తుదినిర్ణయం).

1. సరితతో ఫోన్‌లో అశ్లీలంగా మాట్లాడిన వ్యక్తి ఎవరు?
2. వకుళ లాయర్ పేరేమిటి?
3. ఆనంద్ తల్లి పేరు?
4. వకుళ కొడుకు చదివే స్కూల్ పేరేంటి?
5. ఆఫీసులో సరిత బాస్ ఎవరు?
6. అమెరికా నుంచి సరితకు చీరలు, బహుమతులు పంపేదెవరు?
7. ఆనంద్ సరిత ఇంట్లో ఎవర్ని కొట్టాడు?
8. రాహుల్ పుట్టినరోజుకు మాధవి ఇచ్చిన బహుమతి?
9. మాధవి తన ఆస్తిపాస్తుల్ని ఎవరికి రాసిచ్చింది?
10. మీనా చేతిలో వాతలు తేలేలా దెబ్బలు తిన్న పసివాడు?
11. సుందరం నగరానికి ఎందుకు వచ్చాడు?
12. అమ్మ నవలలో తల్లి పేరేంటి?
13. గోర్కీకి స్వాగత సత్కారాల సన్నాహాలు చేసిన అమెరికా అధ్యక్షుడు?
14. మంగారం ఏ బొమ్మలు వేయడంలో నేర్పరి?
15. సామాన్యశాస్త్రం పేరుతో ప్రచురణలు సాగించేదెవరు?

---

పంపినవారి పేరు: ------------------------------ వయసు (    )

చిరునామా: ----------------------------------------

----------------------------------------

----------------------------------------

పిన్‌కోడ్:                    ఫోన్ నెం:

ప్రవేశికలు పంపాల్సిన చిరునామా : సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 082



✦ ప్రవేశికలు మాకు చేరాల్సిన చివరి తేదీ ఈనెల 20

## ఆశావాదం

రూ. 50/–
పొందిన సమీక్ష

నేడు ఎక్కడ చూసినా ర్యాగింగ్ ర్యాగింగ్.. ఈ ర్యాగింగ్ రక్కసిపాదాల కింద ఎన్నో జీవితాలు నలిగిపోతున్నాయి. కోటి ఆశలతో, కోరికలతో కాలేజీలోకి అడుగు పెడుతున్న జూనియర్స్‌ని ర్యాగింగ్ పేరుతో హింసించి వారి కెరీర్‌ను దెబ్బతీస్తున్నారు సీనియర్స్. దీనివలన వారి భవిష్యత్తు అగమ్యగోచరమైపోతోంది. కొందరైతే ఆత్మహత్య చేసుకుంటున్నారు. తరచూ ఇలాంటి వార్తలు పత్రికలలో మనం చూస్తూనే వున్నాం. ఇలాంటి ర్యాగింగ్ నేపథ్యంలో ఓ కుటుంబంలో జరిగిన సంఘర్షణ, దాని పర్యవసానాన్ని మూలవస్తువుగా తీసుకుని, దానికి తనదైన శైలిని జోడించి ఆద్యంతం అపురూపంగా 'ఆకృతి' నవలను మలిచారు రచయిత్రి 'అనూరాధ' గారు.

ఇక నవల విషయానికొస్తే ఒకే తల్లి బిడ్డలయిన యమున, అమృతలవి భిన్న మనస్తత్వాలు. అర్థంలేని భయం ఒకరిదైతే, అణువణువునా తొణికిసలాడే ఆత్మవిశ్వాసం మరొకరిది. ర్యాగింగ్‌కు భయపడి, ఆత్మవంచనతో చదువుకీ, కెరీర్‌కీ ఫుల్‌స్టాప్ పెట్టేసి సంసారంలో చిక్కుకోవడం యమున నిరాశావాదానికి తార్కాణమైతే, పట్టుదల, ఆత్మవిశ్వాసానికి నిదర్శనమైన అమృత చదువు పూర్తిచేసి ఆర్కిటెక్ట్‌గా చేరడం, అక్కడ అక్కను ర్యాగింగ్ చేసిన అక్షయే బాస్‌గా రావడంతో ఎంతో మానసిక వేదనకు గురి అవుతుంది. అక్షయ్ దగ్గర పనిచేస్తుందనే విషయాన్ని తెలుసుకున్న తల్లిదండ్రులు, అక్క తనను నిందిస్తుంటే, అపార్థం చేసుకుంటుంటే, అసహ్యించుకుంటుంటే ఎంతో క్షోభ పడుతుంది. తను ఒంటరైనా ఆశావాదంతో తను సాధించాలనుకున్న లక్ష్యాలనందుకోవడానికి ధైర్యంగా ముందుకెళ్లి అంతులేని సాహసంతో ఉన్నత శిఖరాలను అధిరోహిస్తుంది. ఒక దశలో తన కూతురిలో చెల్లెలి పోలిక వుందంటేనే భగ్గుమనే యమున చివరకు తన కూతురు అమృతలానే వుండాలని కోరుకోవడం ఆమెలో కలిగిన కనువిప్పుకు నిదర్శనం.

అమృత పాత్రను మలచడంలో రచయిత్రి ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నారు. 'ఏ శిల్పీ చెక్కకుండానే తన ఆకృతిని తనే మలుచుకున్న అపురూప శిల్పంలా' లాంటి మాటలతో మంచి ముగింపునిచ్చారు రచయిత్రి. మంచి నవల అందించిన 'చతుర'కు, రచయిత్రికి జోహార్లు.

– 'సుందరి' గొల్లలవలస

## ఆద్యంతం ఆసక్తికరం

రూ. 50/–
పొందిన సమీక్ష

అనూరాధగారి ఆకృతి నవల ఆద్యంతం ఆసక్తికరంగా సాగింది. అక్షయ్‌ది దుష్టపాత్రగా పరిచయమైనా క్రమేణా దాన్ని హీరో స్థాయికి తీసుకువచ్చిన రచనాశైలి అభినందనీయం. ఆకృతి సంస్థకు బాస్‌గా బాధ్యతలు నిర్వహించిన అక్షయ్, గతంలోని ర్యాగింగ్ సంఘటన గురించి 'ఎప్పుడో కాలేజీలో జరిగిన సంఘటన నేనెప్పుడో మరిచిపోయాను' అనటం అతని వ్యక్తిత్వానికి మచ్చుతునక. అమృత ఆత్మవిశ్వాసంతో వేసిన ప్రతీ అడుగు ఆలోచనాత్మకంగా కన్పిస్తుంది. ఆమె ఆలోచనలు ఒక పట్టాన కుటుంబసభ్యులకే అర్థం కానట్లుగా ఉన్నా చివరికి ఆమె తీసుకున్న నిర్ణయాలు సమర్థనీయంగా ఉంటాయి. ప్రతీ యువతి అనుసరించాల్సిన మార్గంగా ఉంటుంది. ఆర్కిటెక్ట్‌గా వృత్తిలో రాణించిన అమృత, తల్లిదండ్రులకు షష్టిపూర్తి ఏర్పాటు చేయటం, అదీ ముందుగా తెలియజేయకుండా ఉండటం క్లైమాక్స్ సీన్‌గా తీర్చిదిద్దారు. అక్షయ్‌ని మొదటి నుంచి వ్యతిరేకించిన యమున చివర్లో హఠాత్తుగా మారిపోయింది. ఎందుకంటే ప్రశాంత్ పరోక్షంగా అమృతని తొలుత నుంచి సమర్థించటం యమునలోని సానుకూల దృక్పథాన్ని ప్రేరేపించి వుంటుంది అమృత తన పెళ్ళికి ఏర్పాట్లు చేసుకుంటోందేమోనని ముందు తను తొందరపడ్డా చివరికి అవి అపార్థాలేనని తేలడంతో ఆమెకు కనువిప్పు కలుగుతుంది. ముగింపు పాతగా అన్పించినా యమున, అమృతతో మాట్లాడటం కొసమెరుపు. అదే సమయంలో అక్కాచెల్లెళ్ళ అనుబంధాన్ని కూడా చూపించారు. చివరికి అక్షయ్‌నే అమృత వివాహమాడుతుందనే విషయం చెప్పకనే చెబుతున్నట్లుగా నవల ముగించారు. రచయిత్రి కేవలం మూడే నవలలు రాసినా పరిణితి చెందిన రచనాశైలి నవలలో కన్పించింది. రచయిత్రి అనురాధ గారికి అభినందనలు.

–హెచ్.వి. శ్రీనివాసరావు, రేలంగి

# బతికిన కోడి

## కథవెనుక కథ



**సా**హిత్యంలో కొన్నిపాత్రలతో మనని మనం ఐడెంటిఫై చేసుకోవడం సహజం. కానీ మనమే.. సాహిత్యంలో భాగమైతే..? మన గురించీ ఒక పుస్తకం రాస్తే..? మనకంత సీన్ లేదు. మన గురించి ఎవరు రాస్తారు? మనం రాసుకున్నా ఎవరు చదువుతారు... అంటారు కదూ? అయితే మీరీ రచయిత గురించి తెలుసుకోవాలి. ఇన్నాళ్లూ మనం 'కథల వెనక కథలు' తెలుసుకున్నాం. ఈసారి జీవితాలను కథలుగా మలుస్తున్న ఓ వ్యక్తి గురించి, తనను అందుకు ప్రోత్సహించిన పరిస్థితుల గురించి తెలుసుకుందాం.

సామాన్యశాస్త్రం ప్రచురణల పేరుతో ఇప్పటికి పది పుస్తకాలు వెలువరించారు కందుకూరి రమేష్‌బాబు. 'ఈ జగత్తులో బతికిన మనుషులందరి కోసం ఓ లైబ్రరీ తెరవాలి. అందులో మీ పరిచయ వ్యాసం తప్పక ఉండాలి' అన్నది రచయిత నమ్మిన సిద్ధాంతం. దానికి కట్టుబడి కేవలం సామాన్యులను ఎంచుకుని వారి జీవితాలను అక్షరబద్ధం చేస్తున్నారు.

అసామాన్యమైన విషయాలకు నేపథ్యమూ అసాధారణంగానే ఉంటుంది. కరీంనగర్ జిల్లా ఎల్లారెడ్డిపేటలో ఓ బడిపంతులింట జన్మించారు రమేష్‌బాబు. ఆంగ్లంలో ఎం.ఎ. చేసి లెక్చరరవ్వాలన్నది సాహిత్యాభిమాని అయిన అతడి కోరిక. ఆ క్రమంలో అయాన్ ర్యాండ్‌ని చదివారు. 'మీరు ఒక విషయాన్ని విశ్వసిస్తే, సత్యమని నమ్మితే ఆ క్షణం నుంచి దాన్ని అనుసరించాలి. అలా చేయనట్లైతే అది సత్యమైనా కాకపోవాలి.. మీరు మనిషైనా కాకపోవాలి..' రచయిత్రి రాసిన ఈ మాటలు అతనిలో ఆలోచన రేకెత్తించాయి. లెక్చరర్‌గా.. స్వచ్ఛంద సంస్థలో.. ఎక్కడ పనిచేస్తున్నా అసలు లక్ష్యం మనసును తొలిచేస్తూనే

**'ఈ జగత్తులో బతికిన మనుషులందరి కోసం ఓ లైబ్రరీ తెరవాలి. అందులో మీ పరిచయ వ్యాసం తప్పక ఉండాలి' అన్నది రచయిత నమ్మిన సిద్ధాంతం.**

ఉంది. దాంతో సొంత ఊళ్లోనే 'ద ఎంటర్‌టైనర్' పేరుతో సైక్లోస్టైల్ చేసి ఇంటింటికీ తిరిగి సరఫరా చేస్తూ ఒక పత్రిక నడిపారు. మూడునెలలకే చుట్టుపక్కల ఊళ్లలోనూ మంచిపేరు వచ్చింది. పాత్రికేయుడిగా ఉద్యోగంలో చేరాక ఓ పత్రికలో సామాన్యశాస్త్రం, ఫెయిల్యూర్ కాలమ్ లాంటివి నిర్వహిస్తున్నప్పుడు రమేష్‌కి ఒక విషయం అర్థమైంది. ఎవరిగురించైనా రాయడానికి రచయితకున్న అవకాశం సామాన్యులకు లేదని. పాత్రికేయ రచయితగా 'కొళ్లమంగారం మరికొందరు' పేరుతో తొలిపుస్తకం ప్రచురించారు. అందులో 18 మంది సామాన్యుల

గురించి వ్యాసాలున్నాయి. ఆ తర్వాత రచననే పూర్తిస్థాయి వృత్తిగా చేపట్టి పాత్రికేయాన్ని ప్రవృత్తికి పరిమితం చేశారు రమేష్. ఫలితంగా మూడేళ్లలో పది పుస్తకాలు ప్రచురించగలిగారు.

కేవలం తన పని పట్ల ప్రేమతో, స్నేహితులిచ్చే విరాళాలతో పుస్తకాలు ప్రచురించి, వాటిని స్వయంగా అభిమానుల చేతికి అందించే ఈ యువ రచయిత రచనలు చాలావరకు ప్రథమపురుషలోనే సాగుతాయి. ఆయన రాసిన రచనల్లోని ప్రధానపాత్రలన్నీ ఇప్పుడాయన జీవితంలో చక్కటి అనుబంధాలుగా మారిపోయాయి. ఎవరి గురించి పుస్తకం రాసినా ఆ పుస్తకానికి అందిన ప్రతిఫలంలో సగం వారికే ఇచ్చేస్తారు. తనకీ అభిమానులకీ మధ్య అసలు దూరమనేది లేదనే రమేష్ నోబెల్ బహుమతి పొందిన రచయితకన్నా ఎక్కువ సంతోషంగా ఉన్నానంటారు.



కన్నబిడ్డలతో చిత్రకారుడు మంగారం

రమేష్ సామాన్యశాస్త్ర ప్రచురణల్లో తొలి రచన కోళ్ల మంగారం అనే వ్యక్తి గురించి. ఆరో పుస్తకం 'బతికిన కోడి' కూడా అతని గురించే. ప్రస్తుతం 'మంగ' అని మరో పుస్తకమూ అతనిపైనే రాబోతోంది. ఇకనుంచీ కోళ్ల మంగారం గురించి ఏటా ఒక పుస్తకం ప్రచురించాలన్నది తన ఆశయమన్నారు రమేష్. ఈలోకంలో లేని ఒకవ్యక్తి గురించి ఆయన ఇన్ని పుస్తకాలు ఎందుకు... ఎలా... రాస్తున్నారంటే...

"మా ఇంట్లో గోడపై ఒక పెయింటింగ్ ఉంది. అది మంగారం వేసిన వాళ్ల మామయ్య పోట్రెయిట్. దాన్ని మా ఇంట్లో ఎందుకు పెట్టుకున్నానూ అన్నా.. ఇలాంటి పుస్తకాలు ఎందుకు రాస్తున్నారన్నా.. కారణం ఒకటని చెప్పలేను. నా ఆశయం చెప్పానుగా.. దానికి ప్రాణం పోసే ఒక కారణం డేనియల్.. మంచి చిత్రకారుడు. బతికినకోడి పుస్తకం చదివినప్పటినుంచి మంగారం కుటుంబానికి మంచి జరగాలని చర్చికి వెళ్లి ప్రార్థన చేస్తున్న సగటు మనిషి. మంగారం కోడిబొమ్మలకు చాలా పేరు. తలెత్తుకుని ఒకపాటి రాజసంతో జిగేల్మనే కళ్లతో ఉంటుందా బొమ్మ. అటువంటి కళ్లే వాళ్ల మామయ్య పోట్రెయిట్లోనూ ఉన్నాయి. అందుకే ఆ బొమ్మ వచ్చినవాళ్లందరికీ చూపించాలనుకున్నాను. నా గుండెలో పదిలంగా ఉన్న మంగారం జీవితాన్ని నలుగురికీ చూపేందుకే పుస్తకం రాశాను. గత నవంబరుకి రోడ్డుప్రమాదంలో మంగారం మరణించి ఆరేళ్లు.

మంగారం కోడిబొమ్మలే కాదు దేవీదేవతలను కూడా గొప్పగా చిత్రించే సాధారణ సైన్‌బోర్డు ఆర్టిస్టు. ఒక పత్రికలో మంగారంపై నేను రాసిన వ్యాసం అతని కుటుంబానికి నష్టపరిహారం అందేందుకు దోహదపడింది. బస్సు ప్రమాదంలో కోళ్ల మంగారం మరణించడంతో నష్టపరిహారం ఇప్పించమని అతని భార్య కోర్టుకెళ్లింది. ఆ క్రమంలో మంగారం సామాజిక హోదా, సంపాదన, సంఘంలో పేరుప్రఖ్యాతులు... తదితర అంశాలన్నీ వ రి గ ణ న లో కి వచ్చాయి. నేను రాసిన వ్యాసం అతడి గొప్పతనాన్ని వివరిస్తూనే ఆర్థికంగా తన కళద్వారా మెరుగైన జీవితాన్నే గడిపినట్లు చెప్పింది. ఆయన చిత్రకళ అతి సామాన్యంగానే కనబడినా సమాజంలో దిగువశ్రేణి జీవితాల్లో అదొక విడదీయరాని భాగమని పేర్కొంటుంది. మొత్తానికి ఈ వ్యాసం అతడి కుటుంబానికి ఐదు లక్షల రూపాయల నష్టపరిహారం ప్రకటించేందుకు ఉపకరించింది. ప్రకటించేందుకే అని ఎందుకన్నానంటే తీర్పువచ్చి ఏడాది దాటింది. అంత మొత్తం ఇవ్వలేమని ఆర్టీసీ హైకోర్టుకి అప్పీలు చేసుకుంది. ఇది జరుగుతున్న కథ.

మంగారం భార్య, బిడ్డలతో కోర్టుకు వెళ్లడం,

అతని తల్లిదండ్రులు, తోబుట్టువులు, స్నేహితులను కలుసుకోవడం, ఒక్కొక్కరు మంగారం గురించి విశేషాలు చెప్తోంటే అతడి మూర్తిమత్వం, కళావిశేషాలు నన్ను ఆశ్చర్యచకితుడ్ని చేశాయి. ఓ సామాన్యుడి జీవితం ఎంత హృద్యంగా, మరెంత ఘర్షణతో, చీమూనెత్తురూ, జవసత్వాలతో కళకళలాడుతుందో చెప్పాలనిపించింది. చెప్పాను. అలా 'బతికిన కోడి' పుట్టింది.



కందుకూరి రమేష్‌బాబు

అతి సామాన్యమైన మనుషులు న్యాయంకోసం కోర్టు గడపతొక్కితే ఎన్ని ఇబ్బందులు, ఎంత మనస్తాపం, భంగపాటు ఉంటాయో... అదంతా నలుగురితో పంచుకోవాలనిపించింది. ఈ క్రమాన్ని చెప్పేందుకూ నేనీ పుస్తకం రాశాను. నిజానికి నేనొక పాత్రికేయుడిగా కాక రోజు రోజుకూ వారి కుటుంబంలో ఒక పాత్రను కావడంవల్ల కూడా రాయగలిగాను. ఒక మనిషిని చూడకుండా అతడి గురించి, అతడి తదనంతర జీవితం గురించి పుస్తకం రాశానంటే నాకే ఆశ్చర్యంగా ఉంటుంది. ఒక మిత్రుడు అతడి బొమ్మల గురించి చెప్తోంటే విని స్పందించి వ్యాసం రాశాను. మూడేళ్ల తర్వాత కోర్టు విశేషాల నేపథ్యంతో తెగని ఆ కేసు గురించి వివరాలు, కుటుంబ పరిస్థితి చెప్తూ ఆ వ్యాసాన్ని పొడిగించాను. మరో రెండేళ్లకు 'బతికిన కోడి' పుస్తకం విడుదల చేశాను. ఆ సభలో అందెశ్రీ అన్న గాయకుడు మంగారంపై పాట కట్టి పాడారు. ప్రొఫెసర్ హరగోపాల్ 'కల్పన మాత్రమే నవల' అనే భావాన్ని ఈ పుస్తకం తొలగిస్తుందన్నారు. మొత్తానికి ఒక మనిషి జీవితం అక్షరాలా నమోదవడాన్ని చర్చించడం.. నెరవేరుతున్న నా ఆదర్శంలో గొప్ప మలుపుగా భావించాను.

ఈ పుస్తకం ఎంత ప్రజాదరణ పొందిందంటే నన్ను దీని ద్వారా గుర్తుపట్టేవాళ్లే ఎక్కువ. రాజధానిలో ఈ పుంజును చూశారా? అన్న వ్యాసంతో ప్రారంభమైన మంగారం జీవితం... తర్వాత కాలంలో బతికిన కోడి పుస్తకంగా మారి రాష్ట్రమంతా తిరుగుతుందని, విదేశాలకు కూడా వెళ్తుందని అనుకోలేదు. ఈ పుస్తకం చదవాలని మీకూ అన్పిస్తే సామాన్యశాస్త్రం డాట్‌కామ్ అనే నా వెబ్‌సైట్‌నుంచి డౌన్‌లోడ్ చేసుకోవచ్చు.

ఆస్కార్‌వైల్డ్ అంటాడు ఆర్ట్ ఈజ్ లాంగ్ అని. జీవితం స్వయంగా కళ... చిరంజీవి... అంటాన్నేను. అందుకే మంగారం మరణించినా బతికిన కోడే. ఆయన బతికే ఉన్నాడు ఆనోటా ఈనోటా. వీధుల్లో, దేవాలయాల్లో, గుండెల్లో, గుడిగంటల్లో.. తనవారి నాలుకల మీదినుంచి బుద్ధిజీవుల దాకా వచ్చాడు. బహుశా రచనావ్యాసంగం అంటే అది సామాన్యుల హృదయాల నుంచి బుద్ధిజీవుల మేధస్సుదాకా వేసే వంతెన కావచ్చనిపిస్తోంది" అదండీ రమేష్ బాబు అంతరంగం.

సేకరణ : విస్మయ

Owned, Printed, Published and Edited by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally-500 072, Ranga Reddy District. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore:25583804. & www.eenadu.net.




## అమ్మో.. ఎంత తెలివి!

తీక్షణంగా పరిశీలించి చూస్తే తప్ప పగటిపూట చూపరులకు కనిపించకుండా మోసగించే ఈ పక్షి పేరు పోటూ. మెక్సికో, వెస్టిండీస్, అర్జెంటీనా దేశాల్లో నివసిస్తుందీ విహంగం. మోడువారిన చెట్టు కొమ్మపై కదలకమెదలక కూర్చుంటే దీనిని పక్షి అని గుర్తించడం ఎవరికైనా కష్టమే. కారణం దీని రెక్కల రంగు ఆ కొమ్మ రంగులో కలిసిపోయి ఉంటుంది. ఆత్మ రక్షణకోసం ప్రకృతి వీటికిచ్చిన వరం ఈ రంగు!

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2006-2008 RNI/32186/78


# "క్షీర్‌పాక్ విధి"

తో సమృద్ధం చేయబడిన
ప్రపంచ ప్రప్రథమ, ఏకైక కేశతైలం

చుండ్రు, బాలనెరుపు, జుట్టురాలటం,
జుట్టుకొసలు చిట్లిపోవటం సమస్యలా ???

## మరో మార్గంలేదు ...!!!

www.sesahaircare.com



మొత్తం కుటుంబం కోసం
18 విశిష్ట మూలికలు
+
ఆవుపాలు
+
5 విశిష్ట తైలములు
తో సమృద్ధం చేయబడినది.

A quality product of BAN® Since 1966














SESA is not Cosmetic or Tolletry Preparation.

PRITHVI

*Accepted by billions....have you tried ?*

For Trade Enquiry
Marketed by: M/S Sarika Enterprises, Indore (MP) Tel : 0731 - 2590917 / 18,
S.S M/S Ramdev Enterprises, Hyderabad (AP) Tel : 040 - 24600958 / 65523453,
S.S M/S Golecha Pen Co., Vijayawada (AP)Tel : 0866 - 6660333 / 6699585